# ప్రపంచ కథావళి

(నీగ్రో, రెడ్ ఇండియన్ జానపద గాథలు)

అనువాదం :

బి. వి. సింగరాచార్య

వెల :

రు. 1—4—0

కళ్యాణీ ప్రచురణలు

16/17 గజపతి లాలా లేన్

మద్రాసు-5.

First Edition; 1957
1500 Copies
**Price : Rs. 1-4-0.**

# PRAPANCHA KATHAVALI

(A COLLECTION OF AMERICAN FOLK AND FAIRY TALES)

*Translated by:*

**B. V. Singaracharya**

*Published by :*

**Kalyani Prachuranalu,**

MADRAS-5.

# తొలి పలుకు

ఒక జాతి సంస్కృతి ఆ జాతి లలిత కళలలో, ముఖ్యంగా సాహిత్యంలో,- తత్రాపి జానపద సాహిత్యంలో ప్రకృష్టంగా పరిమ ళిస్తుంది. సంస్కారులైన రచయితలు ప్రయత్న పూర్వకంగా సృష్టి చేసే మార్గ సాహితిలో కన్న, ప్రాకృత ప్రజల హృదయాలలోనుంచి సహజంగా ఉబికి వచ్చి, పలువురి నోళ్ళలో నలిగి నలిగి చవులూరే దేశి సాహితిలోనే మరింత ఎక్కువగా ఒక జాతి హృదయ స్పంద నం వినిపిస్తుంది.

ప్రపంచంలోని వివిధ జాతుల మధ్య వేష భాషలలోను, ఆహార విహారాదులలోను నిశితమైన వ్యత్యాసాలు కన్పిస్తున్నా, అన్ని జాతులలోను ఒకే మానవ హృదయం, ఇంచు మించు ఒకే విధమైన ఆశలతో, ఆశయాలతో, అనుభూతులతో స్పందిస్తూం దని ప్రపంచ జానపద సాహిత్యం విస్పష్టం చేస్తూంది. అందుచేత- జాతికీ జాతికీ మధ్య ఉన్న ఈర్ష్యాద్వేషాల కుడ్యాలు కూలిపోయి, జగ దేక రాజ్యం ఏర్పడడం కోసం ఈ నాడు సాగుతూన్న మహాకృషికి వివిధ జాతుల జానపద సాహిత్యాన్ని ప్రపంచ భాష లన్నిటిలోను ప్రచురించడం ఎంతైనా దోహదం చేయగలదు. ఆ దృష్టితోనే అమెరికాలో విభిన్న మండలాలలో ప్రచారంలో ఉన్న కొన్ని జాన పద గాథల అనువాదాలు ఈ రూపంలో మా ప్రథమోపహారంగా ఆంధ్ర పాఠక లోకానికి సమర్పించుకుంటున్నాం.

రాకేల్ ఫీల్డ్ సంకలనం చేసిన "**American folk and fairy Tales**" అనే గ్రంథంలో నుంచి ఈ కథలు అనువదించ బడినవి. అమెరికా ఆదివాసులైన ఎర్ర ఇండి యనులలోను, అమెరి కాకు ఆఫ్రికానుంచి వలస వచ్చిన నీగ్రోలలోను ప్రచారంలో ఉన్న కథలే ఈ గ్రంథంలో అధిక భాగం ఆక్రమించినవి.

తరతరాలుగా లిఖిత రూపం లేకుండా, ప్రజల నాలుకల మీదనే ప్రవహించి వచ్చిన ఈ జానపద సాహితీ స్రవంతి ఈనాటి యంత్ర నాగరికతా మరుభూమిలో ఇంకి పోకుండా-అమెరికా వంటి దేశాలలో మాక్ కాయ్, స్టీవెన్స్, మాంటేగ్యూ కన్య, జోయెల్ చాండ్లర్ హారిస్, వాషింగ్టన్ ఇర్వింగ్, హాథారన్ మొదలైన విద్వాం సులు జానపద సాహిత్యోద్ధరణకు నడుం కట్టుకుని కృషిచేస్తున్నారు. తెలుగులో ఈ విధమైన కృషి ఇంత వరకు సక్రమమైన పద్ధతిలో ప్రారంభం కాకపోవడం శోచనీయం. ప్రస్తుత ప్రచురణ తెలుగు జానపద గాథల సేకరణకు సమర్థులైన విద్వాంసులు పూను కునేందుకు ప్రోత్సహించ గలిగితే, మా కృషి చాలవరకు చరితార్థ మైందని ఆనందించగలము.

రాకేల్‌ఫీల్డ్ తన ఉపోద్ఘాతంలో పేర్కొన్నట్లు - జాన పద సాహిత్యాన్ని మార్గ సాహిత్యం నుంచి వేరుచేసి చూపే రెండు ప్రముఖ లక్షణాలు మనం గుర్తించ వచ్చు. మొదటిది : నిరాడం బరత, స్వచ్ఛత, గుండెకు సూటిగా తగిలే లక్షణం. రెండవది: ప్రకృ త్యతీత శక్తుల ప్రాభవం. అంటే - అద్భుత, అసంభవ సంఘటనల

వర్ణన. ఈ గ్రంథంలోని "రాలిన చుక్క" కథలో ఒక చెట్టు కొమ్మ పైకి పైకి పెరిగిపోగా, ఆకొమ్మల మీదుగా ఒకపిల్ల మరోలోకంలోకి వెళ్లిపోతుంది. అలాగే - రిప్ వాన్ వింకిల్ 20 ఏళ్ళ పాటు అఖండ నిద్ర పోతాడు. పీనాసి పెద్దమ్మ కథలో ఆవూ, గుఱ్ఱం, చివరికి జామి చెట్టూ కూడామనుష్యుల్లాగ ప్రవర్తించడం మనం చూస్తాం. ఆంబోతు రాక్షసుడి కామరూప ధారణ శక్తి చూసి ఆశ్చర్యపోతాం. ఇలాటి మానవాతీత శక్తుల ప్రాభవం జానపద సాహిత్యంలో అడుగడుగున ఎదురై మన భావనకు చక్కిలి గింత పెడు తుంది.

పేర్లలోను, కొంతవరకు వాతావరణంలోను ఈ కథలలో విజాతీయత కనిపించినా, పాత్రల ఆలోచనలలోను, అనుభూతుల లోను మనకు పూర్తిగా సాజాత్యమే కనిపిస్తుంది. ఈ కథలు చదువు తూంటే - చిన్న నాడు మనం ఆరు బయట వెన్నెలలో మన అమ్మమ్మల చుట్టూ కూచుని అతిశ్రద్ధగా ఊఁ కొడుతూ విన్న కథ లెన్నో అడు గడుగునా మనకు జ్ఞాపకం వస్తాయి.

మూలానికి విధేయంగా ఉంటూనే పాత్రోచితంగా తెలుగు నుడికారాన్ని, జాతీయాలను కూడ ఈ కథలలో ప్రవేశపెట్టి తెలుగు పాఠకుల హృదయాల కెక్కునట్లు రసవంతంగా అనువదించి ఇచ్చిన శ్రీమాన్ బి. వి. సింగరాచార్యులు గారికి, ముఖ చిత్రం వ్రాసి ఇచ్చిన కళాకారులు శ్రీ. వి. నారాయణరావుగారికి, ఈ గ్రంథాన్ని ఈ రూపంలో ముద్రించ గలగడానికి మాతో సర్వవిధాలా సహక

రించిన శ్రీ రంగా ప్రింటింగ్ వర్క్సు అధిపతి శ్రీ పి. అప్పారావుగారికి మా ధన్యవాదాలు.

ఈ కథలలో కొన్ని "ఆంధ్ర సచిత్ర వార పత్రిక" లోను "ఆంధ్ర ప్రభ వార పత్రిక" లోను ప్రకటించి ముందుగానే ప్రజలకు పరిచయం చేసిన ఆ పత్రికా సంపాదకులకు కూడా మేము మిక్కిలి కృతజ్ఞులము.

1-3-1957,
మద్రాసు-5.

ఇట్లు,
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు,
ప్రకాశకుడు

# కథా సూచి



# రాలిన చుక్క

★

## ఎర్ర ఇండియన్ల జానపద గాథ

★

అనగా అనగా అనగా ఒక పల్లెటూరు. ఆ పల్లెటూళ్లో అందమైన ఇద్దరు ఆడపిల్లలు. ఒక రోజు రాత్రి వాళ్ళిద్దరూ ఇంటిముందు వాకిట్లో మంచం వాల్చుకు పడుకుని పిచ్చాపాటీ కబుర్లాడు కుంటున్నారు. అందులో ఒక పిల్ల ఆకాశంకేసిచూస్తూ, "చూడక్కా..! ఆ చుక్క ఎంచక్కా ఉందో! చుక్కలన్నిటిలో ఆ చుక్కే నా కెంతో నచ్చింది" అంది. ఆ మాటలు విని రెండో పిల్ల ఇంకో చుక్కని చూపిస్తూ, "ఇదికాదే, నా మట్టుకు నాకు అదుగో! చూడు! ఆచుక్క బలే బాగుంది." అంది. మళ్ళీ మొదటిపిల్ల అందుకుని "నువ్వేమైనా చెప్పవే! ఆ చుక్కకున్న వెలుగు, అందం, చందం, అరిచిగీపెట్టినా

ఇంక దేనికీ రావు. నేను అసలు పెళ్లంటూ చేసుకుంటే ఆచుక్కనే చేసుకుంటా" నంది.

ఆ రోజురాత్రి వాళ్ళిద్దరూ ఇంట్లోకిపోయి పడుకుంటూ, "మళ్ళీ మనిద్దరం పొద్దున్నే లేచి పోయి కట్టెపుల్లలు ఏరుకు రావాలి తెలుసా? ఇక పడుకుందాం" అని కూడబలుక్కుని చక్కని చుక్కల్ని గురించి చక్కచక్కని కలలుగంటూ సుఖంగా నిద్రపోయారు. ఆ మర్నాడు పొద్దున్నే ఇద్దరూ నిద్రలేచి, పుల్లలకోసం అడవికి వెళ్ళారు. అక్కడ ఒక చెట్టుకొమ్మ చివర వాళ్ళ కొక ముళ్ళ ఎలుక (ఈ జాతివాళ్ళు ఆ ఎలుకల్ని పట్టుకుని తింటారు) కనిపించింది. నక్షత్రాన్ని పెళ్ళి చేసుకుంటానన్న చిన్న పిల్ల ఆ ముళ్ళ ఎలుకనిచూసి, "అక్కా! నేను చెట్టెక్కి దాన్నిపట్టుకొస్తా నుండవే!" అంటూ చెట్టుచివర ఆ ముళ్ళ ఎలుక ఉన్న కొమ్మమీదికి పాకిపోయింది. కాని ఆ ముళ్ళ ఎలుక తమాషాగా ఆమె పైకి ప్రాకినకొద్దీ తానింకా పైకిపైకి పోవడం ప్రారంభించింది. తీరా, ఆమె తన దగ్గరగా వచ్చేసి కాలు పట్టుకో బోయే సరికల్లా ఆ ముళ్ళ యెలుక ఆమె కందకుండా ఇంకొంచెం పైకిపోతూంది. దీనికితోడు ఇంకా చిత్రమేమిటంటే ఆ చెట్టుకూడ ఇంకా ఎత్తుగా పెరిగిపోతూన్నట్టు కనిపిస్తూంది. ఇదిచూసి, కింద ఉన్న పిల్ల "ఏమేవ్! దిగిరావేవ్! చెట్టు అంత కంతకు ఆకాశంలోకి పెరిగిపోతూంది" అని అరిచింది. దానికి చెట్టుమీది పిల్ల "ఎందుకే! ఇదుగో! ముళ్ళఎలుక ఇంకొక్క క్షణంలో నాచేతికి దొరికిపోతుంది.

ఇంక బారెడుదూరం పైకెక్కితేచాలు." అంటూ ఇంకా పైకి పాకు తూంది. ఆ చెట్టు ఇంకా ఇంకా ఆకాశంలోకి పెరిగిపోతూంది. క్రమంగా క్రిందఉన్న పిల్లకి చెట్టుమీద పిల్ల కనపడడం లేదు. దాంతో ఆ పిల్లకి భయంవేసి, ఇంటికి పరిగెత్తి వాళ్ళ వాళ్ళందరికీ ఈ సంగతి చెప్పేసింది. వాళ్ళంతా చెట్టుదగ్గరికి పరుగెత్తుకొచ్చారు. ఆ పిల్ల ఎక్కడా కనిపించలేదు. చెట్టుపైన ఎక్కడో ఆకాశంలో క్రిందవాళ్ళెవరికీ కనిపించనంత ఎత్తున ఎక్కడ ఉందో!

ఆ చెట్టు ఇంకా పెరిగిపోతున్నకొద్దీ ఆ పిల్ల అలాగే పైకి ఎక్కుతూ పోయేసరికి, ఒకచోట ఆమెకు ఇంకోలోక మేదో కనిపించింది. ఆ లోకంలోకి దిగి నడిచిపోవడం మొదలుపెట్టింది. కొంతదూరం వెళ్ళేసరికి, మంచి వయస్సులోఉన్న ఒక యువకు డామెకు ఎదు రయాడు. అతడు పలకరించేసరికి, ఆ పిల్ల ఏడవటం మొదలు పెట్టింది. "ఎందుకు ఏడవటం? నిన్నరాత్రేగా నన్నే పెళ్ళిచేసుకుంటా నన్నావు!" అన్నాడు. ఆ చక్కని నక్షత్రం అతడే అని ఆమెకు తెలిసి పోయింది.

అతడా పిల్లను పెళ్ళాడాడు. ఒక చక్కని కొడుకు కూడా పుట్టాడు. ఇద్దరూ సుఖంగా ఉంటున్నారు. ఇలా ఉండగా ఒక నాడు అతడు ఆమెతో "ఇరుగు పొరుగు ఆడవాళ్ళతోపాటుగా ఇకనుంచీ నువ్వుకూడా అడవికిపోయి 'పోమీబ్లాంచీ' దుంపలు తవ్వుకు వస్తూ ఉండు. కొన్ని పెద్ద ఆకుపచ్చనితల గల దుంపలుమాత్రం ఎప్పుడూ

తవ్వకు. అది ఒక ఓషధి. దాన్ని ఆశ్రయించి ఒక దేవత ఉంటుంది. అందుచేత, ఆ ఓషధిమాత్రం ఎప్పుడూ తవ్వకు," అన్నాడు. ఆనాటి నుంచి ఆమె రోజూ దుంపలు తవ్వకు రావడానికి వెళుతూండేది. ఒక రోజున కొన్ని దుంపలు త్రివ్వినతరువాత ఆమెకొక ఆలోచన తట్టింది. "ఆయన ఈ పచ్చని దుంపని తవ్వవద్దన్నా రెందుకో! తమాషాగా ఒకసారి తవ్విచూద్దాం; ఏమవుతుందో!" అనుకుంది. ఆ ప్రకారం పచ్చదుంప త్రవ్వి భూమిలోంచి పైకిలాగేసరికి అక్కడొక పెద్ద సొరంగం ఏర్పడింది. ఆసొరంగంలోంచి క్రింద ఎక్కడో దూరాన ఉన్న తన పుట్టిన ఊరు, అడవీ అన్నీ కనిపిస్తున్నాయి. ఆ పల్లెటూరు, ఆ చెట్లు, ఇటూ అటూ తిరుగుతూన్న ఆమనుష్యులు అంతా చిన్న చిన్న నలకలలాగ కనిపిస్తున్నారు. వాళ్ళని చూడగానే ఆమెకు పుట్టింటిమీద మనసు పోయింది. వెళ్ళి తన వాళ్ళనందరినీ ఒకసారి చూచిరావాలని ప్రాణం తహ తహ లాడింది. కాని అంత క్రిందికి ఎలాదిగడం? ఏమీ పాలుపోలేదు. అక్కడికి దగ్గరలోనే గోగుకర్రలు బాగా పొడుగుగా పెరుగుతున్నయి. కొంతసేపు ఆలోచించగా, ఆలోచించగా, ఆ గోగుమొక్కల పుణ్యాన ఆమె కొక ఉపాయం తోచింది. ఈ గోగునారతో బాగా పొడుగైన తాడొకటి పేనలేనా అనుకుంది. తాడు పేనడం ప్రారంభించింది. చాలారోజుల పాటు పేనగా పెద్దతాడు తయారయింది. ఆమె భర్త, ఈమె వైఖరిలో మార్పుకని పెట్టి,"ఎందుకో! ఇలా రోజూ చాలా సేపు ఎక్కడికో పోతూంది" అనీ,"అక్కడఏమిచేస్తుందో"! అనీ ఆలోచించడం ప్రా



"....చాలాసేపు ఆ తాడు పట్టుకుని అలాగే వేలాడింది...."

(చూ. పుట 14.)

రంభించాడు.ఏమీ బోధపడక, ఒకరోజున ఆమెనే పిలిచి అడిగాడు. "ఏమీలేదు. నేను రోజూ చాలాదూరం నడిచి పోతున్నాను. దాంతో బాగా అలిసిపోయి, అలసట తీరేవరకు అక్కడే కూచుని, తరవాత వచ్చేస్తున్నాను," అని ఆమె జవాబు చెప్పింది. ఈ జవాబు నిజానికి అతని కేమీ అర్థంకాలేదు. చివరికి ఒకరోజున ఆమె అప్పటికి పేని నంత వరకే ఆ తాడు సొరంగంలోంచి క్రిందకు దిగేందుకు సరిపో వచ్చు అనుకుంది. ఆ తాడుని సొరంగం దగ్గరికి తీసుకుపోయి, ఒక కొస సొరంగంపైన అడ్డంగాపడవేసి బలమైన కర్రకుకట్టి రెండవ కొస దాంట్లోంచి క్రిందికి జారవిడిచింది. దాని క్రిందికొస భూమిని అంటు కున్నట్టే ఆమెకు కనిపించింది.తరువాత తనబిడ్డను ఒకగుడ్డతో గట్టిగా వీపుకి కట్టుకుంది. ఆతాడు పట్టుకుని సొరంగంగుండా భూలోకానికి దిగడం మొదలుపెట్టింది. చాలా సేపు మెల్లగా ఆతాడు వెంట క్రిందికి పాకిపోగా ఆతాడు ఆఖరు అయిపోయింది. దానికొస కింద వేళ్ళాడు తూంది. ఆతాడు పొడుగు చాలకపోవడం, భూమి తనకు ఇంకా చాలా దూరంలో ఉండడం ఆమె చూసింది. చాలా సేపు ఆ తాడుపట్టుకుని అలాగే వేళ్ళాడింది. కాని పాపం ఎంతసేపని అలా వేళ్ళాడుతుందీ! తాడు వదిలేసి క్రిందపడిపోయింది. శరీరమంతా హూనం హూనం అయి ప్రాణం విడిచింది. కాని, అదృష్టవశాత్తు ఆమె బిడ్డమాత్రం బ్రతికాడు.అతడి శరీరం రాతి శరీరం, అంత ఎత్తునించి పడ్డా చెక్కు చెదరలేదు.

అక్కడ ఎగురుతున్న ఒక బార్డుపక్షి అందమైన పిల్లవాడు క్రిందపడి ఉండడంచూసి, వాణ్ణి తీసుకుపోయి గూట్లో పెట్టుకుని, తన పిల్లలతోపాటుగా ఈ పిల్లవాణ్ణికూడా ప్రేమతో పెంచుతూంది. ఆ పిల్లవాడు ఎదిగి తగిన వయస్సు రాగానే తోటిచిట్టిపిల్లలతోపాటు గూటిలోంచి బయటికి రావడం మొదలు పెట్టాడు. ఆ పిట్టలు ఎదిగి పెద్దవైనకొద్దీ ఈ పిల్లవాడుకూడా ఏపుగాఎదుగుతున్నాడు. క్రమంగా ఆ పిల్లలు కొంచెం కొంచెం ఎగరడం నేర్చుకుంటూ ఉంటే వీడు పాకడం మానేసి లేచి నడవడం మొదలు పెట్టాడు. ఆ చిన్న పక్షులు యథేచ్ఛగా ఎక్కడికి పడితే అక్కడికి ఎగిరిపోవడం ప్రారంభించేసరికి, వాటితోపాటు తాను నేలమీద పరుగెత్తుతూ ఉండేవాడు. అలాగే క్రమంగా పెరిగి పెద్దవాడయాడు.

ఇంతలో కాలమానపరిస్థితులు మారిపోవడంవల్ల అచ్చటి పక్షులన్నీ దక్షిణాదికి వలసపోతున్నాయి. అందుచేత, తల్లిపక్షి ఈ పిల్లవాణ్ణి పిలిచి, "నాయనా! ఇంక కొద్దిరోజులలో ఈ ప్రాంతపు వాతావరణం మా పక్షిజాతి బ్రతకడానికి వీలులేనంత భయంకరంగా తయారు కాబోతూంది. అందువల్ల మేము దక్షిణాదికి వలసపోతున్నాము. నువ్వూ కొంచెం ఎదిగి పడుచువాడవు అయావు గనుక, మీ వాళ్ళదగ్గరికి వెళ్ళిపో!" అంది. "ఇదేమిటి? నన్నెక్కడో ఇంటికి వెళ్ళమంటావేమిటి? నేను మీతోటే వచ్చేస్తానమ్మా!" అన్నాడు ఆ కుర్రవాడు. "వద్దు నాయనా! నువ్వుమాతో రాలేవు. నువ్వు మీ

జాతివాళ్ళదగ్గరికి వెళ్లు. అదుగో చూడు! ఆ యేటి వొడ్డునే నడుస్తూ పోతే మీ వాళ్లుండే పల్లెటూళ్లు కనిపిస్తాయి. ఆదారినే వెళ్లు నాయనా!" అని ఆ పక్షి తన పెంపుడు కొడుక్కి నచ్చచెప్పింది. "సరే నమ్మా! నువ్వు నాకొక గొప్ప విల్లూ, కొన్ని అమ్ములూ తెచ్చియిస్తే,అలాగే వెళతాను," అన్నాడు ఆఖరికి. ఆ పక్షి ఒక గొప్ప విల్లు, నాలుగు బాణాలూ తెచ్చి ఆ బాణాల చివర తన ఈకలనే తీసి కట్టి ఇచ్చింది. తరువాత ఆ కుర్రవాడు వెళ్ళవలసిన దారి చూపించింది. వాడు ఆ దిక్కుగా బయలుదేరిపోయాడు.

అలా వెళ్ళగా వెళ్ళగా ఒక పల్లెటూరు తగిలింది. ఆ ఊళ్లోకి వెళ్లి ఊరిమొగదలే ఉన్న పేదరాసి పెద్దమ్మ ఇంటికివెళ్లాడు. వెళ్లి "అవ్వా! అవ్వా! దాహమవుతూంది; కాసిని మంచినీళ్లిస్తావా?"అని అడిగాడు. ఆ ముసలమ్మ వెంటనే అందుకుని, "అయ్యో! నా తండ్రీ! నీకు తెలియదు గావల్ను పాపం! ఇక్కడ మంచినీళ్లు దొరకడం చాలాకష్టం నాయనా! కాలికొద్దీ పరిగెత్తగల వాళ్లకి తప్ప యితరులకు ఇక్కడ గుక్కెడు మంచినీళ్లయినా దొరకవు బాబూ!" అని చెప్పింది. "అదేమిటి అవ్వా! మంచినీళ్లదొరకని ఊళ్లో ఎలా బ్రతుకుతున్నారు. మరి?" అని ఆరాతీశాడు. "లేదు నాయనా! ఇక్కడబాగా వయసులో ఉండి అతివేగంగా పరిగెత్తగల మొగపిల్లలే నదికివెళ్లి నీళ్లు తీసుకురాగలరు. అక్కడ పెద్ద మొసలి రాక్షసుడొక డున్నాడు. మాయముండాకొడుకు. వాడు నీళ్లకోసం వెళ్లిన పిల్లలందర్నీ తన

పొట్టబెట్టుకుంటున్నాడు," అంది. అయితే అవ్వా! అదున్న పోతుచర్మపు బొక్కెన, ఆ దున్నకొమ్ము గరిటె నాకిస్తావా? నేను వెళ్లి నీళ్ల పట్టుకొస్తాను," అన్నాడు. వద్దు నాయనా! వద్దు. నీళ్ల తీసుకువస్తామని నదికి వెళ్లిన కుర్రాళ్లెందరో ఆ రాకాసి మొసలినోట పడ్డారు బాబూ బతికి బట్టకట్టవలసిన పండులాంటి బిడ్డలు. నువ్వు వెళ్లొద్దు!" అంది పేదరాసి పెద్దమ్మ. కాని, ఆ కుర్రాడు కాదు కూడదని పట్టుబట్టడం వల్ల బొక్కెనా, తెడ్డూ ఇచ్చింది. వాటిని తీసుకొని కుర్రాడు నదికి వెళ్లి, నీళ్ల ముంచుతూ ఆ మొసలికోసం చుట్టూ చూశాడు.

ఇదంతా చూస్తూన్న ఆ మొసలిరాక్షసుడు నీళ్ళలోంచి మెల్లగా తల పైకెత్తాడు. రంపాల వంటి పళ్లగల పెద్ద నోరు తెరచి వాడు గట్టిగా ఊపిరి పీల్చేసరికి ఈ కుర్రవాడు నీటితో నిండిన అతోలు బొనెతోను, తెడ్డుతోనుసహా బుర్రున వాడి నోట్లోకి వెళ్ళిపోయాడు. రాక్షసుడి కడుపులోకి పోగానే ఆకుర్రవాడు కంగారు పడకుండా తన మొలలో ఉన్నకత్తి బయటికి లాగాడు. విశాలంగా పెద్దభవంతిలాగ ఉన్న ఆ రాక్షసుడి కడుపులో ఏనాటినుంచో వాడు మింగివేస్తూ వచ్చిన కుర్రవాళ్లందరూ కనిపించారు. వెంటనే ఆ కత్తితో మొసలి రాక్షసుడి కడుపు చర్మాన్ని కోసి, పెద్ద కన్నం చేసి, ముందుగా ఆ కుర్రవాళ్ళందర్నీ ఆ కన్నంగుండా బయటికి పంపివేశాడు. తరువాత తాను కూడా బయటికివచ్చి తోలు బొక్కెనతో నీళ్ల తీసుకువెళ్లాడు.

అయ్యో నాయనా! వచ్చావా?" అంటూ అవ్వ యెదురు వచ్చి "నువ్వెవ్వరు నాయనా! నిజంగా చెప్పుఎవరు నువ్వు?" అంటూ ఆ మొసలి వాత పడకుండా తిరిగి వచ్చాడనే ఆనంద పారవశ్యంతో ప్రశ్నించింది. "అవ్వా! నన్ను రాలినచుక్క అంటారు. ఇక్కడ మీ కందరికీ మంచినీళ్ల కరువయేటట్టు చేసిన ఆ రాక్షసుణ్ణి నేను కడతేర్చేశాను." అని ఆ కుర్రవాడామెకు తెలిపాడు. అవ్వ అమితానందంతో ఆ వార్త దారినిపోయే ఒక ముసలివాణ్ణి పిలిచి చెప్పింది. ఆ రాకాసి మొసలిని ఎవరో కుర్రవాడు చంపేశాడన్న వార్త అంచెలమీద ఆ పల్లె ప్రాంతమంతా పాకిపోయింది.

ఈ విధంగా ఆ పల్లె ప్రజలందరికీ మహోపకారం చేసిన రాలిన చుక్క ఒక రోజున పేదరాసిపెద్దమ్మను, "అవ్వా! ఇలాంటి పల్లెలు దగ్గర్లో ఏమైనా ఉన్నయ్యా?" అని అడిగాడు. "లేకేం నాయనా, దగ్గరలోనే ఇంకో పల్లెటూరు ఉంది." అని చెప్పింది అవ్వ. ఆవేళే రాలినచుక్క తన విల్లంబులు తీసుకుని ఆఊరినుంచి బయలుదేరాడు.

అది ఆకు రాలు కాలం. ఆ కుర్రవాడు ఆయేటి ఒడ్డువెంటే, రంగు రంగుల పండుటాకులు రాల్చే చెట్లనీడల్లోంచి పోగా పోగా ఆ యేటి ఒడ్డునే ఉన్న ఆ పల్లెటూరు చేరుకున్నాడు. ఆ ఊళ్లోకూడా పేదరాసి పెద్దమ్మ ఇంటికే వెళ్ళాడు. ఆమె రెండుచితుకులతో సన్నగా మంటవేసుకొని చలి కాగుతూ, తలవాల్చుకుని విచారంగా కూచుని

ఉంది. "అవ్వా! నేను చలితో ఇలకార్చుకు పోతున్నాను. ముందర నాలుగు పెద్దకట్టెలువేసి పెద్ద మంట చెయ్యి"అని అడిగాడు."అయ్యో! ఏం చెప్పను నాయనా! ఈ ఊళ్లో మాకు కట్టెలే దొరకవు; నీకు తెలియదు గావాల్ను. అడవికి పోయి కట్టెలు తెచ్చుకుందామంటే,అక్కడ ఒక రాకాసి గుడ్లగూబ ఉంది. కట్టెలు కొట్టుకుంటానికి ఎవరు వెళ్లినా ఆ రాకాసి వాళ్లని తన కడుపున పెట్టుకుంటూంది," అని చెప్పింది. "అయితే అవ్వా! రేపు పొద్దున్నే ఇంట్లో గొడ్డలీ, తాడూ నాకియ్యి.నేను అడవికి వెళ్లి కట్టెలు కొట్టుకొస్తాను," అన్నాడు రాలిన చుక్క. "వద్దు బాబూ! వద్దు! బంగారంలాంటి పసిపిల్లడివి. నువ్వా అడవి వేపుకే వెళ్లొద్దు. ఆ రాకాసి చాలా భయంకరంగా ఉంటుందిట. అక్కడికి వెళ్లిన వాళ్లందర్నీ తన చెవిలో దోపేసుకుంటుందిట. దాని జోలి నీకెందుకులే బాబూ!" అంది అవ్వ.

అయినా జంకకుండా రాలిన చుక్క పట్టుబట్టి మర్నాడు పొద్దున్నే ఆమె వద్ద గొడ్డలీ, తాడూ తీసుకుని అడవికి వెళ్లాడు. అతడు కట్టెలు కొడుతున్నంతసేపూ, ఆ గుడ్లగూబ రాక్షసికోసం చుట్టూ కనిపెట్టి చూస్తూనే ఉన్నాడు. తీరా కట్టెలుకొట్టడం పూర్తి అయి మోపు కట్టగానే, ఎక్కణ్ణించి వచ్చిపడిందో ఆ రాకాసి అకస్మాత్తుగా చక్కా వచ్చి, ఆ కుర్రవాణ్ణి తీసుకుని తన చెవిలో దోపివేసుకుంది. వెంటనే రాలిన చుక్క తన విల్లు తీసుకుని బాణం ఎక్కుపెట్టి ఆ రాకాసి మెదడులోకి వదిలాడు. దాంతో ఆ రాకాసి పెద్దగా అరుస్తూ క్రింద బడి ప్రాణం విడిచింది.

రాలిన చుక్క దాని చెవిలో నించి పాకి బయటపడి, తన కట్టెలమోపు ఎత్తుకుని పేదరాసి పెద్దమ్మ యింటికి పట్టుకొచ్చాడు. "అవ్వా! ఇవిగో: కావలసినన్ని కట్టెలు తెచ్చాను. ఇక మనం రోజూ వెచ్చగా మంటవేసుకుని హాయిగా చలి కాగవచ్చు. మీకు కట్టెలు కరవు పెట్టు చేసిన ఆ గుడ్లగూబ రాకాసిని నేను కడతేర్చేశాను." అన్నాడు, రాలిన చుక్క. పేదరాసి పెద్దమ్మ ఈ సంతోష వార్తను వెంటనే ఒక ముసలివాడికి చెప్పింది. దాంతో ఆనోటా ఆనోటా పడి ఆ సంగతి ఊరంతా తెలిసిపోయింది.

తరువాత కొంత కాలానికి, "అవ్వా! అవ్వా! ఈ దగ్గర్లో ఇలాంటి పల్లెలు ఇంకా ఏమైనా ఉన్నయ్యా?" అని రాలిన చుక్క అవ్వను అడిగాడు. "లేకేం నాయనా! చాలా పల్లెటూళ్లు ఉన్నయ్యి!" అని అవ్వ జవాబు చెప్పింది. దాంతో, రాలిన చుక్క కొత్త కొత్త ఊళ్లలో ఎక్కడేమి వింతలున్నాయో చూడాలనే వేడుకతో మళ్లీ బయలుదేరాడు. అది హేమంత ఋతువు. మంచు బాగా కురుస్తోంది. ఒక పల్లెటూరు చేరుకుని, అక్కడ పేదరాసి పెద్దమ్మ ఇంటికి పోయి కూచున్నాడు, రాలిన చుక్క. కాని, ఆ ముసలమ్మ పాపం ఆ కుర్ర వాడిని ఎంతకీ భోజనానికి రెమ్మని పిలవలేదు. దాంతో, "అవ్వా! నాకు తగని ఆకలేస్తోంది. భోజనం పెట్టవా?" అని అడిగేశాడు.

"అయ్యో నాయనా! మేమిక్కడ తిండిలేక మల మల మాడి పోతున్నామనే సంగతి నీకు తెలియనే తెలియదా? మేము ఒక్క అడవి

దున్నలైనా వేటాడితెచ్చుకునే ప్రాప్తి లేదు, నా తండ్రీ! ఎవరు వేటకి వెళ్లినా ఆ అడవిలో ఒక పెద్ద తెల్ల కాకివచ్చి వాళ్లను తరిమి వేస్తూంది," అని చెప్పింది. అవ్వ. "రామ!రామ! చాలా అన్యాయంగా ఉందే! పోనీలేగాని అవ్వా! ఆ తెల్ల కాకి పనినేను పట్టిస్తా గాని, నాకీ ఊళ్లో ఎక్కణ్ణించైనా చాలాభాగం బొచ్చు ఊడిపోయిన పాత తోలు కోటు ఒకటి తెచ్చిపెట్టి, ఈ ఊరు మొత్తంమీద బాగా పరిగెత్త గల ఇద్దరు కుర్రవాళ్లను నాకు సాయం పంపమని మీ గ్రామ నాయ కుడితో చెప్పి ఏర్పాటు చెయ్యగలవా?" అని అడిగాడు.

అలాంటి కోటు సంపాదించడం కోసం అవ్వ బయలుదేరింది. అడగ్గా అడగ్గా ఒక ఇంట్లో సరిగా అలాంటి కోటే దొరికింది. ఆ పైన అవ్వ సంతోషంగా గ్రామనాయకుడి ఇంటికి పోయి, రాలిన చుక్క కథ అంతా చెప్పి, ఆ ఊళ్లో అందరికన్న బాగా పరిగెత్తగల ఇద్దరు కుర్ర వాళ్లను అతనికి తోడు పంపమని కూడా చెప్పి, ఆ పాత ఉన్నికోటు తీసుకుని ఇంటికి చేరింది.

మరి కాసేపటికి, బాగా పరిగెత్త గలిగిన ఇద్దరు కుర్రవాళ్లు రాలిన చుక్కను వెతుక్కుంటూ వచ్చారు. "ఈ తడవ మళ్లీ ఈ ఊరుదగ్గిరికి అడవి దున్నలమంద ఏదైనా వచ్చినప్పుడు ముందుగా నేనొక చోటికి వెళ్లి దాగి ఉంటాను. అవి పరిగెత్తడం మొదలు పెట్ట గానే నేను మారువేషంలో వాటివెంట పడతాను. మీరు కూడా నా వెనకే కొంచెం దూరంగా తరుముకుని రండి. చాలా దూరం వరకూ

అలాగే పరిగెత్తి పరిగెత్తి, చివరకి నన్ను సమీపించి బాణాలు వదిలి నన్ను చంపివేయండి. చంపిన తరువాత పూర్తిగా పగలగోసి అక్కడే వదిలేసిపొండి," అని రాలిన చుక్క వారికి బోధించాడు.

ఇది జరిగిన కొద్దికాలానికే, ఆపల్లె పొలిమేరలో ఒక దున్నల మంద కనిపించింది. ఆ దున్నల్ని చంపడానికి ఆ గ్రామస్థులంతా విల్లులూ, కత్తులూ, కటారులూ తీసుకొని బయల్దేరారు. వాళ్లు బయలుదేరగానే ఒక తెల్లకాకి ఆ దున్నలమంద మీదుగా ఎగురుతూ "అదుగో వాళ్లు మిమ్మల్ని చంపడానికి వస్తున్నారు పరిగెత్తండి! పరి గెత్తండి!" అని వాటిని హెచ్చరించింది. దున్నలు కాలికొద్దీ పరి గెత్తడం మొదలు పెట్టాయి. వాటి వెనుక చర్మవ్యాధివల్ల బొచ్చు ఊడిపోయిన ఒక ముసలిదున్న పరిగెత్తుతూంది. ఈ కుర్రవాళ్లిద్దరూ ఆ దున్నవెంటపడి తరమడం మొదలుపెట్టారు. ఎంతకీ పట్టు విడవ కుండా అలా పరిగెత్తి పరిగెత్తి, చివరకు దాన్ని చేరుకుని, బాణాలతో దాన్ని పడగొట్టి చంపేశారు.తరవాత, రాలిన చుక్క చెప్పిన ప్రకారం దాన్ని పగలగోసి, అక్కడే వదిలేసి వెనక్కి తిరిగి వచ్చేస్తున్నారు. దూరంవచ్చి వెనక్కితిరిగి చూసేసరికి, ఆ దున్న కళేబరం చుట్టూ తోడేళ్ళు, నక్కలు నానా జాతుల పక్షులు ముసురుకున్నాయి. ఆ పక్షుల్లో తెల్లకాకికూడా ఉంది. ఆ తెల్లకాకి ఆ దున్న కళేబరంమీద ఎగురుతూ, "కా....కా....కా.... ఇది రాలిన చుక్క కాదుగదా?" అంటూ దాని చుట్టూ తిరుగుతూంది. కొంతసేపటికి, ఇంకా కొంచెం

దగ్గిరగా వెళ్ళి, మళ్ళీ "కా...కా....కా...! ఇది రాలిన చుక్క కాదుగదా"! అని ఇంకో రెండు ప్రదక్షిణాలు చేసింది. మరికొంత సేప టికి మళ్ళీ,"కా....కా...కా! ఇది రాలిన చుక్క కాదుగదా! కా... కా....కా! ఆ కళ్ళమాత్రం నాకు విడిచిపెట్టండి. మీరెవరూ ముట్టు కోకండి! కా....కా...కా...ఖర్మం! ఇది రాలిన చుక్క కాదుగదా కొంపదీసి?" అనుకుంటూ ఆ కళేబరంమీద వ్రాలి, ఆ గుడ్లు పొడవ డానికి మెల్లమెల్లగా తలవేపుకి పాకిపోతూంది. రాలిన చుక్క ఆ సమయం కనిపెట్టి దాని రెండుకాళ్లూ గట్టిగా పట్టుకున్నాడు. వెంటనే చుట్టూఉన్న పక్షులన్నీ ఒక్కసారిగా ఎగిరి చక్కాపోయినయి. తోడేళ్ళూ నక్కలూ ఎటువి అటే పరిగెత్తి పరిగెత్తి పర్వతాల్లో మాయమయి నయి. రాలిన చుక్క తెల్ల కాకిని జాగ్రత్తగా పేదరాసి పెద్దమ్మ ఇంటికి తీసుకువచ్చి, దాన్ని ఏమిచేయవలసిందీ తేల్చడానికిగాను ఆ గ్రామ నాయకుడికి కబురుపెట్టాడు. ఆయన వచ్చి చూసి, "ఈ పాపిష్ఠి కాకిని మా యింటికి తీసుకుపోయి మావంటింటి పొగగొట్టం చివరకట్టి, ఆ పొగకు ఉక్కిరి బిక్కిరై చచ్చిపోయేటట్టు చేస్తాను," అన్నాడు. ఆ ప్రకారంగానే ఇంటికి పట్టుకుపోయి కట్టేశాడు. కాని ఆ జిత్తులమారి కాకి కొంతసేపు మెల్లగా ఆ తాడును గోడకు వేసి రాసి, తెంచుకుని ఎగిరిపోయింది.

రాలిన చుక్క ఇదివిని, జనప కర్రలు కోసుకురమ్మని తన తోటి కుర్రాళ్ళను కొంతమందిని పంపాడు. ఆ జనపకర్రల నారతీసి

దాంతో పెద్ద తాడు పేనాడు. ఆ తాడుకి ఒక చివర సన్ననిదారం కట్టి, ఆ దారానికి ఒక చిన్న ఈక కట్టాడు. ఆ ఈక ఇంటి కప్పు మీద ఎగురుతూ ఉండేటట్టు ఎత్తుగా కట్టాడు. ఆతాడుని కనిపెట్టి చూస్తూ ఉండమని అక్కడ ఉన్నవారికి చెప్పాడు. ఆ ఈక పైన ఎగరడం మానివేయగానే తాడును కిందికి లాగివేయమన్నాడు. అలా లాగితే ఆ తాటి చివర తప్పకుండా తెల్లకాకి ఉంటుందని కూడా వాళ్ళకు తెలియచెప్పాడు. అతడు చెప్పినట్టుగానే వాళ్ళు సమయం కనిపెట్టి తాడుని కిందికి లాగేసరికి తెల్లకాకి గభాలున పొగగొట్టం గుండా లోపలికి వచ్చిపడింది. వెంటనే వాళ్లు దాన్ని చంపేశారు. ఆపైన ఆఊళ్ళో వాళ్ళంతా, కావలసినన్ని అడివిదున్నల్ని వేటాడు కుంటూ, "మన కష్టాలు గట్టెక్కాయర్రా! హాయిగా కడుపునిండా తిండి దొరుకుతూంది!" అనుకుంటూ సుఖంగా బ్రతుకు తున్నారు.

కొన్నాళ్ళకి రాలినచుక్క ఆ గ్రామంనించి బయలుదేరి మరో ఊరు వెళ్ళాడు. సరాసరి ఆ ఊళ్లో ఉన్న పేదరాసి పెద్దమ్మ ఇంటికే వెళ్లి, "అవ్వా! అవ్వా! నాకు వెర్రి ఆకలివేస్తూంది.తినేందుకు ఏదైనా పెట్టవా?" అని అడిగాడు. "ఏం చెప్పమన్నావు నాయనా! మా పాట్లు? ఇక్కడ మాకు తినడానికి తిండేలేదు! అడవి దున్నల్ని వేటాడడానికి మా వాళ్లు బయలుదేరగానే చలికాల రాక్షసుడు పెద్ద మంచు తుపానును పంపిస్తాడు.దాంతో మాకు తిండేకరువైపోతూంది ఏం చెప్పమన్నావు?" అంది పేదరాసి పెద్దమ్మ. ఇది విని రాలిన

చుక్క, "సరే ఫరవాలేదులే అవ్వా! ఈ తడవ అడివి దున్నలీ ప్రాంతానికి వచ్చినప్పుడు మనం ఇద్దరం వెళ్ళి కావలసినంత మాంసం తెచ్చుకుందాం గాని, ఈ లోపుగా మన కుక్కబండి సిద్ధంచేసి ఉంచు" అన్నాడు. తరువాత కొన్నాళ్ళకి, ఒక రోజున పెద్ద దున్నలమంద ఒకటి ఆ ప్రాంతానికి వచ్చింది. "అవ్వా! లే! బయలుదేరు," అన్నాడు, రాలిన చుక్క. వాళ్ళిద్దరితో కూడా ఆఊళ్ళోవాళ్ళు ఇంకా చాలా మంది వెళ్ళారు. వాళ్ళంతా కలిసి కొన్ని దున్నల్ని వేటాడారు. వాటిలో బాగా బలిసిన ఒక అడవి గేదె కూడా ఉంది. "రా అవ్వా! మనం ఈ గేదెని కోసుకుందాం" అన్నాడు, రాలిన చుక్క.

దాన్ని కోస్తూండగా, ప్రక్కన కొండమీద ఉన్న చలిరాక్షసుడు చూశాడు. ఇంకేం! మెల్లగా కొండదిగి వీళ్ళ వేపుకే వస్తున్నాడు. వాడి చేతిలో పెద్ద బడితె ఒకటి ఉంది. అవ్వ ఇదంతా చూసి, పారిపోవటానికి ప్రయత్నించింది గాని, "వద్దు అవ్వా! పారిపోకు" అంటూ రాలిన చుక్క ఆపు చేశాడు. అలా అంటూనే రాలిన చుక్క ఆ గేదె మూత్రపిండాలను కోసి అవ్వ చేతికిచ్చాడు. ఆ సమయానికి చలి రాక్షసుడు వాళ్ళకి దగ్గరగా వచ్చేశాడు. వస్తూనే రాలిన చుక్కని చూసి, "ఆ మూత్ర పిండాల్ని ఆ ముసలి ముండకెందుకిస్తావురా?" అంటూ పళ్ళు పటపటకొరుకుతూ గుర్రుమాడు. అలాఅంటూనే తలెత్తి చూచి, అవ్వను తన్నబోయాడు. దాంతో ఆకాలు ఊడి ఎగిరి అంత దూరాన పడింది. ఆ రాక్షసుడికి మరింత కోపంవచ్చి చెయ్యెత్తి

లాగి కొట్టబోయాడు.దాంతో ఆ చెయ్యి ఊడి దూరంగా పడింది. పట్ట రాని కోపంతో ఆమెను తిట్టడానికి నోరు తెరవబోయాడు. దాంతో వాడి తలకాయే ఎగిరిపోయి దూరంగా పడింది. అక్కడితో చలి రాక్ష సుడు నేలమీద కూలిపోయాడు. తరువాత వాళ్ళు త్వరగా ఆ గేదెను కోసుకుని చలిరాక్షసుణ్ణి అక్కడే వదిలి వెళ్ళిపోయారు.

ఆ మాంసం అంతా ఇంటికి చేరవేసే సరికి, వాళ్లకి తినడానికి కావలసినంత తిండి దొరికింది. రాలిన చుక్క "ఇక నేనొకసారి వెళ్లి చలి రాక్షసుణ్ణి చూసి వస్తా నవ్వా! అని బయలుదేరాడు. కాని, అవ్వ "వద్దు నాయనా! నువ్వా రాకాసి ముండా కొడుకుని నానా హింసా పెట్టావు. నువ్వు దగ్గిరికి వెళితే వాడు నిన్ను చంపేస్తాడు. వద్దు నువ్వు వెళ్లొద్దు బాబూ!" అంది. "నేను వెళ్లక తప్పదవ్వా! వాడు ఉండే చోటు ఎక్కడో చెప్పు," అన్నాడు. "అదుగో ఆ ఏటి మలుపులో ఉంటాడు" అని చూపించింది అవ్వ, చివరకి ప్రాణం విసిగి.

రాలిన చుక్క ఆ ఏటి మలుపులోకి వెళ్లి ఆ రాక్షసుడు ఉన్న గుహలో ప్రవేశించాడు. ఆ రాక్షసుడి భార్య వెళ్ళి భర్తను వెతికి తీసుకువచ్చి గొప్ప గొప్ప మూలికలతో వైద్యం చేయడంవల్ల, చలి రాక్షసుడు మళ్ళీ మామూలుగా ఆరోగ్యంగా ఉన్నాడు. రాలిన చుక్కను చూడగానే వాడు మండిపడి, "నాకు అంత అపచారం చేసి, ఇక్కడి కెందుకురా వచ్చావు?" అని గద్దించాడు. "ఎందుకు మామా! కోప్పడతావు? నేను నీతో మాట్లాడి పోదామనీ, నీ ఇల్లు చూసి పోదా

మనీ వచ్చాను," అన్నాడు రాలిన చుక్క. అంటూనే పెద్ద చెట్టు మానుతో చేసిన ఆ రాక్షసుడి విల్లు తీసుకుని వంచి, ఫెళ ఫెళ విరిచేశాడు.

"ఎందుకురా దాన్ని విరిచావు? ఫో! లేచి ఫో! నా యింట్లోంచి లేచి పోరా అంటే ఇంకా ఇక్కడే నిలబడతావేంరా? నీకు బుద్ధి లేదూ? సిగ్గులేదూ?" అని గాండ్రించాడు. "నీగది ఎలా ఉందో చూడాలని ఉంది మామా!" అన్నాడు రాలిన చుక్క. చిరునవ్వుతో అలా అంటూనే ఒక మూల పెట్టిఉన్న ఆగదను తీసుకుని, చలి రాక్షసుడితలమీద గట్టిగా ఒక్క దెబ్బ తీశాడు. ఆ విధంగా చలిరాక్షసుణ్ణి వాడి గదతోనే కడతేర్చేశాడు రాలిన చుక్క. అటు తరువాత వాడి పెళ్ళాన్ని పిల్లల్ని కూడా కడతేర్చేశాడు. ఒక పిల్లాడు మాత్రం గబ గబా పారిపోయి, ఆ ప్రక్కన ఒక చోట నేల బీటవారి ఉంటే, అందులో దూరాడు. రాలిన చుక్క తన బసకు చేరుకుని చలి రాక్షసుణ్ణీ వాడి పెళ్ళాం పిల్లల్నీ చంపి వచ్చానని అవ్వకి చెప్పాడు. అయితే, ఒక్క పిల్లాడు మాత్రం తప్పించుకు పారి పోయాడనీ, ఊళ్లో అంతా మరిగిపోతూన్న ఉడుకు నీళ్లు పట్టు కెళ్ళి, వాడు దాగి ఉన్న బీటలోపోస్తే, వాడా వేడికి ఉడికి చచ్చిపోతాడనీ కూడా చెపు తాడు. అవ్వ చెప్పిన మీదట ఊళ్లో అంతా వెళ్లి చాలాసేపు బీటలో ఉడుకు నీళ్లు పోశారు. ఎంత పోసినా వాళ్లు నీళ్లు పొయ్యడం ఆప గానే ఆ బీటలోంచి గుప్పుమని పొగమంచు బయటి కొస్తూంది.

చివరికి పాత్రిణం విసిగి నీళ్లు పొయ్యడం ఆపివేశారు. "వాడు చచ్చి పోయే ఉంటే మళ్లీ పొగమంచు మనకి కనిపించేది కాదు." అనుకుంటూ ఎవరి దారిని వారు ఇళ్లకు వెళ్లి పోయారు.

రాలిన చుక్క మరి కొన్నాళ్లకి ఆ ఊరి నించి బయలుదేరి, మళ్లీ యాత్ర సాగిస్తున్నాడు. అప్పటికి నడి శీత కాలం వచ్చేసింది. పగళ్లు గబగబా గడచి పోతున్నాయి. త్వరగా చీకటి పడిపోతూంది. ఒక రోజు రాత్రి రాలిన చుక్క ఒక ఏటి ఒడ్డుకి చేరుకున్నాడు. అక్కడ ఒక దీపం కనిపించింది. ఆ దీపం దగ్గరికి వెళ్లే సరికి, అక్కడ ఒక రాక్షసుడు కనిపించాడు. వాడి మెడలో మనుష్యుల చెవులతో గుచ్చిన ఒక హారం ఉంది. రాలిన చుక్క ఆ రాక్షసుడి ఇంటినీ, వాడి వాలకాన్నీ తేరిపార చూసి, "మిడిగుడ్ల రాక్షసుడు వీడే అయి ఉండాలి," అనుకున్నాడు. వెంటనే, వెనుదిరిగి ఎండిపోయిన కలబంద మొక్కలు ఉన్న చోటికి వెళ్ళి మనుష్యుల చెవులంతటి ముక్కలు కోసి, వాటి నన్నిటినీ మాలగా గుచ్చి మెడలో వేసుకున్నాడు. తరువాత సరాసరి మళ్లీ ద్వినేత్రుడి ఇంటికి బయలుదేరి వెళ్లాడు. వాడీ కుర్రవాణ్ణి చూసి "రా రా భాయ్! ఎక్కణ్ణించి వస్తున్నావ్! నువ్వూ అచ్చంగా నాలాగే ఉన్నావే చిత్రంగా"! అంటూ ఆహ్వానించాడు.

"ఔను నేనూ నీలాగే వైద్యుణ్ణిలే అన్నా! ఔనుగాని, ఒక్కమాట అడుగుతాను చెప్పు. నీ జీవిత రహస్య మేమిటో కాస్త

చెప్పు," అన్నాడు, రాలిన చుక్క. ఏముంది తమ్ముడూ ! నన్ను చంపా లనుకున్నవాళ్లు నన్ను కట్టిపడేసి, కొంచెం ఆముదం తీసుకుపోయి అగ్నిలో పోసి, ఒక ఓషధి మొక్కను తిరగవేస్తే సరి, మనం అమాంతంగా నేలగూలి చచ్చిపోతా మనుకో! మామూలుగా నేను మనుష్యుల చెవులు కొరికి దండగా గుచ్చుకుని మెడలో వేసుకుంటాను. ఈ ప్రాంతాల్లో ఇంతవరకు మనం వెళ్లని ఊరు ఒక్కటే ఉంది తమ్ముడూ! ఈవేళ అంతా సద్దుమణిగి నిద్దర పోయిన తర్వాత మనం ఆ ఊరు దయచేస్తాం" అని తన విషయ మంతా గొప్పగా ఏకరువు పెట్టాడు ఆ రాక్షసుడు. "అరే చిత్రంగా ఉందే! సరిగ్గా నన్ను చంపాలన్నా అలాగే చెయ్యాలే! మన మిద్దరం అన్ని విధాలా ఒకే రకంగా ఉన్నట్టున్నామే! అయితే ఒక పని చేస్తా నుండు. నేను ముందుగా ఆ ఊళ్లోకి పోయి, అంతా నిద్ర పోతున్నదీ లేనిదీ చూసి నీకు చెబుతాను.సరేనా?" అన్నాడు రాలిన చుక్క. "సరేలే తమ్ముడూ! అలాగే కానిద్దాంలే" అన్నాడు, మిడిగుడ్లవాడు.

రాలిన చుక్క ఊళ్లోకి వెళ్ళి, "ఇక్కడ అంతా పడుకుని నిద్ర పోతున్నారా?" అని గట్టిగా అరిచాడు. "లేదు" అని ఒక మూల నించి ఒక్క గొంతుక మాత్రం వినిపించింది. "మనుష్యుల చెవులు కొరుక్కు పోయే రాక్షసుడు ఈ వేళ మీ ఊరు వస్తున్నాడు. మీరంతా మేలుకొనే ఉండి, గుర్రుపెట్టి నిద్ర పోతున్నట్టు నటించండి. అలా చేస్తే మీరా రాక్షసుణ్ణి చంపివేయవచ్చు. వాణ్ణి చంపడానికి ఒక్కటే

ఉపాయం ఉంది. పెద్ద మంట చేసి, అందులో ఆముదం పొయ్యాలి. తరువాత ఒక ఓషధి మొక్కను తిరగెయ్యాలి. ఇలా చేస్తే అ మిడి గుడ్ల రాక్షసుడు నేల గూలి చచ్చిపోతాడు," అని వారికి బోధించాడు రాలిన చుక్క.

ఈ సంగతి వినేసరికి ఆ ఊరి వారందరికీ గంపెడంత సంతోషం తోషం కలిగింది. రాలిన చుక్క చెప్పినట్లు చెయ్యడానికి వాళ్లందరూ సరే నంటే సరే అన్నారు. ఆ తరువాత రాలిన చుక్క మళ్లీ మిడిగుడ్ల రాక్షసుడి దగ్గిరికి వెళ్ళి, "ఆ ఊళ్లో అంతా గుర్రు పెట్టి నిద్రపోతున్నారు. ఇదే సమయం మనం వెళదాం పద! ముందుగా నేను వెళతాను," అన్నాడు. "నువ్వొద్దు నువ్వొద్దు భాయ్! మొదట మనం వెళ్లాలి" అన్నాడు, మిడిగుడ్ల వాడు. "సరే! పోనీ అలాగే కానీ!" అన్నాడు రాలిన చుక్క.

ఇలా కూడబలుక్కుని వాళ్లిద్దరూ ఆ ఊరు వెళ్లారు. ముందుగా ఊరు మొగదల నిలబడి విన్నారు; ఊళ్లో అంతా గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. మళ్ళీ రాలిన చుక్క "ముందు నన్ను వెళ్లనిద్దూ!" అన్నాడు. "కాదు; నీకు తెలీదులే భాయ్! ముందుగా మనమే వెళ్లాలి లే!" అన్నాడు మిడిగుడ్ల రాక్షసుడు. వాడొక ఇంట్లో ప్రవేశించే సరికి రాలిన చుక్క ఆ తలుపు వేసేసి, ఆ తలుపులకే అనుకుని నిలబడి, "మిడిగుడ్ల రాక్షసుణ్ణి ఇంట్లో పెట్టి తలుపులు వేసేశా నర్రో!" అని అరిచాడు. వెంటనే ప్రజలంతా లేచి పెద్ద మంట

వేశారు. మిడిగుడ్ల వాడు కంగారు పడి, పారిపోవాలని తలుపు తోశాడు. కాని, ఏం లాభం? రాలిన చుక్క వేసిన గడియలన్నీ గట్టిగా బిగించి, పైగా తాను కూడా పెద్ద బండలాగ ఆ తలుపుల కడ్డంగా నిలబడి ఉన్నాడాయె! గ్రామస్థులు తమ ఇళ్లల్లో ఉన్న ఆముద మంతా తెచ్చి ఆ మంటల్లో పోశారు. కొందరు ఆ ఓషధి మొక్కలు పెద్ద మోపులుగా తెచ్చి నేలమీదవేసి కొట్టడం మొదలు పెట్టారు. వెంటనే మిడిగుడ్లవాడు కిందపడి గిలగిల కొట్టుకొని ప్రాణంవదిలాడు. మరునాడు ఉదయం మిడిగుడ్ల రాక్షసుడి కళేబరాన్ని ఆ ఇంట్లోంచి మెల్లగా పదిమంది పట్టి బయటికి లాగారు. ఆ ఊళ్ళో వాళ్ళూ, ఆ ఆ చుట్టు పక్కల ఊళ్లవాళ్ళూ అంతా ఆ శవం చుటూ చేరారు. వాడి మెడలో ఉన్న చెవుల దండ తీశారు. అందులో ఉన్న తమ చెవుల్ని కొందరు గుర్తు పట్టారు. రాలిన చుక్క ఆ చెవుల దండ తెచ్చి, వాటిలో ఎవరి చెవులు వారు తీసుకుని, గాలి లేక ఉక్కపోసే ఒక ఇంట్లోకి వెళ్ళమన్నాడు. అక్కడ తమ చెవులను యథాస్థానాల్లో అంటించుకో మన్నాడు. అలా చేసేసరికి వాళ్ల చెవులన్నీ మామూలుగా అతుక్కు పోయినయి.

రాలిన చుక్క ఆ ఊళ్లోనే ఉంటున్నాడు. ఆ ఊరి వాళ్లు అతని కోసం చక్కని యిల్లు కట్టిస్తున్నారు. అతడి కిచ్చి పెళ్లి చేయ డానికి ఒక చక్కని పెళ్లి కూతురుని కూడా సిద్ధం చేశారు. ఇలా ఉండగా, ఆ దగ్గిరలో ఉన్న మరో ఊళ్లో వాళ్లు రాలిన చుక్కను

ఆహ్వానించారు. పాపం! ఆ ఊళ్ళో ప్రజలు ఇతర చోట్ల కంటె చాలా దౌర్భాగ్య దశలో ఉన్నారు. ఆ ఊళ్లో ఉన్న ఒక ముసలి రాకాసి వాళ్లందరి తలల మీద ఉన్న చర్మం జుట్టుతో సహా కోసి వేస్తూ ఉండేది. రాలిన చుక్క ఇల్లు తయారయింది: పెళ్లి కూడా అయిపోయింది.

తరువాత భార్యతోసహా ఆ ప్రక్క ఊరు వెళ్లాడు. రాలిన చుక్క ఆ ఊరు వచ్చాడన్న సంగతి ఎలాగో ముసలిది పసికట్టింది. వెంటనే అతని దగ్గిరికి వెళ్లి "ఏం నాయనా! నువ్వొచ్చావని తెలిసే, చూసి పోదామని వచ్చాను బాబూ! నేను తయారు చేస్తున్న తోలు దుస్తులికి ఇంకా కొద్దిగా జుట్టుతో కలిసిఉన్నతోలు కావాలి నాయ....నా!" అంది దీర్ఘాలు తీస్తూ. "ఔనవ్వా! నీకు జుట్టున్న మనిషి తలమీది చర్మం కావాలనితెలిసి అందుకే మేము ఈఊరు వచ్చామమ్మా!" అన్నాడు. రాలినచుక్కకీ, అతని భార్యకీ తలనిండా మంచి తుమ్మెద రెక్కల్లాంటి జుట్టు ఉంది. తరువాత కొంత సేపటికి రాలిన చుక్క తన భార్యను కూడా వెంటబెట్టుకుని ఆ ముసలిదాని యింటికి వెళ్లాడు. కాని, ఆమె ఆ ఇంట్లోకి వెళ్లడానికి భయపడింది. రాలిన చుక్క ఆమె నెలాగో ఒప్పించి ముసలిదాని ఇంటికి తీసుకు వెళ్లాడు. కాని, ఈ తతంగ మంతటికీ చాలా ఆలస్య మయింది.

వాళ్లు లోపలికి వెళ్ళేసరికి ఆ ముసలిది ఎదురు వచ్చి, "చాలా సంతోషం నాయనా! మీ యిద్దరికీ బలే మంచి జుట్టు ఉందే! భేష్! భలే జుట్టు!" అంది. "ఔనౌను అవ్వా! అందుకే మేమూ వచ్చాం.

నీకు మంచి వెండ్రుకలు గల చర్మాలు కావాలన్నావు కాదూ!" అన్నాడు రాలిన చుక్క. భార్యను ముసలిదానికి ఎడంగా తన ప్రక్కను కూచోమన్నాడు. "ముందుగా అవ్వకు నా తల ఇవ్వాలి," అన్నాడు. ముసలిది కత్తి నూరుకుని రాలిన చుక్క దగ్గిరికి వస్తూంది. ఆమె దగ్గిరికి రాగానే గట్టిగా ఒక్క దెబ్బ కొట్టాడు. రాలిన చుక్కది రాతి చెయ్యి అవడం వల్ల, ఆ ఒక్క దెబ్బకే ఆ రాకాసి ముండ ఆవలించి నేల కూలింది.

. . .

రాలిన చుక్క ఈ ముసలిదాన్ని చంపివేసిన సంగతి అంచె లంచెల మీద అప్పుడే ఊరందరికీ తెలిసి పోయింది. వెంటనే అంతా ముసలిదాని ఇంటి చుట్టూ ముసురు కున్నారు. ముసలిది కడతేరిన సంగతి స్వయంగా కళ్లారా చూచి, "అమ్మయ్య!" అనుకున్నారు. అందులో కొందరు ఆ యిల్లంతా వెదికే సరికి, ఆ ముసలిది కోసిన వాళ్ల తలల మీది చర్మాలన్నీ వెండ్రు కలతో సహా దొరికినయి. వాటిలో ఎవరి చర్మం వాళ్లు గుర్తుపట్టి తీసుకున్నారు. రాలిన చుక్క వాళ్లందరినీ గాలి లేక ఉక్కపోసే యింట్లోకి వెళ్లి నిలబడ మన్నాడు. అందరికీ బాగా ఉడకపోసిన తర్వాత, ఆ చర్మాలను తలల మీద పెట్టుకుంటే అవి ఎప్పటిలాగ అతుక్కుపోతాయని చెప్పాడు. అందరూ ఆ పని చేశారు. ఉక్కపోత యింట్లోంచి బయటికి రాగానే వాళ్ల తలలూ, జుట్టూ మామూలుగా

వెనకటిలాగే ఉండడం చూసి వాళ్ల సంతోషానికి అంతులేదు. రాలిన చుక్కంటే వాళ్ల గౌరవానికి మేరలేదు.

ఆ తరువాత రాలిన చుక్క తన భార్యతో సహా అక్కడే సుఖంగా బ్రతుకు తున్నాడు.





# రిప్ వాన్ వింకిల్



వాషింగ్టన్ ఇర్వింగ్



హడ్సన్ నదిమీద ఎగువకు ప్రయాణం చేసిన వారంతా కాట్స్‌కిల్ పర్వతాలను చూసి ఉంటారు. ఆప్లేషియన్ పర్వత పంక్తులలోంచి విడివడిన ఒక శాఖకే కాట్స్‌కిల్ పర్వతాలని పేరు. హడ్సన్ నదికి పశ్చిమంగా ఎత్తుగా హుందాగా నిలబడిన ఈ పర్వతాలు ఆ పరిసర ప్రాంతాన్నంతా పరిపాలిస్తూన్నట్టూ, అధికారంతో శాసిస్తూన్నట్టూ కనిపిస్తూంటుంది. ఋతువు మారినప్పుడల్లా, - నిజానికి రోజు రోజూ గంట గంటకీ – ఈ పర్వత పంక్తి నవం నవ రూపాలూ, రంగులూ మారుస్తూంటుంది. చుట్టు ప్రక్కల ఇల్లాళ్లందరికీ ఈ పర్వత శ్రేణి అత్యద్భుతమైన అనుదిన వాతావరణ

సూచి (బలా మీటర్) గా ఉపయోగ పడుతూంది. వాతావరణం సౌమ్యంగా, ప్రశాంతంగా ఉన్నప్పుడు ఈ పర్వతాలు నీలి రంగు తొడుగో, లేక ముదురు వంగరంగు బురఖానో వేసుకున్నట్టు కని పిస్తూ, స్వచ్ఛమైన సాయం సంధ్యాకాశం మీద ముదురు రంగులతో వ్రాసిన ప్రకృతి చిత్రంగా ఉండిపోతయి. మిగతా ఆకాశ మంతా నిర్మేఘంగా ఉన్నప్పుడు ఈ పర్వతాల శిఖరాలు తెల్లని పడగ లెత్తిన మహా సర్పాల్లాగ కనిపిస్తూ ఉంటయి. ఆ పడగలు అస్తమయ సూర్యుని చరమ కాంతులలో మిలమిల మెరుస్తూ రమణీయ కిరీటాల లాగ ధగధగ లాడుతూంటయి.

ఈ దేవతా పర్వతాల పాదతలం వద్ద పీలి రంగు మెరక నేలలూ, సమీపంలో కనిపించే పచ్చని బయళ్ళూ కలిసే చోట చెట్ల గుబురుల మధ్య సుళ్లు సుళ్లుగా తెల్లని ఆవిరిపొగలు గ్రక్కే ఒక పల్లె ఉన్న సంగతి కూడా ఆ ప్రాంతాన్ని చూసి వచ్చిన యాత్రికులకు బహుశః గుర్తు ఉంటుంది. ఆ పల్లె అతి ప్రాచీన మైన ఒక చిన్న వలస. అమెరికాకు యూరపియనులు మొట్ట మొదట వలస వచ్చిన రోజులలో డచ్ వలసదారులు ఆ పల్లెను కట్టుకున్నారు. వారు స్వదేశం (హాలెండు) నుండి తెచ్చుకొనిన పసుపు పచ్చని చిన్న చిన్న ఇటికలతో, కర్ర కిటికీలతో, పాకలు గల వాకిళ్లతో, 'గాలి కోళ్ల' స్తంభాలతో నిర్మించుకున్న కొన్ని ఇళ్ల గుర్తులు విలక్షణంగా కనిపిస్తూ ఉండేవి.

ఆ పల్లెలోనే, ఇలాంటి ఒక ఇంటిలోనే (నిజానికి ఆ ఇల్లు ఆ నాటికే సగం కూలి పాడుగొడుతూ ఉండేదను కోండి!) చాలా కాలం క్రిందట, పరమ సాధువైన ఒక నిరాడంబర వ్యక్తి ఉంటూండే వాడు. అతని పేరు రిప్ వాన్ వింకిల్. డచ్ గవర్నరు పీటర్ స్టైవెసెంట్ హయాంలో, ఆ వీర రసోజ్జ్వలమైన సమయంలో, అతనికి చేదోడు వాదోడై క్రిష్టియానా దుర్గాన్ని ముట్టడించడంలో ఆయనకు సహాయపడిన వాన్ వింకిల్ వంశం కీర్తి ప్రతిష్ఠలు గలది. ఆ వంశంలోనే జన్మించాడు మన రిప్ వాన్ వింకిల్. అయితే, రిప్‌కి తాత ముత్తాతల ప్రచండ శౌర్య సాహసాలు మాత్రం అబ్బలేదు. నేను చూచినంతలో అతడు చాలా మంచివాడు; ఇరుగు పొరుగుల పట్ల దయగలవాడు; భార్య పట్ల భయ భక్తులతో ప్రవర్తించే పరమ సాధు భర్త. నిజానికి, ఈ చిట్టచివరి గుణమే అతని విశ్వ విఖ్యాతికి ముఖ్య హేతువేమో! ఇంట్లో గయ్యాళి గంపల చెప్పు చేతల్లో అనుదిన క్రమశిక్షణ కలవాటు పడిన భర్తలే సామాన్యంగా పరమ సౌమ్యులనీ, అమాయకులనీ పేరు తెచ్చుకుంటారు. వారి స్వభావ స్వరూపాలూ, కోప తాపాలూ సంసారాగ్ని కుండంలో అనుదిన సంస్కారాలు పొందిన కొద్దీ మేలిమి బంగారంలా వన్నెలు తేలతయి. ఒక వ్యక్తికి ఓర్పూ, ఎడతెగని బాధలను సహించగల నిబ్బరం లాంటి సుగుణాలు అలవడడానికి వేలాది శ్రుతి స్మృతి ధర్మ బోధలకన్న ఇంట్లో గయ్యాళి భార్యకు గట్టిగా కోపం వచ్చి

నప్పుడు చేసే ఒక్క ఉపన్యాసం అద్భుతంగా పనిచేస్తుంది. అందు చేత గయ్యాళి భార్య కూడా ఒక విధంగా అదృష్టవంతులకు భగవద్దత్తంగా లభించే వరప్రసాదమనే చెప్పాలి. ఈ విషయం ఒప్పుకుంటే, రిప్‌వాన్ వింకిల్ మహాదృష్టవంతుడన్న మాట కూడా ఒప్పుకున్నట్టే!

ఆ గ్రామంలోని ఇళ్ళ వాళ్ళందరికీ అతడంటే అమితమైన ఆదర భావం. అందరు ఆడవాళ్ళలాగే వాళ్లూ పొద్దుగూకే వేళ భర్తలతో వాదోప వాదాలకు దిగేటప్పుడు, వాళ్ళంతా ఎప్పుడూ రిప్ పక్షాన్నే వాదించి శ్రీమతి వింకిల్‌దే తప్పంతా అని వాదిస్తూ ఉండే వాళ్లు. ఆ ఊళ్లో పిన్న పెద్దలంతా అతడు కనిపించగానే ఎక్కడ లేని సంతోషంతో గంతులువేస్తూ పరుగెత్తు కొస్తారు. వాళ్ళ ఆటలన్నిటిలో అతను సహాయ పడేవాడు. వాళ్ల ఆటలకు కావలసిన సాధన సామగ్రి అంతా తయారుచేసి ఇచ్చేవాడు. గాలి పటాలు ఎగర వేయటం, గోళీలు ఆడటం, చేతగాని పిల్లలకు స్వయంగా నేర్పేవాడు. దేవతల కథలు, రాక్షసుల కథలు, దయ్యాల కథలు చెప్పేవాడు. ఇల్లు వదిలి బయలుదేరాడా, పిల్లలంతా వెంటబడి, కాళ్లా వేళ్లా పడుతూ, వీపు మీద కెగబాకుతూ, నానా హంగామా చేసేవాళ్లు. ఆ చుట్టు ప్రక్కల ఎక్కడా ఒక కుక్క కూడా ఎన్నడూ రిప్‌ని చూసి మొరగలేదు.

అతని జీవితంలో ఒక్క లోపం ఉంది. తనకు లాభసాటి పని ఏదన్నా అతనికి ఎంత మాత్రం గిట్టేదికాదు. అంత మాత్రాన

అతనిలో శ్రద్ధాలోపంగాని, ఓపిక లేనితనం గాని ఉన్నదనుకుం టానికి వీలులేదు. పెద్ద గడకర్రంత గాలం పట్టుకు పోయి, నీటి ఒడ్డున గట్టున తిష్ఠవేసి, రోజంతా ఒక్క చేప పిల్ల కూడా దొరకక పోయినా, ఓపికగా అలాగే కూచునే వాడు. పిట్టలను కొట్టే చిట్టి తుపాకీ ఒకటి బుజాన పెట్టుకొని పోయి, గంటల తరబడి అడవుల్లో పుంతలలో తిరుగుతూ, కొండ లెక్కుతూ, లోయల్లోకి దిగుతూ. తిరిగి తిరిగి కొన్ని ఉడతల్ని, అడవి పావురాలను మాత్రం కొట్టే వాడు. ఎంత కష్టమైన పనిలో అయినా సరే, ఇరుగు పొరుగు వారికి సాయపడేవాడు. ఎవరికి జొన్న చేలో నూర్పిడి వచ్చినా, ఎవరి ఇంటికి ప్రహారీగోడ కట్టవలసి వచ్చినా రిప్ లేనిదే సాగేది కాదు. ఆ పల్లెలోని ఇల్లాళ్లకు కూడా అడపా దడపా అత డెన్నో పై పనులు చేసి పెట్టేవాడు; ఎవరికన్నా కబురు పెట్టుకోవాలన్నా, మాట వినని భర్తలు చెయ్యని చిల్లర పనులేమైనా చేయించు కోవా లన్నా ఇతడే శరణ్యం. ఇంతకీ రిప్ తన ఇంటి పని తప్ప మరెవరి పనైనా సరే అతి శ్రద్ధగా చేసి పెట్టేవాడు. తన ఇంటి పనులూ, పొలం పనులూ సవ్యంగా చేసుకోటం మాత్రం అతనికి అసంభవంగా కనిపించేది.

తన పొలానికి ఎంత చాకిరీ చేసినా ఏమీ ప్రయోజనం లేదనీ, ఆ చుట్టు పక్కల అంతకీ అది వట్టి దరిద్రగొట్టు భూమి అనీ, దానిలో ఎంత పని చేసినా బూడిదలో పోసిన పన్నీరే అనీ, ఇప్పటికీ, ఎప్పటికీ కూడా దాంట్లో ఏం చేసినా అంతా చుక్కెదురై,

అర్థాన్నమై పోవటమే తప్ప బాముకుని బాగు పడేదేమీ లేదనీ స్పష్టంగా చెప్పేవాడు. వాళ్ళ పొలం చుట్టూ అతను ఎన్నిసార్లు కంచెలు వేసినా, ముచ్చటగా మూడు రోజులన్నా కాక పూర్వమే అయిపూ ఆనవాలూ, లేకుండా పోయేవి. ఆయన ఆవు తరచు తెంపుకుని పారిపోతుంది. లేదా ఏ కాలేజీ చేలలోనో పడి ధ్వంసం చేస్తుంది. ఇక కలుపు మొక్కలు ఆ ప్రాంతంలో ఎవరి చేలోనూ పెరగనంతగా అతని చేలో పెరుగుతయి. పైగా, అతడు పెట్టే బలమంతా ఆ కలుపు మొక్కలకే భుక్త మవుతూందేమో మరి! అసలు పంటకంటె అవే వేగంగా, ఏపుగా పెరిగిపోతయి. సొంత చేలో పనికి బయలుదేరాడా, శాపం పెట్టినట్టు వచ్చి పడుతుంది పెద్ద పెట్టున గాలి వాన. ఈ విధంగా పాపం తాత తండ్రు లిచ్చి పోయిన అతని ఆస్తి ఇతని హయాములో ఒక్కొక్క ఎకరమే హరించి పోయి, పోయి, చివరి కొక చిన్న చేనూ, బంగాళా దుంపల చేనూ మాత్రం మిగిలినయి. ఆ భూమి కూడా పంట విషయంలో ఆ చుట్టు పక్కల చేలన్నిటిలో నాసి రకం అని పేరు మోసింది.

ఇక అతని బిడ్డలు: చింకి గుడ్డలు కట్టుకుని చిరాకుగా, గాలికి పుట్టి ధూళికి పెరుగుతున్నట్టు తిరుగుతూ ఉంటారు. కొడుకు చిన్న రిప్ మున్ముమ్మూర్తులా తండ్రి నోట్లోంచి ఊడి పడ్డట్టు ఉంటాడు. పోలికే కాదు, తెలివితేటలకు, అలవాట్లకు, తండ్రి సర్వస్వానికీ తానే వారసుడ నన్నట్టు, సదా తండ్రి పాత కోట్లు

గాని తొడుక్కోడు. కిందదాకా జీరాడుతూన్న తండ్రి పాత చింకి కోటూ, చింకిలాగూ తొడుక్కుని పట్టు చీరెలు సింగారించిన వన్నెలాడులు వాన కురిసి బాడిగా ఉన్న రోజున విలాసంగా ఒక చేత్తో కుచ్చెళ్లు కొంచెం పైకి ఎత్తి పట్టుకున్నట్టు, లాగూ కోటూ కూడా పైకి లాగి పట్టుకుని, ఎదిగిన గుర్రప్పిల్లలాగ సాధారణంగా ఎప్పుడూ తల్లి వెంటబడి తిరుగుతూ ఉండేవాడు.

రిప్ వాన్ వింకిల్ ఈ ప్రపంచంలో దేనికీ ఉబ్బితబ్బిబ్బు అయే రకం కాదు. కూరలో ఉప్పు ఎక్కువైనా తక్కువైనా గమనించకుండా, ఆ విషయమే తనకు పట్టనట్టు ఎప్పుడేది పెడితే అది తిని తేచిపోతాడు. రూపాయి కోసం నానా గడ్డీ కరిచే కంటె, కానీ బటానీ గింజలతో కాలక్షేపంచేస్తూ, నిర్లక్ష్యంగా, నిశ్చింతగా బ్రతకవచ్చుననే బాపతు మనిషి. లోకం అతని బ్రతుకు అతనిని బ్రతకనిస్తే, జీవితమంతా అంతు లేని సంతృప్తితో ఈల వేసుకుంటూ గడిపి వేయగలడు. కాని, ఇంట్లో భార్యే అతనికి అవకాశం ఇయ్యడం లేదు. భర్త సోమరిపోతు తనాన్ని గురించీ, నిర్లక్ష్యవైఖరిని గురించీ కుటుంబానికి అతడు కలిగిస్తూన్న నష్టాన్ని గురించీ అస్తమానం అతని చెవిలో జోరీగలాగ అరవడం ఆమెకు అలవాటయి పోయింది. రాత్రింబవళ్లు ఆమె నాలుకకు విసుగు విరామమంటూ లేదు. ఇంట్లో పాపం రిప్ ఏమి చేసినా, ఏమి అన్నా మహోగ్రమైన ఒక ఉపన్యాసం తప్పదు. ఇలాంటి ఉప

న్యాసా లన్నింటికీ రిప్పు చెప్పగల జవాబు ఒకటే ఉంది. తరచూ వాడడంవల్ల క్రమంగా అదే అతని అభ్యాసంగా కూడా పరిణమించింది. కను బొమ్మలు ముడిపెట్టడం, తల పంకించడం, బుజాలు ఎగురవేయడం పైకి చూస్తూ మాట్లాడకుండా ఊరుకోవడం; — ఇదే అతని జవాబు. ఈ జవాబుకి సద్యః ఫలితం లేకపోలేదు. భార్యకిది మరింత ఆగ్రహ కారణమై ఆమె మళ్ళీ మొదలెత్తుకుంటుంది. ఆపైన అతడు చెప్పే జవాబు కూడా మామూలుగా ఎప్పుడూ ఒకటే! భార్యా భీతులందరికీ తెలిసిన ఏకైక తరణోపాయం! చల్లగా సద్దుకుని ఇంట్లోంచి బయటికి జారడం.

ఇంట్లో రిప్పుని కనికరంతో చూసేది అతని కుక్క సరదార్ ఒక్కటే! దానికి కూడా, దాని యజమానికి లాగే ఆ గృహిణి అంటే హడలు. బహుశః ఇదే ఈ స్నేహానికి కారణం అయి ఉండవచ్చు. సోమరిపోతుతనంలో వీళ్ళిద్దరూ సహాధ్యాయులని ఆమె నిశ్చితాభిప్రాయం. భర్త తరచు ఇంటి నించి పారిపోవటానికి కొంత వరకు ఆ కుక్కే కారణం అన్న కోపం కూడా ఆమెకు లేకపోలేదు. అడవిలో వేటకు తీసుకు పోయినప్పు డాకుక్క ఏ జంతువుమీదికైనా రేచులాగ దూకి, దాని అంతు చూడగల శౌర్య సాహసాలు గలది అన్నమాట నిజమే! కాని, ఇంట్లో తన యజమానురాలి నోటిముందు మాత్రం ఈ శౌర్యం చిల్లిగవ్వకు కొరగాదు. సరదార్ గుమ్మందాటి ఇంట్లో ప్రవేశించేటప్పు డల్లా మెల్లగా

తల వంచుకుని, తోక కాళ్ళమధ్యకి ముడుచుకుని, లేదా నేలకు వ్రేల వేసుకుని, ఒదిగి, ఒదిగి వింకిల్ సతి ఎక్కడున్నదో అని ప్రశ్నా చూపులు చూసుకుంటూ లోపల ప్రవేశించేది. ఈ లోగా ఎక్కడైనా చీపురు కట్టగాని, గరిటెగాని చప్పుడయిందా, ఉలిక్కిపడి, చావు పరుగున మళ్ళీ వీధిలోకి పోయి పడేది.

రిప్ వాన్ వింకిల్ వివాహానంతరం కాలం గడిచిన కొద్దీ కొంపలో పరిస్థితి నానాటికీ తీసి కట్టు అవుతూంది. గయ్యాళితనం వయసు ముదిరినకొద్దీ తగ్గేటాపతు గుణం కాదు. తిట్టే నాలుక వాడిన కొద్దీ పదును హెచ్చే బత్తాయిచాకు లాంటిది. ఇంట్లోంచి బయటికి పోయినప్పుడు రిప్పు చాలా కాలం వరకు ఆ గ్రామంలోని వేదాంతులు, విరాగులు, సన్యాసులు, ఇతర మోతుబరి సోమరిపోతులూ అంతా కొలువుతీర్చే స్థలానికి పోయి కొంత మనశ్శాంతి సంపాదించు కునేవాడు. ఆ ఊరి సత్రం అరుగు ఈ గోష్ఠులకు ప్రధాన సభాస్థలి. ఎంతకీ పొద్దుతరగని వేసవి రోజుల్లో వీళ్ళంతా అక్కడ చేరి నిర్విరామంగా లోకాభిరామాయణ కాలక్షేపం సాగించేవాళ్ళు. లేదా అంతూ పొంతూ లేని అగమ్మకాకి కబుర్లూ, కథలూ చెప్పుకునేవాళ్ళు. ఎప్పుడైనా, అదృష్టవశాత్తు ఆ సత్రంలో దిగిన యాత్రికుడి దగ్గర అయినా వాళ్ళకి పాత వార్తా పత్రికేదైనా దొరికిందా, ఇక ఆరోజున వాళ్ళ గంభీర చర్చలు కొమ్ములు దిరిగిన రాజకీయ వేత్తలుకూడా శ్రమ అనుకోకుండా పోయి శ్రద్ధగా వినదగిన ధోరణిలో సాగేవి.

పొట్టిగా, బొద్దుగా ఉండే ఆ ఊరి బడి పంతులు శ్రీ డర్రిక్ వాన్ బమ్మెల్ ఆ పత్రికలోని సంగతులు ఒక్కొక్కటే చదివి వినిపిస్తూ ఉంటే, అంతా చెవులు నిక్కపొడుచుకొని వింటారు. నిఘంటువులో కూడా కనిపించని ఎంత పొడుగు డొంక తిరుగుడు మాట నయినా సరే బమ్మెల్ అవలీలగా ఉచ్చరించగలడు. సవ్యాఖ్యానంగా దాని పరమార్థమూ చెప్పగలడు. ఆ విధంగా కొన్ని నెలల క్రిందట జరిగిన రాజకీయ సంఘటనల మీద కూడా వాళ్లు ఎంతో వివేకంతో, విజ్ఞానంతో తాజాతాజా చర్చలు జరుపుతారు.

ఈ గోష్ఠిలో ఆ గ్రామపు పెద్దా, ఆ సత్రానికి ధర్మకర్తా అయిన నికొలస్ వెడ్డర్ అభిప్రాయాలదే ఎప్పుడూ పైచేయి. ఆయన ఆ అరుగుమీద మొగదల స్తంభానికి ఆనుకుని కూచునేవాడు. ప్రొద్దున్నించీ సాయంకాలందాకా అక్కడికి మాత్రం ఏ కాలంలోనూ ఎండ రాదు. కారణం: సత్రం గుమ్మానికి ఎదురుగా ఉన్న పెద్ద పొగడ చెట్టునీడ. మధ్యలో భోజనం వగైరాలకు గంటో, అరగంటో తప్ప పొద్దస్తమానమూ వెడ్డర్ అక్కడే కూర్చుంటాడు. అందువల్ల ఆ చుట్టు పక్కలవాళ్లు చెట్టునీడ ఆయనకు ఎంత దూరంలో ఉన్నదీ చూసి సులభంగా టైము గ్రహించగలరు. ఆ విధంగా ఆ వీధి వాళ్లందరికీ ఆయనే నమ్మకమయిన నీడ గడియారం. వెడ్డర్ ఆట్టే మాట్లాడేరకం కాని మాట నిజమే. చుట్ట చెల్లగా చుట్ట ముట్టిస్తూ, అరుగు పక్కగా ఉమ్మి వేసుకుంటూ కూచుంటాడు. గొప్ప వాళ్లం

దరికీ ఉన్నట్టే ఆయనకీ వ్యాఖ్యాత లున్నారు. ఆయన వ్యాఖ్యాతలు, ఆయన అభిప్రాయాలను చెప్పకుండానే గ్రహించగలరు. చదివిన వార్తలలో గాని, ప్రకటనలలోగాని ఆయనకు నచ్చనిదేదైనా ఉందా, చుట్టపొగ జోరుగా కోపంగా పీల్చేవాడు. ఇష్టమయినదేదైనా ఉందా అంటే చుట్టపొగ నెమ్మదిగా, ప్రశాంతంగా పీల్చి పలచగా పైకి ఊది ధూమమేఘాలను సృష్టించేవాడు. ఇక ఆయన నోటిలోంచి చుట్ట బయటికి తీసి ఆ సుగంధ ధూమాలు నోటి చెలమలలోంచి సుళ్లు దిరుగుతూ బయటికి వస్తూ ఉండగా గంభీరంగా తల ఊపాడా, ఇక ఆ విషయాన్ని ఆయన సంపూర్ణంగా ఆమోదించాడన్న మాటే!

ఇంత మనో రంజకమైన వాతావరణంలో కూడా రిప్పు స్థిమితంగా, కూచునే ప్రాప్తి లేదు. ఆయన గయ్యాళి భార్య తటాలున ఎప్పుడో తుఫానులాగ వచ్చిపడి ఆ ప్రశాంత గోష్ఠిని బీభత్సంచేసి వేసేది. ఆ పండిత పరిషత్ సభ్యులందరి మీద, నిర్దాక్షిణ్యంగా దుమ్మెత్తిపోసేది. ఆ ప్రచండురాలి ధాటీకి నికొలస్ వెడ్డర్ లాంటి మోతుబరి కూడా తప్పుకునే అవకాశం లేకపోయింది. తన భర్త అసలే సోమరిపోతనీ, వెడ్డర్ దాన్ని ఇంకా ఎక్కువ చేస్తున్నాడనీ ఆమె కుండ పగలగొట్టినట్టు ముఖాన్నే అనేది.

పాపం! రిప్ జీవితం నిరాశామయమయిపోయింది. పొలంలో పనినించీ, తన భార్య తిట్లనించీ తప్పించుకొనడానికి ఇక అతనికి

ఒక్కటే ఉపాయం మిగిలింది. తుపాకీ చేతబట్టుకుని వేటకు అంటూ చల్లగా అడవికి పోవడం. వెళ్లి అక్కడ ఏదో ఒక చెట్టు మొదల కూచుని, సంచిలోని తినుబండారాలు బయటికితీసి, సంసారంలో తన దౌర్భాగ్యదశలో సమంగా పాలు పంచుకుంటూన్న సర్దార్‌కి తిన్నంత పెట్టి, తక్కినది తాను తినేవాడు. "సర్దార్! మీ యజమానురాలు పాపం నిన్నుకూడా చాలా హీనంగా చూస్తూంది. కాని, నువ్వేమీ విచారించకు. నేను బతికి ఉన్నంతవరకు నీకు సానుభూతిగల స్నేహితులు లేని లోపం మాత్రం ఉండదు," అంటూ వెన్ను నిమురుతూ సర్దార్‌ని ఓదార్చేవాడు. సర్దార్ అతని మాటల్ని అర్థం చేసుకుని, తోక ఆడిస్తూ, కృతజ్ఞతా భావంతో, జాలిగా యజమాని ముఖంలోకి చూసేది. సరిగా అతడన్నమాటలనే తిరిగి సరదార్ కూడా తన యజమానిని గురించి మళ్ళీ అంటున్నదా అనేటట్టు ఉండేవి ఆ చూపులు.

అలాంటి ఒక స్వేచ్ఛా వనవిహారం సందర్భంలో, శరత్కాల సుప్రశాంత సాయం సమయంలో రిప్ యథాలాపంగా కాట్స్కిల్ పర్వతాలలోని ఒక అత్యున్నత ప్రదేశానికి ఎక్కి వెళ్లాడు. వెళ్లి, తన వినోద క్రీడ అయిన ఉడతల వేటతో కాలక్షేపం చేస్తున్నాడు. ఆ తుపాకి ప్రేలుళ్లతో ఆ ప్రాంతపు వాతావరణమంతా దద్దరిల్లి మారు మ్రోగిపోయింది. తిరిగి, తిరిగి, చివరికి అలసి ఆయాసపడుతూ పోయి ఒక గుట్టమీద పచ్చగడ్డి పెరిగి ఉన్న దిమ్మమీద కూలబడ్డాడు. నిటారుగా పైనించి కిందికి తరిగినట్టున్న పర్వతపు టంచుమీద ఉన్న ఆ

దిమ్మకు చుట్టూ అడవి లతలు పెరిగి ఉన్నాయి.ఆ లతల సందులలోంచి పర్వతం క్రింద దట్టమైన అరణ్యప్రదేశం కొన్ని మైళ్ళదాకా స్పష్టంగా కనిపిస్తూంది. దిగువను కొంతదూరంలో హడ్సన్‌నది హుందాగా, వయ్యారంగా, చల్లగా సాగిపోతూంది. తెల్లని మబ్బులకి ప్రతి బింబాలో, లేక పడవల తెరచాపలో మిలమిలలాడే ఆ నదీ వక్ష స్థలంమీద అక్కడొకటి అక్కడొకటి నిద్రలోలాగ తేలి పోయి పోయి నీలంగా కనిపించే ఆ మెరక భూముల్లో లీనమైపోతూంది.

మరొక వేపున క్రిందకి చూస్తే దిగువను ఎక్కడో అగాధ మైన లోతున దట్టంగా, గజిబిజిగా నిర్జనారణ్యమయిన లోయ కని పిస్తూంది. నిటారుగా ఉన్న ఆ పర్వతపుటంచులనించి విరిగి కూలిన పెద్ద పెద్ద బండలు ఆ లోయలో అక్కడక్కడ పడి ఉన్నాయి. ఎప్పుడో, అస్తమిస్తూన్న సూర్యుని కిరణాలు కొండ చరియలపై బడి ప్రతిఫలిస్తూన్న అలాంటి సమయంలో తప్ప రోజు మొత్తం మీద ఆ లోయలోకి వెలుగు తగిలే అవకాశమే లేదు. రిప్ ఈ దృశ్యాన్నిచూస్తూ కొంతసేపు అలాగే ఆలోచిస్తూ పడుకున్నాడు. సాయం సంధ్య చల్లగా జారిపోతూంది. పర్వతాలు నీలినీడలతో చుట్టుప్రక్కలోయలన్నింటినీ కౌగలించు కుంటున్నాయి. చీకటి పడే లోగా తాను ఇంటికి చేరుకొనవలెననే విషయం రిప్‌కి చప్పున స్ఫుర ణకు వచ్చింది. దాంతో మళ్లీ ఇంటివద్ద తన గృహిణి చేయబోయే హంగామాను గురించి ఆలోచించుకుంటూ ఒక్కసారి గాఢంగా నిటూర్చాడు.

కిందికి దిగడానికి లేచేసరికి, ఎక్కడో దూరంనించి "రిప్ వాన్ వింకిల్! రిప్ వాన్ వింకిల్!" అంటూ పెద్ద కేక వినిపించింది. చుట్టూ తిరిగి చూశాడు. పర్వతం మీదుగా ఒంటరిగా ఎగిరిపోతూన్న ఒక కాకి తప్ప ఎక్కడా ఏవరూ కనిపించలేదు. భ్రమ పడ్డానేమో అనుకుని, మళ్లీ కొండ దిగడం మొదలు పెట్టాడు. మళ్లీ అదే పిలుపు "రిప్ వాన్ వింకిల్! రిప్ వాన్ వింకిల్!" అంటూ ఎక్కణ్ణించో ఆ ప్రశాంత సంధ్యా వాతావరణాన్ని చీల్చుకొనివచ్చి అతని చెవులబడింది. సర్దార్ కొండ దిగువకు నిదానించి చూస్తూ వెన్ను వంచుకుని, పెద్దగా మూల్గుతూ, తన యజమానికి దగ్గిరగా వచ్చి ఆనుకుంది. రిప్ మనస్సులో లీలగా ఏదో అవ్యక్తమయిన భయం బయలుదేరింది. సర్దార్ చూస్తున్న దిక్కుగా చూశాడు. ఒక విచిత్రవ్యక్తి వీపుమీద పెద్ద బరువుతో కుంగిపోతూ తన వంకకే ఎక్కి వస్తున్నాడు. ఆ నిర్జనారణ్య ప్రదేశంలో ఆ సమయంలో మరొక మానవుడు కనపడడం రిప్పుకి చాలా ఆశ్చర్యం కలిగించింది. అయితే, పాపం అతడెవరో తన ఊరివాడే అయి ఉంటాడనీ, సహాయం కోసం తనను అర్థిస్తున్నాడనీ అనుకుని రిప్పు గబగబా అతని దగ్గిరకు కొండ దిగిపోతున్నాడు.

దగ్గరకు వెళ్లినకొద్దీ ఆ నూతన వ్యక్తి విచిత్ర స్థితి రిప్‌కి మరింత ఆశ్చర్యం కలిగించింది. పొట్టిగా, లావుగా, దిబ్బిసకొక్కులాగ ఉన్నాడు. దుబ్బులాగ, ఒత్తుగా పెరిగిన తెల్ల గడ్డం అతని ముసలి తనాన్ని

బయట పెడుతూంది. ప్రాచీన కాలపు డచ్ వారిలాగ నడుముకి గట్టిగా బిగించిన ఒక పొట్టికోటు, పైన బాగా విశాలంగా ఉండి, రెండు ప్రక్కలా వరసగా గుండీలు, క్రింది అంచులకు కుచ్చులూ కుట్టి, మోకాలు క్రిందిదాకా మాత్రం ఉన్న పొట్టిపైజామా తొడుగుకున్నాడు. బుజంమీద పెద్ద సారా జాడీ ఉంది. వచ్చి, ఈ బరువు మోసుకుని పోవడానికి కొంచెం సహాయపడతావా?" అన్నట్టుగా రిప్పుకి సంజ్ఞ చేశాడు. రిప్పుకి ఈ నూతన మిత్రుని గురించి కొంత అనుమానం ఉన్నప్పటికీ, సహజౌదార్యంతో వెంటనే అంగీకరించాడు. ఆ జాడీని చెరి కాసేపూ మోస్తూ, మెల్లగా ఆ లోయ వెంట ఇాచు మించు ప్రాకుతూ ఇద్దరూ పైకి ఎక్కారు. ఆ లోయ బహుశః ఎండి పోయిన చిన్న కొండవాగు కోసిన చాలు అయి ఉండాలి. వాళ్లిద్దరూ కొండ పైకి ఎక్కిన కొద్దీ ఆగి ఆగి ధణ ధణ మంటూ పెద్ద చప్పుడు ఏదో వినబడుతూంది. ఆ ధ్వని రెండు పర్వత శిఖరాల మధ్యగా ఉన్న ఒక లోతైన లోయలోంచి ఎక్కణ్ణించో పెద్ద ఉరుములాగ వినబడుతూంది. ఎన్నోచుట్లు తిరిగిపోయే ఆ దారి వెంట పోయి పోయి వాళ్ళిద్దరూ చివరకు మళ్ళీ ఆ లోయ వంకకే పోతున్నారు. మళ్ళీ అలాంటి శబ్దమే వినపడింది. రిప్పు ఒక్క క్షణం ఆగి, ఎత్తైన ఆ కొండల్లో ఎక్కడో ఉరుములు మెరుపులతో హఠాత్తుగా కురిసే వర్షపు చప్పుడు అయి ఉండవచ్చునని సమాధానం చెప్పుకుని మళ్ళీ ముందుకు సాగాడు. ఆ వాగు చాలు గుండా పోయి పోయి వారొక పల్లపు ప్రదేశానికి చేరుకున్నారు. అది గుండ్రంగా, సర్కసుగాలరీ

లాగ ఉంది. చుట్టూ నిటారుగా లేచిన కొండ గోడలలోంచి వాలుగా పెరిగిన వృక్షాల కొమ్మల మధ్య నుంచి కొంచెంగా నీలాకాశమూ, అప్పుడప్పు డొక సాయం సంధ్యా మేఘమూ మాత్రం కనబడుతున్నాయి. రిప్పూ అతని సహచరుడూ ఇంత సేపూ మాట్లాడకుండా రొప్పుతూ, వగరుస్తూ ఆ జాడీ మోసుకుపోతున్నారు. అంత పెద్ద సారా జాడీని మోసుకుని ఆ కొండలలోకి ఎక్కడికో పోతూండడం రిప్పుకి చిత్రంగా ఉన్నా తనకు బోధపడని ఆ వింత పరిస్థితి అతనిని విస్మయుణ్ణిచేసి, మాట్లాడేందుకు ధైర్యం లేకుండా చేసింది. ఆ సర్కసు వలయంలాంటి పల్లపు ప్రదేశానికి చేరగానే ఇంకా వింత వింత దృశ్యాలు కనిపించినయి. ఆ పల్లపు ప్రదేశానికి మధ్యగా చదునుగా ఉన్న ఒక చోట కొంత మంది విచిత్ర వ్యక్తులు "తొమ్మిది మేకుల బంతాట" ఆడుతున్నారు. వారి దుస్తులు, చేష్టలు ఎక్కడా కని విని ఎరగని ధోరణిలో ఉన్నాయి. కొందరు పొట్టి బనియన్లలాంటి అంగరఖాలు తొడుక్కున్నారు. వారి నడుముకి బిగించి ఉన్న పట్టాలనించి పొడుగుపాటి పట్టాకత్తులు వ్రేలాడు తున్నాయి. అందులో ఎక్కువమంది రిప్‌ని అక్కడికి తీసుకువచ్చిన వ్యక్తిలాగే కుచ్చుల పైజామాలు తొడుక్కున్నారు. వారి ముఖాలు కూడా అదో మాదిరిగా ఉన్నాయి. ఒకడికి పెద్ద తల, పళ్ళెమంత ముఖం, చింతాకు లంతేసి కళ్ళు; ఇంకొకడికి ముఖంనిండా ముక్కే! వాడి తలమీద మాసి ముడతలుపడ్డ ముక్కోణాకారపు తెల్ల టోపీ, దానికొక ఎర్రని కోడి ఈక ఉంది. అందరికీ రకరకాల పరిమా

జాల్లో రంగు రంగుల గడ్డాలు ఉన్నాయి. అందులో ఒకడు వారిలో పెద్దలాగ, నాయకుడులాగ కనిపిస్తున్నాడు. లావుగా, ఎత్తుగా, అందరిలోకీ ఆరిందాలాగ, ముసలివాడులాగ కనిపిస్తున్నాడు. జరీ అంగరఖా, నడుము చుట్టూ వెడల్పైన పట్టీ, దానికి కత్తి తగిలించు కునే కొక్కెం, తలమీద పెద్ద ఈకల కుచ్చుతో అలంకరించిన ఎత్తైన కోణాకారపు టోపీ, ఎర్రని మేజోళ్లు, ఎత్తుమడమల జోళ్ళూ, కోటు కాలరు చిల్లులలో గులాబి పువ్వులూ; — వేషమంతా ఆడంబ రంగా, హాలెండు దేశంనించి తొలివలసదారులు తీసుకు వచ్చిన ఫ్లేమిష్ చిత్రంలోని వ్యక్తుల ఫాషన్‌లో ఉంది.

ఈ వ్యక్తులంతా కులాసాగా ఆడుకుంటూన్నప్పటికీ వారి ముఖాలన్నీ అతి గంభీరంగా ఉండడం, ఎవరూ ఏమీ మాట్లాడక పోవడం రిప్‌కి మరీ ఆశ్చర్యంగా తోచింది. ఆ వ్యక్తులంతా ముఖాలు ముడుచుకుని ముళ్ల ముప్పులల్లే కూచోడం రిప్ కేమీ అర్థం కాలేదు. మధ్య మధ్య వాళ్లు బంతులు దొర్లించి నప్పుడు అయే శబ్దం మాత్రం ఉంటుండి పెద్ద ఉరుములాగ ఆ లోయ అంతటా మారు మోగు తూంది.

రిప్పూ, అతని సహచరుడూ వారిని సమీపించే సరికి, వాళ్లు ఆట మానేసి, ప్రతిమల లాగ నిలబడి, తదేక దృష్టులతో కళా కాంతులు లేని చిడిముడిపాటు ముఖాలతో వికృతంగా చూస్తున్నారు. దాంతో రిప్ గుండెల్లో రండోళ్ల మోత ప్రారంభమయింది. మోకాళ్లు

కొట్టుకుంటున్నయి. ఈ లోగా అతని అనుచరుడు ఆ జాడీలోని సారాను కూజాల్లో నింపాడు. "నువ్వు ఇక్కడే వీళ్లకి అవసరమైన పని చేస్తూ ఉండు" అని వాడు రిప్పుకి సంజ్ఞ చేశాడు. గోష్ఠిలోని వ్యక్తు లందరూ మాటా పలుకూ లేకుండానే మస్తుగా సారా తాగేసి మళ్లీ ఆట మొదలు పెట్టారు.

క్రమంగా రిప్ ఆశ్చర్యాలూ, అనుమానాలూ తగ్గినయి. ఎవరూ తన వైపు చూడకుండా ఉన్నప్పుడు నెమ్మదిగా కొంచెం పానీయం తనూ రుచి చూశాడు. అది హాలెండ్ దేశపు అమృతం లాగ ఉంది. సహజంగా రిప్‌కి దాహం ఎక్కువ. అందువల్ల, ఆ పానీయం కోసం మళ్లీ ప్రాణం కొట్టుకోటం మొదలు పెట్టింది. దాంతో కొసరి కొసరి దఫాల వారీగా ఆ కూజాలన్నీ వంపి కడుపు నింపేశాడు. క్రమంగా, మైకం క్రమ్మడం ఆరంభించింది. కళ్లు తలలో ఈదులాడుతున్నట్టు తల వాలిపోతూంది. నేల కొరిగిపోయి, ఎన్నడూ ఎరుగని గాఢ నిద్రలో మునిగిపోయాడు.

నిద్రలేచి చూసే సరికి, పర్వతం మీది పచ్చికతిన్నె మీద పడుకుని ఉన్నాడు. కళ్లు నులుముకుని చుట్టూ చూశాడు. వెచ్చ వెచ్చగా పొద్దెక్కుతూన్న ఉదయ సమయం. చుట్టుపక్కల పొదలలో పక్షులు గంతులు వేస్తూ గలభా చేస్తున్నయి. ఆకాశంలో ఒక గ్రద్ద విసురుగా వీచే కొండ గాలికి ఎదురీదుతూంది. "తెల్ల

వాళ్లా ఇక్కడే నిద్రపోయి ఉంటానా? ఉండను బహుశః" అను కున్నాడు, రిప్- నిద్రపోయే ముందు జరిగిన సంఘటనలు ఒక్కొ క్కాటే జ్ఞప్తికి తెచ్చుకుంటూ. సారా జాడీ మోసుకొస్తూన్న వింత మనిషి,.... శిఖరాల మధ్య నున్న పల్లపు ప్రదేశం.... లోయలోని ఆ రహస్య స్థలం... మూతులు బిగించుకున్న ఆ వింత మను ష్యుల.... బంతి ఆట... ఆ సారా కూజా! "ఓః! అదే! ఆ కూజా మందే నా కొంప తీసింది! ఆ మాయదారి మందే ఇంత పని చేసింది. ఏం జవాబు చెప్పుకొని ఏడవను, మా యింటావిడకి?" అను కున్నాడు.

తుపాకీ కోసం చుట్టూ కలయ చూశాడు. కాని ఎప్పటి కప్పుడు నూనె రాయడం వల్ల ఎప్పుడూ నిగనిగ లాడుతూ ఉండే తన తుపాకీకి బదులు ఏ నాటిదో లాగ కనిపుస్తూన్న తుప్పు పట్టిన తుపాకీ ఒకటి ఆతని కంట బడింది. మీట పూర్తిగా తుప్పు పట్టి ఇంచు మించు రాలి పోయే స్థితిలో ఉంది. తుపాకీ పిడి చాలా భాగం చెదల పాలయింది. ఆ లోయలోని రాక్షసులు తనను మం త్రించి, ఆ సారాతో స్మృతి లేకుండా చేసేసి, తన తుపాకీ కాజేశారని రిప్ అనుమానం. పైగా, తన సర్దార్ కూడా కనిపించడం లేదు. ఏ ఉడతనో, పక్షినో తరుముకుని పోయిం దేమో అనుకున్నాడు.

ఈల వేసి పిలిచాడు. "సర్దార్" అని అరిచాడు. కాని అతని అరుపే ఆ కొండల్లో ప్రతిధ్వనించి మూడు సార్లు వినిపించింది. సర్దార్ మాత్రం జాడలేదు.

క్రిందటి సాయంకాలం తాను చూచిన లోయలోకి వెళ్లి వాళ్లెవరైనా కనిపిస్తే తన కుక్కను, తుపాకీని ఇచ్చివేయ మని అడగాలని తీర్మానించుకున్నాడు. లేవ బోయే సరికి కీళ్ళన్నీ పట్టుకు పోయినాయి. ఒంట్లో ఓపిక లేదని గ్రహించాడు. "ఈ రాత్రి నేలమీద పడకతో ఒళ్లంతా నెప్పులు చేసింది," అనుకున్నాడు. "ఈ వేట పుణ్యాన ఏ కీళ్లవాతమైనా వచ్చి, మంచ మెక్కితే అదృష్టం పండినట్టే! మా ఇంటిది నన్ను కొన్నాళ్ల పాటు కాస్త దయగా చూడొచ్చు," అనుకున్నాడు. కష్టం మీద ఎల్లాగో కాళ్లూ చేతులూ స్వాధీన పరచుకుని, నిమ్మళంగా ఆ లోయలోకి దిగాడు. క్రిందటి సాయంకాలం తానూ, తన అనుచరుడూ కొండ మీదికి ఎక్కి వెళ్ళిన వాగు దారి కనిపించింది. కాని, ఆశ్చర్యం! నిన్న నీటి చుక్క లేని ఆ వాగు ఇప్పుడు నురగలు కక్కుతూ మోతలు పెడుతూ ప్రవహిస్తూంది, దాని అంచు వెంటే దుబ్బులూ తుప్పలూ పట్టుకుని పాకుతూ, ఒక్కొక్క చోట చెట్టుకీ చెట్టుకీ మధ్య సాలెగూళ్ల లాగ దట్టంగా అల్లుకొని పోయిన ద్రాక్ష తీగెల్ని తెంచీ దారి చేసుకుంటూ పోయాడు.

చివరికి ఆ వాగు సర్కసు వలయం లాంటి ప్రదేశం లోకి మలుపు తిరిగే చోటికి వెళ్లాడు. కాని, అక్కడ గతరాత్రి కనిపించిన దారి ఇప్పుడు కనిపించడం లేదు. అక్కడ కూడా ఆ కొండ వాగే ప్రత్యక్షం. చివరి కది ఒక విశాలమైన, లోతైన, చుట్టూ మూసుకుని ఉన్న అడవి మ్రాకుల నీడలతో చీకట్లు క్రమ్ముతూన్న ఒక



....అదరిపోతూన్న హృదయంతో ఇంటిదారి పట్టాడు...

(చూడు : పుట 56)

చెరువులో పడుతూంది. పాపం రిప్పు అక్కడే ఆగిపోవలసి వచ్చింది. ఆవేదనతో మళ్ళీ తన కుక్క కోసం గట్టిగా ఈల వేశాడు; గొంతెత్తి పిలిచాడు. ఆ కొండ వాలులో కొంచెం ఎండ తగిలే ఆకుల్లేని మొండి చెట్టు మీద గుంపులు గుంపులుగా ఎగురుతూన్న కాకి మూకల గోలే అతనికి లభించిన జవాబు. వెచ్చగా ఎండ తగులుతూండ డంతో అవి అతని దురవస్థను చూచి గేలిచేస్తున్నట్టు ఉంది. ఇక కర్తవ్యం ఏమిటి? క్రమంగా పొద్దెక్కుతూంది. ఉదయం ఆహార మేమీ పడక పోవడంతో చాలా నిస్సత్తువగా ఉంది. తన కుక్కా, తుపాకీ పోవడం అతనికి మనస్సు మనస్సులో లేదు. మరొక వంక ఇంటికి పోయి, భార్య యెదుట పడడానికి దమ్ములు లేవు. అలా అని ఇంటికి వెళ్ళకుండా ఈ కొండల మధ్య ఆకలితో మాడి చచ్చి పోవడ మెలాగు? తల ఊపాడు. తుప్పుపట్టిపోయిన తుపాకీ తీసి బుజాన పెట్టాడు. ఆందోళనతో, ఆవేదనతో అదరి పోతూన్న హృదయంతో ఇంటిదారి పట్టాడు.

ఊరు సమీపిస్తున్న కొద్దీ అతనికి చాలామంది ఎదురవు తున్నారు. కాని వారిలో పరిచితు డొక్కడూ కనిపించక పోవడం ఆశ్చర్యం వేసింది. నిజానికి ఆ చుట్టుప్రక్కల అతనికి పరిచయం లేని వ్యక్తే లేదని అతని నమ్మకం. వాళ్ళ దుస్తులు కూడా ఏమిటో కొత్తగా ఉన్నాయి. ఎదురైన ప్రతి వ్యక్తీ తన వంక ఆశ్చర్యంగా, ఎగా దిగా చూసి, తన గడ్డాన్ని నిమురుకుని చూసుకుంటున్నాడు. అంతా ఇలా

చేస్తూండడంతో అప్రయత్నంగా రిప్పుకి కూడా చెయ్యి తన గడ్డం మీదికి పోయింది. దాంతో తనకు చిత్రంగా పొడుగైన గడ్డం పెరిగిందని అతడు గ్రహించాడు. అతని ఆశ్చర్యానికి మేరలేదు.

అప్పటికి ఊరి పొలిమేరల్లోకి వచ్చేశాడు. ఏవో వింత వింత దుస్తులు వేసుకున్న కుర్రవాళ్లంతా తెల్లగా నెరిసిన అతని పెద్ద గడ్డాన్ని చూసి నవ్వుతూ, నానా హంగామా చేస్తూ వెంట బడ్డారు. ఎదురు వచ్చిన కుక్కలన్నీ అతన్ని చూడగానే మామూలు ప్రకారం తోకాడిస్తూ దగ్గిరికి రాలేదు సరికదా, పెద్ద పెట్టున మొరగడం మొదలు పెట్టినయి. అసలా గ్రామమే చిత్రంగా ఇంతలో అంతా తారుమారై పోయినట్టుంది. జన సమ్మర్దం గల చిన్న పట్టణం లాగ కనిపిస్తూంది. తానెన్నడూ చూసి యెరుగని ఇళ్ళూ, వీథులూ కని పిస్తున్నయి. ఇళ్ళ తలుపులమీద ఏవేవో పేర్లూ, అంకెలూ, వ్రాసి ఉన్నయి. కిటికీల లోంచి కొత్త కొత్త ముఖాలు తొంగిచూస్తున్నయి. ఎటు చూసినా, ఏది చూసినా, ఇంద్రజాలంలో లాగ మారిపోయింది. అతని మనస్సు ఆలోచించడ మారంభించింది. తానూ, తన చుట్టూ ఉన్న సర్వ ప్రపంచం ఏదో మాయాజాలం వల్ల హఠాత్తుగా మారి పోయినట్టు కనిపిస్తూంది. ఆ క్రిందటి రోజే తా నక్కడినించి వెళ్లాడు. ఇంతలోనే గ్రామ మంతటా ఏమిటీ మార్పు! మొత్తం మీద అది తన గ్రామమే! అందులో సందేహ మేమీ లేదు. ఎదురుగుండా కాట్స్కిల్ పర్వతాలు ఎప్పటి లాగే కనిపిస్తున్నాయి. దూరాన పాల

పుంత లాగ హడ్సన్ నది ప్రవహిస్తూనే ఉంది. కొండలూ, కోనలూ అన్నీ వెనుకటి లాగ ఎక్కడి వక్కడే ఉన్నయి. రిప్ ఆందోళనకు అంతు లేదు. "నిన్న రాత్రి - దాని దుంపతెగ! ఆ సాథా చేసింది ఇంతపని! అసలే అంతంత మాత్రమయిన నా బుద్ధిని బుగ్గి పాలు చేసేసింది!" అనుకున్నాడు.

కష్టం మీద దారి గుర్తు తెచ్చుకుంటూ, ఏ క్షణంలో ఎటు నుంచి తన భార్య కఠోర కంఠస్వరం వినిపిస్తుందో అని ప్రాణాలు బిగబట్టుకుని తన యింటి వద్దకు చేరుకున్నాడు. ఇల్లంతా పాడుపడి ఉంది. కప్పు కూలిపోయింది. కిటికీలన్నీ ఎక్కడి వక్కడే మాయ మైనయి. గుమ్మాలకు తలుపులు లేవు. తిండి లేకమాడి చావడానికి సిద్ధంగా ఉన్న సర్దార్ పోలిక లున్న కుక్క ఒకటి అక్కడ తారట్లాడుతూంది. రిప్పు "సర్దార్" అని పిలిచాడు. కాని, ఆ కుక్క పళ్లు బిగబట్టి మూల్గుతూ ప్రక్కకు తొలిగిపోయింది. ఇది మరీ దారుణం! "నా కుక్క కూడా నన్ను మరిచి పోయిందా?" అని నిట్టూర్చాడు.

స్వగృహంలో ప్రవేశించాడు రిప్. నిజానికి ఏ మాట కామాటే చెప్పుకోవాలి. రిప్ భార్య ఆ యింటికి రోజూ ఎంత చాకిరీ అయినా చేసి, ఎప్పుడూ పరిశుభ్రంగా ఉంచేది. ఇప్పు డసలు ఇల్లంతా ఖాళీగా, పాడో అంటే "ఓ" యంటూ, దెయ్యాల కొంప లాగ ఉంది. ఇంట్లో ఎవరూ లేక పోవడం వల్ల అతనికి భార్యను గురించిన దుడుకు కొంత ఉపశ

మించింది. గొంతు సవరించుకుని, భార్యను, పిల్లలనూ పేరు పేరు వరసనా పిలిచాడు. ఆ పాడు గోడల మధ్య అతని కంఠస్వరమే మారుమోగి మళ్ళీ వినింపించింది. తరువాత మళ్ళీ ఎప్పటి నిశ్శబ్దమే!

ఏమీ బోధపడక, అక్కణ్ణించి నిరాశతో, తాను మామూలుగా రోజూ వెళ్లి కాలక్షేపం చేసే సత్రం దగ్గిరికి వెళ్ళేసరికి, ఆ సత్రం అసలు అక్కడ లేనే లేదు. దాని స్థానంలో, కలప చెక్కలతో కట్టిన పాత ఇల్లొకటి ఉంది. పెద్ద పెద్ద కిటికీలలో ఏర్పడిన బీట లలో పాత టోపీలు, చింపి కోట్లూ కుక్కి పూడ్చారు. ఆ ఇంటి తలుపు మీద, "యూనియన్ హోటల్ – ప్రొప్రయిటర్: జొనా థన్" అని వ్రాసి ఉంది. వెనకటి డచ్ సత్రం ముందర చల్లగా నీడ నిస్తూ ఉండిన పెద్ద చెట్టుకి బదులు అక్కడ ఇప్పు డొక ఎత్తైన స్తంభం పాతి ఉంది. దాని పైన ఎర్రని టోపీలాంటి దేదో ఉంది. ఆ స్తంభానికి చివర నక్షత్రాలూ, చారలూ గల జెండా (అమెరికా సంయుక్త రాష్ట్రపు జాతీయ పతాకం) ఒకటి గాలికి రెపరెప కొట్టు కుంటూంది. రిప్‌కి ఇదంతా అత్యాశ్చర్యకరంగా, అగమ్య గోచరంగా ఉంది. గోడమీద ఉన్న జార్జి చక్రవర్తి పటం మాత్రం అతడు గుర్తు పట్ట గలిగాడు. కాని, చిత్రంగా, అదీ చాలా మారిపోయింది. ఆ పటం క్రింద కూర్చుని తాను ఎన్ని వందలు, వేలు చుట్టలు తగలే శాడో పూర్వం! ఆ చక్రవర్తి పటంలో ఎర్ర కోటుకి బదులు ఇప్పుడు నీలపు కోటు వెలిసింది. ఎడమ చేతిలో రాజ లాంఛన మైన ఖడ్గా

నికి బదులు వీర శస్త్రం ఉంది. తలపైన "కాక్ హాట్" టోపీ మాత్రం ఉంది. దిగువను "జెనరల్ వాషింగ్టన్" అంటూ ఏవో అక్షరాలు కూడా వ్రాసి ఉన్నవి.

ఆ హూటలు ద్వారంవద్ద జనం గుంపుగా మూగి ఉన్నారు. అందులో ఒక్క ముఖమూ రిప్ గుర్తు పట్టలేదు. అస లచటి ప్రజల స్వభావమే పూర్తిగా మారిపోయినట్లు కనిపిస్తోంది. పూర్వం నిద్ర పోతూన్నట్లు ప్రశాంతంగా ఉండిన అచటి వాతావరణం ఇప్పుడంతా హడావిడిగా, ఆర్భాటంగా, ఆవేగమయంగా కనిపిస్తూంది. విశాల మైన నుదురూ, మధ్య సొట్ట గల చిన్న గడ్డం, పెద్ద చిలుము గొట్టంతో సహా సదా అక్కడ కూచుని, పెదలి చేటయిన పేలవపు మాటలకు బదులు పొగమబ్బులతోనే బహు విషయాలు ఉపన్య సిస్తూండిన నికొలస్ వెడ్డర్‌గాని, పాత వార్తా పత్రికలలోని అద్భుత విషయాలను త్రవ్వి పోస్తూ ఉండిన బడి పంతులు వాన్ బమ్మెల్ గాని కనిపిస్తారేమో అని అందరి ముఖాలు తేరిపార చూశాడు. వాళ్లకి బదులు బక్కగా పైత్య ప్రకోపం గల రోగి లాగ కనిపించే ఒక వ్యక్తి కోటు జేబుల నిండా ఏవో కరపత్రాల బొత్తులు దోపుకుని, మానవుల హక్కులను గురించి, ఎన్నికలను గురించి, కాంగ్రెసు (అమెరికా పార్లమెంటు) సభ్యులను గురించి, స్వేచ్ఛా స్వాతంత్ర్యా లను గురించి రిప్ వాన్ వింకిల్‌కి అర్థంకాని "బాబిలనిష్" భాషలోచి గడగడా మాట్లాడేస్తున్నాడు.

అతిగా పెరిగిపోయిన దాడీతో, తుప్పుపట్టిపోయిన తుపాకీ గొట్టంతో చీలికలై జీరాడుతూన్న మకిలి దుస్తులతో, వెంటబడి వస్తూన్న పిల్లమూకతోను, కొందరు ఆడవాళ్ళతోను అక్కడికి రిప్ వచ్చే సరికి అచటి గ్రామీణ రాజకీయ వేత్త లందరి దృష్టులు ఒక్క సారిగా అతని వంకకు మరలినయి. వెంటనే వాళ్లంతా ఆయన చుట్టూ మూగారు. అత్యాశ్చర్యంతో నఖ శిఖ పర్యంతం ఎగా దిగా చూశారు. ఉపన్యాస కుడు అతని జబ్బ పట్టుకుని కొంచెం ప్రక్కకి తీసుకువెళ్లి, "ఇంతకీ తమరు ఏ పక్షానికి వోటు చేయదలచుకున్నారు?" అని రహస్యంగా అడిగాడు. రిప్ ఆ మాటలకు అర్థం తెలియక, నిర్విణ్ణుడై, అయో మయపు శూన్య దృక్కులతో వారి వంక అలాగే చూస్తూనిలబడి పోయాడు. బాగా చలాకీగా కనిపిస్తూన్న పొట్టివా డొకడు ఇంకో జబ్బ పట్టుకుని, రెండో వైపుకి లాగుకుని వెళ్ళి, కాళ్లెత్తి బొటన వేళ్ళ మీద నిలబడి రిప్ చెవిలో మెల్లగా, "తమరిది ఫెడ రల్ పక్షమా? డెమోక్రాట్ పక్షమా?" అని అడిగాడు. రిప్‌కి ఈ ప్రశ్న మరింత అయోమయంగా ఉంది. విస్తుపోయి చూస్తూ నిల బడ్డాడు. ఇంతలో మాటకారి ననే ధీమాతో మాట్లాడ గల ఒక టోపీ పెద్దమనిషి జనాన్ని మోచేతులతో ఇటూ, అటూ, నెట్టి దారి చేసుకుంటూ రిప్ వాన్ వింకిల్ ఎదటికి వచ్చి, ఎడమచేయి వయ్యా రంగా నడుముమీద ఆన్చి, కుడిచేత్తో కర్ర పట్టుకుని నిలబడ్డాడు. చురుకైన చూపులు శూలాలలాగ రిప్ ఆత్మలో కంటా గుచ్చుకునే టట్టు చూస్తూ ఇలా అన్నాడు; "ఎవరయ్యా! నువ్వు? తుపాకి బుజాన

పెట్టుకుని, అల్లరి మూకని వెంట బెట్టుకుని ఎన్నిక కేంద్రానికి రావడంలో నీ ఉద్దేశ మేమిటి? ఈ గ్రామంలో తిరుగు బాటు లేవదీద్దామనా నీ ప్రయత్నం?"

రిప్ ఆశ్చర్యంతో, అయ్యో! ఖర్మ! బాబూ నేనో నిర్భాగ్యుణ్ణి. నాది ఈ ఊరే. నేను చక్రవర్తి ప్రభుత్వానికి పూర్తిగా విధేయుణ్ణి," అన్నాడు.

ఈ లోగా ప్రక్కన నిలబడి ఉన్న వారిలోంచి "టోరీ; చక్రవర్తి గూఢచారి; కాందిశీకుడు; పట్టుకోండి! తన్నండి!" అంటూ కేకలు బయలుదేరాయి. ఆ పైన ఆ టోపీ పెద్దమనిషి అతి కష్టం మీదగాని ఆ జనాన్ని శాంతింప జేయలేక పోయాడు. జనంలో కల్లోలం కొంత సద్దుకున్న తరువాత ఆ టోపీ పెద్దమనిషి, "అసలు నువ్వేం పనిమీ దొచ్చావయ్యా ఇక్కడికి? ఎవరి కోసం?" అని మళ్ళీ రిప్‌ని ప్రశ్నించాడు. పాపం రిప్ దీనంగా "నేను ఎవ్వరికీ ఏ విధమైన హానీ కలిగించడానికి రాలేదు. వెనక ఇక్కడ ఉండిన సత్రం అరుగుమీద రోజూ కలుసుకుంటూ ఉండిన మా ఇరుగు పొరుగు స్నేహితుల్లో ఎవరైనా కనిపిస్తారేమో అని వచ్చాను," అన్నాడు.

"ఎవరా స్నేహితులు? పేర్లు చెప్పు!"

రిప్ ఒక్క నిమిషం ఆలోచించి "నికొలస్ వెడ్డర్ గారు ఎక్కడ ఉన్నారు?" అని అడిగాడు.

కొంత సేపు నిశ్శబ్దం. ఎవరూ మాట్లాడ లేదు. ఇంతలో నోటి నిండా గొట్టపు పొగ పీల్చిన ఒక వృద్ధుడు ఇలా అన్నాడు. "నికొలస్ వెడ్డరా? అబ్బో! ఆయన మరణించి అప్పుడే పద్ధెనిమి దేళ్లయిందిగా? ఆ చర్చి వెనక శ్మశానంలో అతని గోరీ మీద అతణ్ణి గురించి వ్రాసిన ఒక కర్రపలక ఉండేది. అదీ క్రమంగా శిథిలమై పోయింది."

"పోనీ, బ్రూమ్ డచ్చర్ గారు ఉన్నారా?"

"ఆయన యుద్ధం ప్రారంభ మవుతూనే సైన్యంలో చేరి పోయాడు. స్టోనీ పాయింట్ దగ్గిర యుద్ధంలో చచ్చిపోయా డంటారు, కొందరు. ఆంటోనీ నోస్ దిగువను ఒక సుడిగుండంలో మునిగి పోయా డంటున్నారు మరి కొంత మంది. ఏది నిజమో, ఏది అబద్ధమో కాని, మళ్ళీ ఆయన ఇంటి ముఖం చూడని మాట మాత్రం నిజం."

"పోనీ, బడిపంతులు వాన్ బమ్మెల్ అయినా ఉన్నాడా?"

"ఆయన కూడా యుద్ధంలోకి వెళ్ళి పెద్ద దళనాయకుడు అయి, ప్రస్తుతం కాంగ్రెసు సభ్యుడుగా ఉన్నాడు."

తన యిల్లూ, స్నేహితులూ, గ్రామం ఇంతలో ఇంత దారుణంగా మారిపోయి, ప్రపంచంలో తాను ఒంటరివా డయిపోవడం - రిప్‌కి అమిత విచారం కలిగించింది.

తాను ఏ ప్రశ్న వేసినా అత్యాశ్చర్యకరమైన జవాబులే వస్తున్నాయి. తనకు తెలియకుండా, అకస్మాత్తుగా, ఎంతో కాలం గడచి

పోయినట్టు మాట్లాడుతున్నారు అంతా. "యుద్ధంట"! "కాంగ్రెస్‌ట"! "స్టోనీ పాయింట్‌ట"! ఏమిటో ఈ మాటలకు అర్థాలే తనకు బోధ పడడం లేదు. ఇక అతని స్నేహితులను ఎవరిని గురించి అడగడానికే అతనికి ధైర్యం చాలక పోయింది. నిస్పృహతో, గద్గద స్వరంతో, "పోనీ, ఇక్కడ ఎవరైనా రిప్ వాన్ వింకిల్‌ని ఎరుగుదురా?" అని ప్రశ్నించాడు.

"రిప్ వాన్ వింకిలా? ఎరక్కేం?" అన్నారు, వెంటనే ఇద్దరు ముగ్గురు ఒకే సారి; "అదుగో! ఆ ఎదురు గుండా ఉన్న చెట్టు నాను కుని కూచున్నాడు చూడు. ఆ అవతారమే రిప్ వాన్ వింకిల్!"

రిప్ అటుకేసి చూశాడు. సరిగా ముమ్మూర్తుల తన లాగే, తాను పర్వతంమీదికి వెళ్లే రోజున ఉన్నట్టే కనిపిస్తూన్న ఒక వ్యక్తి ఆ చెట్టు నానుకుని కూచుని ఉన్నాడు. తన లాగే అతడూ పరమ బద్ధ కస్తుడులాగ, సోమరిపోతు లాగ, చింపిరి గుడ్డలు కట్టుకుని కేవలం తన నోట్లోంచి ఊడిపడ్డట్టు ఉన్నాడు. పాపం! రిప్‌కి ఇక ఏమీ తోచ లేదు. ఆందోళన పడిపోయాడు. అసలు తా నెవరు? తాను రిప్ వాన్ వింకిల్ కాదా? ఏమిటీ మాయ? ఈ కంగారంతా చూసి, టోపీ పెద్దమనిషి మళ్ళీ కలిపించుకుని, అతని ఊరూ పేరూ అడిగాడు.

"ఏమో....! భగవంతుడికే తెలియాలి," అన్నాడు పిచ్చి వాడి లాగ రిప్పు: "నేను మారిపోయాను. ఇప్పుడు నే నెవరినో నాకే తెలియదు. అదుగో అక్కడ కూచున్న వాణ్ణి నే నంటున్నారు.

మరి నే నెవణ్ణో! కాదు కాదు! వా డెవడో నా వేషం వేసుకుని బ్రతుకుతున్నాడు కాబోలు! నిన్న రాత్రి దాకా మామూలుగానే ఉన్నాను. అంతా మామూలుగానే ఉంది. రాత్రి ఆ పాపిష్ఠి పర్వతం మీద పడుకుని నిద్రపోయాను. వాళ్లు నా తుపాకీ మార్చేశారు. అంతా మారిపోయింది. నేనే మారిపోయాను. ఇప్పుడు నా పేరేమిటో, నే నెవర్నో ... చెప్పలేను; .... చెప్పలేను ... నాకే తెలియదు," అన్నాడు.

చుట్టూ నిలబడిన వారంతా, ఈ ప్రసంగం విని, ఆశ్చర్యంతో ఒకళ్ల ముఖాల కేసి ఒకళ్లు చూసుకుంటూ, సాభిప్రాయంగా తల లూపుకున్నారు. ముని వేళ్లతో నుదుటి మీద కొట్టుకుంటున్నారు. ఒక ప్రక్కన గుసగుసలు బయలుదేరినయి. ముందుగా ఆ తుపాకీ లాక్కుని దాచి పెట్టడం, ముసలాడు వేరే గందరగోళ మేమీ చెయ్యకుండా తగిన కట్టుదిట్టం చెయ్యడం మంచిది అన్నారందులో ఒకరు. ఈ మాట వినగానే ఆ టోపీ పెద్దమనిషి ఆ జనాన్ని ఒత్తిగించుకుంటూ చల్లగా జారిపోయాడు. ఇంతలో సన్నగా, నాజూకుగా, పరిశుభ్రంగా ఉన్న ఒక స్త్రీ చంకలో దిబ్బసకొక్కులాంటి పిల్లవాడి నెత్తుకొని, ఆ జనంలోంచి దారి చేసుకుంటూ ఈ పొడుగు గడ్డం ముసలాణ్ణి తేరిపార చూడడానికి బాగా దగ్గిరికి వచ్చింది. తెల్ల గడ్డం తాతను చూసి పసివాడు ఏమనుకున్నాడో, ఏడవడం మొదలు పెట్టాడు. "రిప్! కాస్త ఊరుకో నాయనా!... నువ్వొకడివి నాకు, వెధవ గోల!... ఆ తాత నిన్నేం పీక్కు తినడురా!" అంటూ ఆమె

నయానా, భయానా వాణ్ణి సముదాయించింది. ఆ పాపడి పేరూ, ఆ తల్లి రూపం, ఆమె కంఠస్వరం రిప్ వాన్ వింకిల్ మనస్సులో మరొక తుపాను కెరటాన్ని రేపినయి. ఆయనకు ఏవేవో జ్ఞాపకానికి వస్తున్నయి.

"తల్లీ! నీ పేరేమిటమ్మా?" అని అడిగాడు.

"జూడిత్ గార్డెనీర్."

"మీ తండ్రి పేరు?"

అయ్యో!........ మా తండ్రా?........ మా నాయన పేరు రిప్ వాన్ వింకిల్.... ఇరవయ్యేళ్ళ క్రిందట తుపాకి పట్టుకుని, వేట కని ఆ పర్వతాల్లోకి వెళ్ళాడు. ఇంత వరకు తిరిగి రాలేదు సరికదా, ఏమయి పోయాడో జాడ చెప్పిన వారు కూడా లేకపోయారు. మా నాన్నతో పాటు వేటకి వెళ్ళిన కుక్క మాత్రం ఇంటికి తిరిగి వచ్చేసింది. ఆ తుపాకితో కాల్చుకుని ఆత్మహత్య చేసుకున్నాడో, లేక ఎఱ్ఱ ఇండియన్లే ఎత్తుకు పోయారో తెలియదు. అప్పటికి నాకు బాగా చిన్నతనం," అంది.

రిప్ అడగదలచుకున్న ముఖ్యమైన ప్రశ్న ఒక్కటి మాత్రం మిగిలిపోయింది. నసుగుతూ, తొట్రుపడుతూ అడిగాడు.

"అయితే మీ అమ్మ.... ఇప్పు డెక్కడుంది?"

"ఏం చెప్పను? మా గ్రహచారం! తర్వాత కొన్నాళ్ళకి మా అమ్మ కూడా చచ్చిపోయింది. న్యూ ఇంగ్లండు నించి వచ్చిన ఒక

వర్తకుడిపైన కోపం వచ్చి అరుస్తూ, ఆ ఉద్రేకంలో ఒక రక్తనాళం పగలడంవల్ల చచ్చిపోయింది.

ఈమాట విన్నమీదట రిప్పు ముఖంలోని ఆరాటం కొంత ఉపశమించింది. ఇక నిగ్రహించుకో లేక పోయాడు. కూతురునీ, మనమణ్ణీ తేరిపార చూస్తూ "తల్లీ! నేనే మీ నాన్న నమ్మా! గుర్తు పట్టలేవా? వెనక బలంగా పడుచువాడిలాగే ఉండే వాడిని! ఇప్పుడు ముసలి వాడనై పోయాను! రిప్ వాన్ వింకిల్,... నిర్భాగ్యుడైన ఈ రిప్ వాన్ వింకిల్‌ని గుర్తుపట్ట గలిగిన వారెవ్వరూ ఇక్కడ లేరా?" అని అరిచాడు.

దాంతో, అంతా దిగ్భ్రాంతులై నిలబడి పోయారు. ఇంతలో వెనకనుంచి ఒక మూడు కాళ్ల ముసలి అవ్వ కళ్లకి చెయ్యి అడ్డు పెట్టుకుని చూస్తూ వచ్చి వచ్చి, రిప్ వాన్ వింకిల్ ముఖం తేరిపార చూసి, "అయ్యో! అయ్యో! ఇంకా సందేహ మేమిటి? రిప్ అన్నయ్యే! రా అన్నయ్యా! రా!...... అయ్యో! తల్లీ తోళ్ళ లాగ ఉండే వాళ్ళం. ఎన్నాళ్ళ కెన్నాళ్ళకి కనపడ్డావ్ అన్నయ్యా! ఇంతకీ ఎక్కడ ఉన్నావ్ ఇన్నాళ్ళనించీ." అంటూ ఆయాసం వచ్చేటంత సంభ్రమంతో అనేసింది.

"ఆ ఇరవై సంవత్సరాలూ నాకు ఒక్క రాత్రి నిద్రలో గడచి పోయినయి." అంటూ రిప్ నిట్టూర్చి తన కథ అంతా చెప్పడం మొదలు పెట్టాడు. అక్కడి వాళ్లంతా, కళ్ళింతవి చేసుకుని, చెవులు దోరగిల బెట్టుకుని ఆ చిత్రకథంతా విన్నారు. ఒకరి ముఖా లొకరు

చూసుకునే వాళ్లు కొందరు; నాలికలు బుగ్గన పెట్టి తెల్లబోయి చూస్తూ కూచున్న వాళ్లు కొందరు!

ఈ పారవశ్యం కొంచెం ఉపశమించిన మీదట ఆ టోపీ పెద్దమనిషి మళ్లీ మధ్యకి వచ్చి నోటి చివరలు సుళ్లు తిరిగేటట్టు బిగించి పట్టి, సాలోచనగా తలూపుతూ, కొంచెం నిదానించి చూశాడు. ఇదంతా చూస్తున్న చుట్టు ప్రక్క ల జనమంతా అలాగే తల లూపారు.

చివరికి, అదే సమయానికి ఆ రోడ్డు మీదనించి పోతూన్న వృద్ధుడు పీటర్ వాండెర్ డాంక్ అభిప్రాయం కనుక్కొని అలా చెయ్యడానికి అంతా తీర్మానించారు. అతడు ఆ రాష్ట్రపు ప్రాచీన చరిత్ర రచించిన పీటర్ వాండెర్ డాంక్ వంశస్థుడు. ప్రస్తుతం అతడే ఆ గ్రామానికి వృద్ధ పితామహుడు. ఆ గ్రామానికీ ఆ ప్రాంతానికీ సంబంధించిన గాథ లేవి కావలసి వచ్చినా ఆయన్ని అడగవలసిందే. ఆయన రిప్పుని తేలికగా గుర్తు పట్టాడు. అతడు చెప్పిన విషయాలన్నింటిని సంతృప్తికరంగా ధ్రువపరిచాడు. కాట్స్ కిల్ పర్వతాలలో చిత్రవిచిత్ర వ్యక్తులు కనిపించేవారన్నమాట తాను తన పూర్వుల దగ్గర చాలా సార్లు విన్నట్టు ఆయన చెప్పాడు. అచ్చటి హడ్సన్ నదినీ, ఆ ప్రాంతాన్నీ మొదట కనిపెట్టిన హెండ్రిక్ హడ్సన్ అనే మహా పురుషుడు ఇరవయ్యేళ్ళ కొకసారి ఆ ప్రాంతానికి వచ్చి పోతూ ఉంటాడనీ, వచ్చి ఆ నదినీ, ఆ నది పేరుతోనే దాని ఒడ్డున ఏర్పడిన నగరాన్నీ సందర్శించడానికి హెండ్రిక్‌కీ, ఆయన

"హాఫ్ మూన్" పరివారానికీ అనుమతి ఉన్నదనీ కూడా తాను విన్నాడు. అంతేకాదు. వారు తమ ప్రాచీన డచ్ వేషాలలో "నైన్ పిన్స్" బంతి ఆట ఆడుతూ ఉండగా తన తండ్రి కూడా ఒకసారి చూసినట్లు తనతో చెప్పాడని కూడా అన్నాడు. "ఇదంతా ఎందుకు? ఒక వేసవి సాయంకాలం పెద్ద ఉరుముల్లా వినిపించే వాళ్ళ బంతులు దొరలిన చప్పుళ్లు నేనే స్వయంగా వినడం కూడా తటస్థించిం" దన్నాడు.

ఇక కథ క్లుప్తంగా చెప్పేస్తాను. క్రమంగా ఆ గుంపులో జనమంతా చెదరిపోయి, అంత కంటె ఎక్కువ ముఖ్యమైన తమ ఎన్నికల పని చూసుకోటానికి వెళ్లిపోయారు. రిప్ కూతురు తండ్రిని వెంట బెట్టుకుని పోయి తన ఇంట్లోనే ఉంచుకుంది. ఆమెకు సంపన్నుడూ, యోగ్యుడూ అయిన పెనిమిటీ, సర్వ సౌకర్యాలు గల మంచి యిల్లూ ఉన్నాయి. తన అల్లుడు చిన్న తనంలో తన బుజాల మీద ఎక్కి ఆడుకున్న పొరుగు పిల్లలలో ఒకడని తెలిసి రిప్ సంతోషించాడు.

రిప్పు కొడుకూ, వారసుడూ అయిన చిన్న రిప్ ముమ్మూర్తులా తండ్రికి నకలుగా తయారయాడు. ఒక చోట పొలం పనికి కుదిరాడు. అయితే, పూర్తిగా తండ్రిపోలిక రావడం వల్ల, అతడూ తన పని మినహా తక్కిన పనులు మాత్రమే చేస్తున్నాడు.

రిప్ మళ్ళీ యథా ప్రకారం పూర్వపు షికార్లు, ఇతర దైనందిన కార్యక్రమాలు ప్రారంభించాడు. వెనకటి స్నేహితులలో మిగిలి

ఉన్న వారందరితో మళ్ళీ తన పరిచయాలు పునరుద్ధరించుకున్నాడు. కాని వాళ్లందరిలో కాలం చాలా మార్పులు తెచ్చింది. అందువల్ల అంతకన్న కొత్త తరం వాళ్ళే మేలని, కొందరు కొత్త స్నేహితుల్ని సంపాదించాడు. ఈ ముఠా అంతటికీ రిప్ గురువు.

ఇంటి దగ్గర చేసేందుకు పని ఏమీ లేక పోవడం వల్లనూ, సోమరితనం దోషం కాని సుఖమయిన వయస్సు వచ్చినందువల్లనూ ఈ తడవ నిశ్చింతగా అతడు రోజూ సత్రం అరుగుమీద కొలువు దీర్చి, గోష్ఠులు నడుపుతున్నాడు. ఆ గ్రామస్థు లంతా అతణ్ణి ఆ గ్రామ పితామహుల్లో ఒకడుగా గౌరవిస్తున్నారు. యుద్ధానికి పూర్వపు రోజుల్లో సంగతులు వినడం కోసం వచ్చే పనీ పాటా లేని పడుచు వాళ్ళంతా ఆయనకు నిత్య సభాసదులు.

అయినా, అతని "నిద్రాయుగం"లో జరిగిన విచిత్ర సంఘటన లన్నీ విని గ్రహించి, ఆ నాటి మానవులలో ఒకడుగా చలామణీ అవడానికి అవసరమైన ప్రాతిపదిక పరిజ్ఞానం రిప్‌కి అటు తరువాత కొంత కాలానికి గాని అలవడలేదు. దేశంలో చిన్న సంఘర్షణగా బయలుదేరిన విప్లవం క్రమంగా చినికి చినికి గాలివాన అయి పెద్ద యుద్ధంగా ఎలా పరిణమించినదీ, దాని ఫలితంగా అమెరికా సంయుక్త రాష్ట్రాలకు పాత ఇంగ్లండు దేశీయుల పరిపాలన ఎలా తప్పి పోయిందీ తెలుసుకున్నాడు. వెనకటిలాగ, తాను జార్జి చక్రవర్తి ప్రజలలో ఒకడు కాడనీ, అమెరికా సంయుక్త రాష్ట్రపు స్వతంత్ర పౌరుడనీ లీలగా గ్రహించాడు. రిప్ రాజకీయ వేత్త కాడు. అందువల్ల

రాజ్యాలూ, సామ్రాజ్యాలూ తారుమారైనా ఆయనలో వచ్చే మార్పు ఏమీ లేదు. కాని, ఒక అధికార దౌర్జన్యాన్ని మాత్రం సహించలేక పోయే వాడు. అది ఎంతటి బాధాకరమో వెనక ఆయన స్వగృహం లో అనుదిన స్వానుభవ పూర్వకంగా గ్రహించిన వాడు. అదృష్ట వశాత్తు ఇప్పుడా దుర్దశ తప్పిపోయింది. "పులి - మేక" సంసారపు అగచాట్లు తప్పిపోయి, ఇప్పుడు భార్యా ప్రళయ తాండవ భీతి లేకుండా స్వేచ్ఛగా బ్రతుకుతున్నాడు. అడపా దడపా ఆమె పేరు విన్నప్పుడు మాత్రం ఇప్పటికీ ఉలిక్కిపడి, భుజాలు కుంచించుకుని, కొంత సేపు అలాగే పైకి చూస్తూ ఉండిపోతాడు; మరి, అది తన విధిని తలచుకొని విచారపడడమో! జీవితంలో తనకు విమోచనం కలిగి నందుకు ఆనందించడమో మాత్రం అర్థం కాదు.

"డూ లిటిల్"గారి హోటల్ దగ్గిరికి వచ్చిన కొత్తవాళ్లందరికీ రిప్ తన కథంతా పూస గుచ్చినట్టు చెప్పేవాడు. మొదటి రోజుల్లో కొత్తగా కథ చెప్పినప్పుడల్లా కొద్ది కొద్ది మార్పులు ఉండేవి. చిర కాలం నిద్రపోయి లేచిన కొత్తలు అవడమే బహుశః ఆ మైమరపుకి కారణం అయి ఉండాలి. చివరికి ఆ కథ ఇప్పుడు మనం చెప్పు కుంటున్న రూపంలోకి వచ్చి స్థిరపడి పోయింది. ఆ చుట్టు ప్రక్కల ప్రాంతంలోని ఆబాలగోపాలానికీ ఈ కథ కంఠస్థం అయి పోయింది. ఇదంతా వాస్తవంగా జరగలేదేమో అనీ, రిప్‌కి బహుశః మతి పోయి ఉండవచ్చుననీ, అతడు వెర్రిబాగుల వాడు లాగ తిరుగుతూండడానికి అదే కారణ మయి ఉండవచ్చుననీ భావించే

సంశయాత్ములు కూడా కొందరు లేకపోలేదు. ప్రాచీనపు డచ్ వలస దారులు మాత్రం ఈ కథంతా పూర్తిగా నిజమని నమ్మేవారు. ఎప్పుడు ఉరుములు వినిపించినా కాట్స్ కిల్ పర్వతాలలో హెండ్రిక్ హడ్సనూ, ఆయన పరివారం "నైన్ పిన్స్" బంతాట ఆడుతున్నారని వారు పిల్లలకు చెపుతూండడం మామూలు.

ఆ ప్రాంతంలో గయ్యాళి భార్యలతో బాధ పడే భర్తలంతా మరీ కష్టం తోచినప్పుడు, "రిప్ వాన్ వింకిల్ తాగిన డచ్ సారా నాకో గ్లాసెడు దొరికితే బ్రతికి పోదును" అని విలపిస్తూ ఉండటం కూడా పరిపాటి అయింది.





# రాబందత్తకి శాస్తి

★

లూయిజియానా జానపద గాథ

★

రాబందుల తలలన్నీ బట్టతలలై పోవడానికి కారణం ఏమిటో మీకు తెలుసా? తెలియదు కదూ? చెపుతా వినండి :

అనగా అనగా అనగా ఒక అడవిలో ఒక పెద్ద ఓక్ చెట్టు. దాని మీద ఒక రాబందు భార్యా పిల్లలతో కాపురం చేస్తూంది. రాబందు మామ వట్టి అప్రయోజకు డవడం వల్ల రాబందత్తా, పిల్లలూ తరచు బలవంతపు ఉపవాసాలు చేయవలసి వస్తూండేది.

ఇలాగే చాలా కాలంగా ఆ ఓక్ చెట్టు మొదట ఉన్న ఒక పెద్ద కలుగులో కుందేలన్న ఉంటున్నాడు. ఆ కుందేలన్న సుఖంగా

తిని, బాగా బలిసి ఉండడం చూసి, రాబందత్తకి నోరూరింది. ఎలా గైనా కుందేలన్నని కడతేర్చగలిగితే, తనకూ, తన పిల్లలకూ కడుపు నిండా కమ్మని తిండి దొరుకుతుంది గదా అనుకుంది. ఒక రోజున మధ్యాహ్నం కుందేలన్న మస్తుగా భోంచేసి, గుర్రుపెట్టి నిద్ర పోతూన్న సమయం కనిపెట్టి, రాబందత్త అతని కలుగు దగ్గిరికి వెళ్ళి, ముందుగా ఇంత గడ్డీ, తుక్కూ దాని నిండా కుక్కి, దాని పైని ఇటిక రాళ్ళు కూడా కూరి, ఆ కన్నాన్ని పూర్తిగా మూసేసింది. కుందేలన్న బయటికి పోవడానికి దారి లేదు. అలాగే తిండి లేక మాడి చచ్చిపోతాడు గదా, వెంటనే పోయి వాడి బలిసిన కండరాలతో తానూ, తన పిల్లలూ విందు చేసుకో వచ్చును గదా అనుకుంది రాబందత్త.

కుందేలన్న నిద్ర లేచి చూసేసరికి ఏముంది? కన్నం పూడి పోయి ఉంది. చీకటి గాఢాంధకారంగా ఉంది. ఎటు పోయేందుకూ, ఏమి చేసేందుకూ దిక్కుతోచడం లేదు. రాబందత్తను జాలిగా బ్రతిమాలాడు. తన బిలానికి పూడిక తీసి, ఎలాగైనా తనని బయట పడెయ్యమని ఎన్ని సార్లు అరచినా, ఎంత మొత్తుకున్నా, రాబందత్త ఒకటే సమాధానం చెప్తూంది. "నాకు తగని ఆకలిగా ఉంది. నీ ఎముకల మీది మాంసం తినాలనిపిస్తూంది." అని ఊపకుంటూంది.

ప్రార్థించి ప్రార్థించి, ప్రాణం విసిగి, ఇక లాభం లేదనుకొని, కొంతసేపు నిశ్శబ్దంగా పడుకున్నాడు కుందేలన్న. కలుగులో కుందే

లన్న సందడి వినపడక పోవడంతో రాబందత్తకి పట్టరానంత పరమా నందంగా ఉంది. కుందేలన్న ఎముకల మీది మాంసం తినొచ్చునని ఉవ్విళ్ళూరుతూ, పెదిమలు నాక్కుంటూ, చెట్టు దిగి వచ్చి చూసింది. కలుగులో అలికిడేమీ వినిపించడం లేదు. ఇటు కొట్టుకుని, అటు కొట్టుకుని ఈ సరికి కుందేలన్న చచ్చిపోయే ఉండాలి అనుకుంది.

వెంటనే కలుగును పూడ్చిన ఇటిక ముక్కలన్నీ గబగబా బయటికి లాగింది. వాటి లోపల కూరిన చెత్తను కూడా లాగేసింది. ఆ పైన మెల్లగా ఆ కలుగులోకి ప్రవేశించింది. ఇంతలో సమయం కనిపెట్టి, కుందేలన్న కాస్తా బయటికి దూసుకు పోయాడు. కొంత దూరం వెళ్ళి వెనక్కి తిరిగిచూసి, "ఇప్పుడన్నా బోధ పడిందా? పిచ్చి అత్తా! మోసపోయింది నువ్వా? నేనా?" అని వెక్కిరించి, ఇట్టే పారిపోయాడు- కుందేలన్న.

అల్లా పరుగెత్తుకు పోయి, పోయి చివరికి ఒక స్నేహితుడి ఇంటికి చేరుకున్నాడు. మళ్ళీ ఆ డీక్ చెట్టు మొదట్లో ఉన్న తన ఇంటికి వెళ్ళడమంటే తగని భయంగా ఉంది. మళ్ళీ ఏం చేస్తుందో రాబందత్త. అంచేత, ఆ స్నేహితుడి ఇంట్లోనే ఉంటున్నాడు కుందేలన్న.

ఇలా ఉంటూండగా కొంత కాలానికి రాబందత్త కుందేలన్న మాటే మరచి పోయింది. ఒక రోజున ఆమె తన గుడ్లలోంచి అంతకుమునుపే బయటికి వచ్చిన చిట్టి చిట్టి పిల్లలతో సరదాగా షికారు

బయలుదేరింది. వాళ్ల కుందేలన్న ఉంటూన్న ఇంటి ముందునించే వెళ్తున్నారు. రాబందత్తకు ఎలాగైనా శాస్తి చెయ్యాలనుకున్నాడు కుందేలన్న. వెంటనే వంటింట్లోకి పరుగెత్తి, ఒక పెద్ద మూకుడు నిండా నిప్పులూ, బూడిదా తీసుకు వచ్చాడు. తీరా రాబందత్తా ఆమె పిల్లలూ గుమ్మం మెట్ల ముందుకి వచ్చే సరికి ఆ నిప్పులన్నీ వాళ్ల నెత్తిన పోశాడు. కాని, రాబందులకి నెత్తి మీద మినహా మిగిలిన శరీరమంతా దట్టమైన ఈకలతో కప్పి ఉంటుందని మీకు తెలుసునుగా! వాళ్ళంతా వెంటనే ఒళ్ళు విదిలించేసుకుని ఆ నిప్పులన్నీ దులిపి వేసుకున్నారు. కాని, అప్పటికీ వాళ్ల నెత్తిమీద ఉన్న లేత లేత ఈకలన్నీ కాలిపోయి, చర్మాలు బయట పడినయి.

అంచేతే, అప్పటికీ ఇప్పటికీ రాబందుల తలలన్నీ బోడితలలూ బట్టతలలూ అయినయి. అంచేతే అప్పటికీ ఇప్పటికీ కుందేళ్ల ఎముకల్ని మాత్రం రాబందులు అంటవు, ముట్టవు అంటారు.





# పీనాసి పెద్దమ్మ

★

అమెరికాలో దాక్షిణాత్య జానపద గాథ

★

ఎన్నో ఎన్నో ఏళ్ళ నాడు ఒక ఊళ్లో ఒక పీనాసి ముసలమ్మ ఉండేది. కానీ ఖర్చు చెయ్యాలిసివస్తే కాటికి పోయినంత పని అయేది ఆ ముసలిదానికి. అంచేత రోజూ తవిటి రొట్టెలు చేసుకు తిని, తమ్మిలేటి నీళ్లు తాగుతూ దమ్మిడీ దమ్మిడీ చొప్పున డబ్బు బాగా కూడబెడుతోంది. అల్లా కూడబెట్టగా, కూడ బెట్టగా, వెండి రూపాయిలూ, బంగారపు నవర్సులూ చాలా పోగు పడ్డయి. వాటన్నింటినీ ఒక పెద్ద తోలు సంచిలో పోసి, రెండో కంటి వాళ్లకి తెలియకుండా

అటక మీద చీకట్లో ఒక మూలగా వేలాడ గట్టింది. కర్చయి పోతుం దని, వేరే కానిడబ్బు కూడా తన దగ్గిర ఉంచుకునేది కాదు.

క్రమంగా పీనాసి ముసలి దానికి బాగా పెద్దతనం వచ్చినందు వల్ల, కీళ్లు పట్టు తప్పి, ఇంట్లో పని చేసుకునే శక్తి కూడా తగ్గి పోతూంది. పోనీ, ఆ ఊళ్లో పిల్లల్నెవరినైనా పనికి పెట్టుకుందా మంటే, తాను కూడ బెట్టి, ప్రాణపదంగా కాపాడుకుంటూన్న ధనం కాజేసుకు పోతారేమో అని భయం. ఒక రోజున కొడుకుని పిలిచి, "నాయనా! నాయనా! నువ్వు సముద్రం దాటి వెళ్లి నా ధనపు దాపరి కం సంగతేమీ ఎరగని అమాయకపు పిల్ల నెవరినైనా పనికి కుదుర్చుకు రాలా! నేను ఇంట్లో పని చేసుకో లేకుండా ఉన్నాను!" అంది. ఆమె కొడుకు వెళ్లి, ఒక పిల్లని తీసుకు వచ్చాడు. ఆ రోజు రాత్రి పాపం ఆ పిల్లే వాళ్లకి తవిటి రొట్టెలు చేసి పెట్టింది. ఇంట్లో పని తప్పి పోవడంతో ముసలి దానికి తోచక, పెత్తనాలకి బయలు దేరింది.

పని పిల్లని పిలిచి, "పిల్లా! పిల్లా! నువ్వు చాలా బుద్ధిమంతు రాలివి లాగున్నావు. నే నింట్లో లేనప్పు డెప్పుడైనా ఆ అటక మీది కెక్కి చూసేవుసుమా!" అని హెచ్చరించి మరీ వెళ్లింది. ఇంకేం? ముసల్ది అలా మలుపు తిరగగానే ఈ పిల్లది అటక ఎక్కి, కొంకి కర్ర పుచ్చుకుని నాలుగు వేపులా తిప్పే సరికి పైనించి వేలాడు తూన్న ధనపు సంచీ తాడు తెగి దభాలున కింద పడింది. అదేమిటో అని ఆదుర్దాగా తీసి చూసింది. ఆ తోలు సంచి నిండా వెండి, బం



"పడుచు పిల్లా! పడుచు పిల్లా! నా వెన్ను పుండయి మంట పుడుతూంది. కాసిని నీళ్ళు తెచ్చి కడిగిపోదూ!"

(చూడు : పుట 80)

గారం కనిపించడంతో, గబగబా ఆ సంచి మూతి మళ్ళీ బిగించి కట్టి బుజాన పెట్టుకుని ఉడాయించింది.

అలా పోగా పోగా దోవలో ఒక ముసలి ఆవు ఎదురు పడింది. ఆ ఆవు ఈమెను చూడగానే, "పడుచు పిల్లా! పడుచు పిల్లా! నా పొదుగు నిండా పాలు చేపుకి వచ్చి సహించ లేనంత సలప రింతగా ఉంది. కాస్త పాలు పితికి పోతావా,- నీకు పుణ్యముం టుంది?" అంది.

"నీ ముసలి పొదుగులో పాలు పిదకడానికే నా కెక్కడ వీలవుతుందీ! నేను చప్పున సముద్రం దాటి చాలా దూరం పోవాలి," అంటూ ఆగనైనా ఆగకుండా పారిపోయింది, ఆ పడుచు పిల్ల.

అలా పోగా, పోగా, ఒకచోట ఒక ముసలి గుర్రం ఎదురు పడింది. "పడుచు పిల్లా! పడుచు పిల్లా! నా వెన్ను పుండయి మంట పుడుతూంది. కాసిని నీళ్లు తెచ్చి కడిగిపోదూ! నీకు పుణ్యముం టుంది!" అని జాలిగా అడిగింది.

"హాత్! నీ వీపుమీద పుళ్లూ పుటార్రి కడగడానికి నా కెల్లా కుదురుతుంది? నేను చప్పున సముద్రం దాటి చాలా దూరంపోవాలి," అని జవాబు చెప్పి ఆగనైనా ఆగకుండా ముందుకి సాగిపోయింది, ఆ పిల్ల.

అల్లా పోగా పోగా పోగా, కొమ్మలన్నింటి నిండా పళ్ల బరువుతో కుంగిపోతూన్న జామి చెట్టొకటి ఎదురయింది. "పడుచు

పిల్లా! పడుచు పిల్లా! ఈ పళ్ళ బరువుతో నా జబ్బలు పడిపోతున్నాయి చూశావా! కాసిని పళ్లు కోసుకుని నా బరువు కాస్త తగ్గిస్తావా, నీకు పుణ్యముంటుంది?" అంటూ ఆ జామి చెట్టు ప్రేమతో పిలిచింది.

"హూత్! నీ పళ్లెంత జేసు! నువ్వెంత జేసు! నీ పళ్లు కోస్తూ కూచోడానికి నా కెక్కడ వీలవుతుంది? నేను చప్పున సముద్రం దాటి చాలా దూరం పోవాలి," అంటూ ఆగనైనా ఆగకుండా సాగి పోయింది ఆ పిల్ల.

ఇంతలో, పీనాసి ముసలమ్మ ఇంటికి తిరిగి వచ్చి వెంటనే అటక ఎక్కి చూసింది. ఇంకే ముంది! తన ధనపు సంచీ కాస్తా దారి పట్టి పోయింది. నెత్తీ, నోరూ కొట్టుకుంటూ వీధిని బడి, "అయ్యో! నా దేముడో! ఆరి నా దేముడో! నా ధనపు సంచీ కాస్తా మాయమై పోయిందోర్రి నా తండోర్రి!" అంటూ శోకాలు పెడుతూ బయలు దేరింది. పోగా పోగా పోగా, దార్లో ముసలి ఆవు కనిపించింది. "ఆవమ్మా! గోవమ్మా! పెద్ద తోలు సంచి మోసుకుపోతున్న ముచ్చు పిల్ల ఎవరైనా ఈ దారిని పోయిందా?" అని అడిగింది. "ఆ! ఆ! వెళ్లిందవ్వా! వెళ్లింది! త్వరగా వెళ్లు దొరుకుతుంది," అన్నది ముసలి ఆవు.

"అయ్యో నా దేముడో! ఆరి నా దేముడో! నా ధనపు సంచిని కాస్తా దాటేసుకు పోయిందిరో నా తండ్రో!" అంటూ శోకాలు పెడుతూ చర చర సాగిపోయింది పిసినిగొట్టు ముసలమ్మ. పోగా పోగా

పోగా ముసలి గుర్రం కనిపించింది. "గుర్రం! గుర్రం పెద్ద తోలు సంచి మోసుకుపోతూన్న ముచ్చు పిల్ల ఎవరైనా ఈ దారిన పోయిందా?" అని అడిగింది. "ఔనవ్వా! వెళ్ళింది. ఇప్పుడే వెళ్ళింది. త్వరగా వెళ్ళు దొరుకుతుంది," అని చెప్పిందా ముసలి గుర్రం.

"అయ్యో! నా దేముడో! ఆరి నా దేముడో! నా ధనపు సంచిని కాస్తా దాటేసుకు పోయిందో నా తండ్రో!" అంటూ శోకాలు పెడుతూ చకచకా సాగిపోయింది పీనాసి ముసలిది. పోగా పోగా పోగా పళ్ల బరువుతో కుంగిపోతున్న జామిచెట్టు కనిపించింది. జామి చెట్టూ! జామిచెట్టూ! పెద్ద తోలు సంచీ మోసుక పోతూన్న ముచ్చు పిల్ల ఎవరైనా ఈదారిని పోయిందా? "అని అడిగింది. "వెళ్ళిందవ్వా! వెళ్లింది! ఇప్పుడే వెళ్ళింది. త్వరగా వెళ్లు దొరుకుతుంది," అని చెప్పింది జామి చెట్టు.

"అయ్యో! నా దేముడో! ఆరి నా దేముడో! నా ధనపు సంచిని కాస్తా దాటేసుకు పోయిందో నా తండ్రో!" అంటూ శోకాలు పెడుతూ, ఒగరుస్తూ రొప్పుతూ సాగిపోయింది పిసినారి ముసలిది. పోగా పోగా పోగా సముద్రపొడ్డుకి వెళ్ళేసరికి నౌకరు పిల్ల దొరకనే దొరికింది. దానిని పట్టుకుని చావ చితక తన్ని, సముద్రంలోకి నెట్టేసి, తన ధనపు సంచిని బుజాన పెట్టుకుని సంతోషంగా ఇంటికి మళ్లింది పిసినిగొట్టు ముసలిది.

తరవాత కొంతకాలం పీనాసి ముసలమ్మ నౌకరు పిల్ల లేకుండానే ఎలాగో తంటాలు పడుతూ, ఇంటి పన్లన్నీ తనే చేసుకునేది.

కాని క్రమంగా శక్తి ఉడిగి పోతుండడం వల్ల ఇక ఆ అవస్థ పడ లేక, ఒక రోజున కొడుకుని పిలిచి," నాయనా! నాయనా! పెద్ద ముండనని. పని చేసుకో లేకుండా ఉన్నాను! ఎక్కడికైనా దూరదేశం పోయి,టక్కరితనాలు తెలియని మంచి నౌకరు పిల్ల నెవతెనైనా తెచ్చి పెట్టరా!" అంది.

ఇంకో నౌకరుపిల్ల వచ్చింది. పిసినారి ముసలి అవ్వకి ఈ పిల్ల నచ్చింది. కొన్నాళ్ళు గడచిపోయినయి. ఒక రోజున ముసలిది, "ఇదుగో పిల్లోవ్! నేను పెత్తనాలకి పోతున్నా గాని, నువ్వు ఆ అటక మీదికి మాత్రం ఎక్కి చూడబోకు సుమా!" అని చెప్పి వెళ్ళింది. ఇంకేం అవ్వ చూపుమేరదూరం దాటి పోగానే, అటక మీ దేముందో చూడాలని ఆ పిల్లకి సరదా పుట్టింది. మూల నున్న కొంకె కర్ర తీసుకుని పైకెక్కి, దాని కొక్కెన్ని ఆ తోలుసంచి వేలాడుతూన్న త్రాటికి పట్టించి లాగింది. ఆ తాడు తెగి సంచి దభాల్న క్రింద పడింది. తీసి విప్పి చూసేసరికి దాని నిండా బంగారం, వెండి కనిపించింది. వెంటనే సంచి మూతి బిగించేసి, బుజాన పెట్టుకుని దారిని పడింది. దార్లో ముసలి ఆవు ఎదురయి, "పడుచు పిల్లా! పడుచు పిల్లా నా పొదుగు నలుపు పెడుతూంది. కాస్త పాలు పిదికి పోదూ!" అని అడిగింది."నా కెక్కడ వీలమ్మో! నేను సముద్రం దాటి చాలా దూరం పోవాలి," అంటూ చకచకా వెళ్ళిపోయింది, ఆ పిల్ల, కొంత దూరం పోయేసరికి, ముసలి గుర్రం ఎదురయి,"పడుచు పిల్లా! పడుచు పిల్లా! నా వీపు మీది పుండు కాస్త కడిగి పోతావా?" అని అడిగింది.

"నా కెక్కడ వీలమ్మో! నేను సముద్రం దాటి చాలా దూరం పోవాలి." అంటూ చరచరా వెళ్ళి పోయింది ఆ పిల్ల. ఇంకా కొంత దూరం వెళ్ళేసరికి జామి చెట్టు కనిపించి, "పడుచు పిల్లా! పడుచు పిల్లా! నా పళ్ళు కాసిని కోసుకుని నా భారం కాస్త తగ్గిద్దూ!" అని అడిగింది. "నా కెక్కడ వీలమ్మో! నేను సముద్రం దాటి చాలా దూరం పోవాలి," అంటూ వేగంగా సాగి పోయింది ఆ పిల్ల.

ఇంతలోపల పిసినిగొట్టు ముసలిది ఇంటికి తిరిగి వచ్చి అటక మీద చూసుకుని "అయ్యో! దేముడో! నా ముల్లెకి ముప్పు వచ్చిందిరో నాయనో! అంటూ గుండెలు బాదుకుంటూ మళ్ళీ దారిని పడింది. అలా పోయి పోయి ముసలి ఆవు దగ్గిరికి వెళ్ళి, "నా ముల్లె పట్టుకు పోతూన్న ముచ్చు పిల్ల ఈ దారిని వెళ్ళిందా?" అని అడిగింది. "ఇప్పుడే వెళ్ళిం దవ్వా! త్వరగా వెళ్ళు దొరుకుతుంది," అంది ఆవు. అయ్యో దేముడో నా ముల్లెకి ముప్పు వచ్చిందిరో నాయనో! అని గోలపెడుతూ సరాసరి ముసలి గుర్రం దగ్గిరికి వెళ్ళి, "నా ముల్లె నెత్తుకు పోతూన్న ముచ్చు పిల్ల ఈ దారిని వెళ్ళిందా?" అని అడిగింది. "ఆహా! ఇప్పు డిప్పుడే వెళ్ళిం దవ్వా! వేగిరం వెళ్ళు, దొరుకు తుంది," అంది గుర్రం. "అయ్యో దేముడో! "నా ముల్లెకి ముప్పు వచ్చిందిరో నాయనో!" అని గోలపెడుతూ సరాసరి జామి చెట్టు దగ్గిరికి వెళ్ళి, "నా ముల్లె నెత్తుకు పోతూన్న ముచ్చు పిల్ల ఈ దారిన పోయిందా?" అని అడిగింది. "ఔను వెళ్ళింది! ఇంతకు ముందే వెళ్ళింది. వేగిరం వెళ్తే సముద్రపొడ్డుకి వెళ్ళే లోగానే నీకు దొరుకు

తుంది," అంది జామిచెట్టు. పిసినిగొట్టు ముసలిది చకచకా వెళ్లి సముద్రపొడ్డున ఆ దొంగపిల్లని పట్టుకుని చావదన్ని సముద్రంలోకి నెట్టేసి, తన ధనపు సంచీ భుజానేసుకుని, "ఇక ఇలాంటి దొంగ పిల్ల నెన్నడూ పనికి పెట్టుకోను; బుద్ధొచ్చింది. ఏ తవిటి రొట్టెలో ఎలాగో తంటాలు పడి నేనే చేసుకు తింటూ కాలక్షేపం చేస్తాను," అనుకుంటూ ఇంటికి చేరింది.

అలాగే, కొంత కాలం గడిచింది. ముసలిదాని కొడుకు ఏదో పనిమీద దూర దేశానికి వెళ్లి "మా అమ్మ బాగా పెద్దదై పోయింది. ఒంట్లో శక్తి తగ్గిపోయి, వంట చేసుకోలేక అవస్థ పడుతూంది. ఈ దేశపు నౌకరు పిల్లలు అమాయకులూ, మంచి వాళ్ళూ లాగున్నారు. పోనీ ఒక మంచి పిల్లను తీసుకు వెళదాం" అనుకొని, తెలివైన పిల్ల నొకదాన్ని పిలుచుకు వచ్చాడు. ముసలి దానికి ఈ పిల్ల మీద మంచి గురి కుదిరింది. గాని, ఏమో దీని కెప్పుడేం బుద్ధి పుడుతుందో అనే అనుమానంతో, గడప దాటి పోకుండా, ఇల్లు కనిపెట్టుకునే ఉంటూంది. కొన్నాళ్లు ఇలా గడిచేసరికి, ఒక్క మాటు ఎక్కడైనా కాస్త పెత్తనానికి పోయొస్తే బాగుండును అని బయలు దేరింది. పోతూ పోతూ, "ఇదుగో చూడు పిల్లోవ్; నువ్వు చాలా మంచి దానివి గాని, ఒక్కమాట మాత్రం గుర్తుంచుకో! ఎన్నడూ ఆ అటక మీదికి మాత్రం ఎక్కి చూడకేం!" అని హెచ్చరించి వెళ్లింది. ఆ ముసలిది అల్లా వెళ్లగానే, ఆ అటక మీద ఏం చిత్రం ఉందో అనే ఆసక్తితో ఆ పిల్ల మూలనున్న కొంకి కర్ర తీసుకుని, నిచ్చెనవేసు

కుని, అటకెక్కి- కొంకె కర్ర నాలుగు మూలలా తిప్పే సరికి, ధనపు సంచి తాడు తెగి ఘల్లున క్రింద పడింది. విప్పి చూస్తే, దాన్నిండా వెండీ, బంగారం! సంచిని మళ్లీ బిగించి కట్టి బుజాన వేసుకుని దారిని పడింది. వెళ్లగా వెళ్లగా ముసలి ఆవు కనిపించి, "షడుచు పిల్లా! గడుసు పిల్లా! పాల బరువుతో నా పొదుగు పోటు పుడుతూంది. కాస్త పాలు పిదికి పోతావా?" అని అడిగింది. వెంటనే ఆ పిల్ల "పాపం నీ కెంత బాధగా ఉందో ఆవమ్మా! పోనీ అల్లాగే పితికి పోతాలే!" అని పాలు పిదికి, ఆ ముసలి ఆవు ఒళ్ళంతా బాగా రుద్ది కడిగింది. అక్కణ్ణించి ఇంకా కొంత దూరం పోయే సరికి ముసలి గుర్రం ఎదురయి,"షడుచు పిల్లా! గడుసుపిల్లా! నా వీపు మీది పుండు బాధ పెడుతూంది. కాస్త నీళ్ళు తెచ్చి కడిగి, పసరు వేసి పోతావా?" అని దీనంగా అడిగింది. "పాపం, నీ కెంత బాధగా ఉందో! అల్లాగే లే గుర్రమన్నా!" అని, ఆ పిల్ల ఆ గుర్రం వీపు మీది పుండంతా చక్కగా కడిగి, పక్కనున్న మందాకు పసరు తెచ్చి పిండి, మళ్లీ బయలుదేరింది. మళ్లీ కొంత దూరం వెళ్లే సరికి, పెద్ద కాయలతో, పళ్లతో క్రుంగి పోతున్న జామి చెట్టు, "షడుచు పిల్లా, గడుసు పిల్లా! ఈ పళ్ల బరువుతో నా కొమ్మలన్నీ ఫెళ ఫెళ మని విరిగి కూలేటట్టున్నయి. కొన్ని పళ్లు కోసుకుని కాస్త నా బరువు తగ్గిద్దూ!" అని జాలిగా అడిగింది. "పాపం, నీ కెంత బరువుగా, బాధగా ఉందో! పోనీ, అల్లాగే కోసి పెడతాలే జామి చెట్టూ!" అని అంది నంత వరకూ పళ్లూ, దోరకాయలు కోసేసింది. జామి చెట్టు ఎంతో

సంతోషించి, "పడుచు పిల్లా! గడుసు పిల్లా! మంచి దానివి పసిడి పిల్లా! ఎక్కు నా కొమ్మల్లోకి. ఎక్కి దాక్కో! ఇంకొక్క నిముషంలో ఆ ముసలిది ఇక్కడికి వచ్చేస్తుంది!" అంది.

పిసినిగొట్టు పెద్దమ్మ ఇంటి కొచ్చి, అటక మీద చూసుకుంటే సంచి కనిపించక "అయ్యో నా దేముడో! ఆరి నా దేముడో! నా ముల్లెకై మళ్ళీ కాళ్లొచ్చి గడపదాటి పోయిందో!" అని దీర్ఘాలు తీసుకుంటూ దారిన పడ్డింది. పోగా పోగా ముసలి ఆవు కనిపించే సరికి, "ముసలి ఆవా! నా వెండి బంగారాల తోలు సంచీ దాచేసుకు పోతూన్న దొంగ పిల్ల ఎవరైనా కనిపించిందా నీకు?" అని అడిగింది. కనిపించిందవ్వా! కాని, అబ్బో! ఆ చక్కని పిల్ల వెళ్లి అప్పుడే చాలా సేపయిందే! నీ కెక్కడ దొరుకుతుంది? అంది ముసలి ఆవు.

"అయ్యో దేముడో! ఆరి దేముడో! నా ముల్లెకి మళ్లీ కాళ్లొచ్చి గడపదాటి పోయిందో!" అని దీర్ఘాలు తీస్తూ ముసలిది పరిగెత్తగా ముసలి గుర్రంకనిపించింది. "ముసలి గుర్రమా! ముసలి గుర్రమా నా వెండి బంగారాల నిండు సంచీ దాచేసుకు పోతూన్న దొంగ పిల్ల ఎవరైనా కనిపించిందా నీకు?" అని అడిగింది. "ఆఁ ఆఁ! కనిపించిందవ్వా! కాని, అబ్బో ఆ అందమైన అమ్మాయి వెళ్లి చాల సేపయిందే! నీ కెక్కడ దొరుకుతుంది!" అంది ముసలి గుర్రం.

"అయ్యో దేముడో ఆరి దేముడో!" అని దీర్ఘాలు తీస్తూ ముసలిది మళ్లీ దారిని పడి పరిగెత్తగా, పరిగెత్తగా జామి చెట్టు కనిపించింది. "జామి చెట్టూ! జామి చెట్టూ నా వెండి బంగారాల

నిండు సంచీ దాచేసుకు పోతూన్న దొంగ పిల్లి ఎక్కడైనా కనిపించిందా నీకు?" అని అడిగింది. ఆఁ ఆఁ! కనిపించిం దమ్మా! కాని, అబ్బో ఆ చలాకీ పిల్లి సముద్రం దాటి పోయి చాలా సేపయిందే! ఇంక నీ కెక్కడ దొరుకుతుంది లే!" అంది

దాంతో పీనాసి పెద్దమ్మ నెత్తిన పిడుగు పడ్డట్టయింది. అయ్యో! నా దేముడో! "అరె నా దేముడో! నా కొంప కూలిపోయింద్రో! నా తండ్రో! నా బ్రతుకు బండలయి పోయింద్రో నా దేవుడో!" అంటూ ముసలిది అక్కడే చతికిలబడి, పెద్ద పెట్టున శోకాలు మొదలు పెట్టింది.

ఏడ్చి ఏం లాభమంటే అవ్వా! ఇంటికి పోయి, ఎప్పటిలాగే తవిటి రొట్టె తిని, తమ్మిరేటి నీళ్లు తాగుతూ కాలం వెళ్లబుచ్చుకో!" అని సలహా చెప్పింది తాటి చెట్టు.

పీనాసి పెద్దమ్మకి తగిన శాస్తి అయినందుకు అంతా సంతోషించారు.





# ఆంభోతు రాక్షసుడు



లూయిజియానా జానపద కథ



జీన్ మాలిన్‌కి పాపం పసితనంలోనే తల్లీ తండ్రీ కరువై పోయారు. వేరే దిక్కు లేక, ఎక్కడికి వెళ్ళడానికీ, ఏమి చెయ్యడానికీ తోచక, ఒక రోజున రోడ్డు ప్రక్కన నిలబడి ఏడుస్తూ ఉండగా ఒక భాగ్యవంతుల పడుచు పిల్ల అందమైన గుర్రపు బగ్గీలో ఆ దారిని పోతూంది. జీన్ మాలిన్ ఆమె దగ్గిరికి వెళ్ళి "నాకు తల్లీ, తండ్రీ ఎవరూ లేరు. నన్ను కూడా మీతో తీసుకెళతారాండి?" అని జాలిగా అడిగాడు. ఆ పసివాడి రూపు రేఖలు, తెలివి తేటలూ చూసి దయ తలచి, "నీకు ఎన్నేళ్లొచ్చాయీ?" అని అడిగింది. ఆ పిల్ల జీన్

మాలిన్‌కి ఏం చెప్పాలో తెలియలేదు. మంచు తుపాను వచ్చిన యేడాది, మామిళ్ళు పూత పట్టే రోజుల్లో పుట్టానని మా అమ్మ ఎప్పుడో చెప్పింది." అన్నాడు. ఆ ముద్దు మాటలకు ముచ్చట పడి ఆ గొప్పింటి కోమలి, "పోనీ నాకు చిన్న చిన్న పను లేవైనా చేసి పెడుతూ ఉంటాడు లే!" అనుకుని, ఆ కుర్రవాణ్ణి తన బండిలో ఎక్కించుకుని తీసుకు పోయింది. అచిర కాలంలోనే జీన్ మాలిన్‌కి, ఆమె మీద అమితమైన గౌరవాభిమానాలు ఏర్పడినయి. ఆమెనే తల్లి లాగ చూసుకుంటున్నాడు.

ఇలా ఉంటూండగా, ఆ భాగ్యవంతుల పడుచు పిల్లను పెళ్లాడాలనే ఉద్దేశంతో, సూటూ, బూటూ వేసుకున్న షోకిల్లా పురుషు డొకడు తరచుగా ఆమెకోసం వస్తూ ఉండటం జీన్ మాలిన్ చూశాడు. ఎందుచేతో ఆ పెద్ద మనిషంటే జీన్‌కి తగని కోపంగా ఉండేది.

నిజానికి ఆ పెద్ద మనిషి అసలు మనిషి కాడు; వృషభ రాక్షసుడు. జీన్ యజమానిరాలి కోసం వచ్చినప్పుడు మాత్రం వాడు అందమైన పడుచు కుర్రవాడి రూపంలో వస్తాడు. మిగిలి నప్పు డల్లా వాడు తన మామూలు ఆంబోతు రూపంలో, అచటికి సమీపంలో ఉన్న మైదానంలో గడ్డి మేస్తూ ఉంటాడు. ఆ పెద్ద మనిషి తన యజమానురాలి దగ్గర ఉన్నప్పుడు ఆ మైదానంలో ఆంబోతు కనిపించేది కాదు. మైదానంలో ఆంబోతు మేస్తున్నప్పుడు ఆ పెద్ద మనిషి తన యజమానురాలి మందిరంలో ఉండడు. కష్టపడి పరిశోధన

చేసి జీన్ ఇంత వరకూ కనిపెట్టాడు. "ఇదంతా ఏమిటో చిత్రంగా ఉంది! ఈ మాయ ఏమిటో బోధ పడడం లేదు. శ్రద్ధగా కనిపెట్టి ఉండి ఈ రహస్య మేమిటో తేల్చు కోవాలి" అనుకున్నాడు. జీన్. అప్పటినించీ ఆ మాయ పెద్దమనిషి కాంపేర్ టారోనీ, ఆ ఆంబోతునీ జాగ్రత్తగా, శ్రద్ధగా కనిపెట్టి చూస్తున్నాడు. అట్లా విసుగూ విరామం లేకుండా చాలా కాలం చూశాక, చలి కాలంలో ఒక రోజున చలిమంట చేసుకునేందుకు కట్టెల కోసం జీన్ పెరట్లోకి వెళ్ళాడు. సరిగ్గా అదే సమయానికి ఆ ఆంబోతు వచ్చి అక్కడ ఒక చెట్టు చాటున ముందరి కాళ్లు మడతలేసి వంగి, "బొహూహార్ - మజాం - మద మజాం - జాం - జాం - జారా - జారా" అంటూ ఏదో మంత్రం చదివినట్టు అరిచింది. వెంటనే ఆ ఆంబోతు రాక్షసుడు పురుషుడైన కాంపేర్ టారోగా మారి తన యజమాను రాలిని చూడడానికి చకచకా ఇంట్లోకి రావడం చూసేసరికి జీన్‌కి అపరిమితమైన భయం వేసి చలిజ్వరం వచ్చిన వాడిలాగ వణికిపోవడం మొదలు పెట్టాడు.

ఆ రావటం రావటం కాంపేర్ టారో చక్కగా పెళ్లికొడుకు లాగ కులుకుతూ వచ్చి జీన్ యజమానురాలితో ఉదయ ఫలాహారాలకు కూచున్నాడు. జీన్ మాలిసే వాళ్ళిద్దరికీ ఫలాహారాలు, కాఫీ అందించాలి. పాపం సీతాకోక చిలకలాగ అటు పరుగెత్తీ, ఇటు పరిగెత్తి కంగారు పడిపోయాడు జీన్. వాళ్లు పళ్లెం అడిగితే కత్తీ, కత్తి అడిగితే రొట్టె తీసికెళ్ళి ఇస్తున్నాడు, దాంతో, యజమానురాలు ఆ కాసేపటిలో వాణ్ణి ఎన్ని సార్లో మందలించింది. అక్కడితో

ఆగక, తన ప్రియుడు వెళ్లిపోయిన వెంటనే జీన్‌ని పిలిచి, "పిల్లడా నీకు ఇదే చెపుతున్నాను. నీవు ఇలాగే పని చేసేట్టయితే, నా యిం ట్లోంచి వెళ్ళగొట్టేస్తాను," అంది. వెంటనే మళ్ళీ పిలిచి, "అసలు ఇవాళ నీకు ఏమి వచ్చింది? అన్నీ అలా తగలేశావు:" అని అడిగింది.

మళ్ళీ వెంటనే తానే అందుకుని, "ఎందుకో నీకు నా ప్రియుడంటే బొత్తిగా ఇష్టం లేదు. ఆ సంగతి నేను ఇదివరకే కనిపెట్టాను. ఆయన నీకు ఏమి అపకారం చేశారు? ఎప్పుడూ నిన్ను ఎంతో ఇదిగా చూస్తున్నారే!" అంది.

" కా దమ్మగారూ! మీకు ఏమి చెప్పటానికీ నాకు భయంగా ఉంది. నాకు తెలిసిన సంగతే కనుక మీకు తెలిస్తే, మీరూ నాలాగే భయపడి పోయి, వాణ్ణి మళ్లీ ఈ గడప తొక్కనివ్వరు," అన్నాడు జీన్.

"ఏమిటా సంగతి? చెప్పేసెయ్! లేక పోతే నీ కీవేళ కొరడా దెబ్బల పెళ్లి జరుగుతూంది. తెలుసా?" అంది ఆమె.

జీన్ మాలిన్ వెక్కి వెక్కి ఏడుస్తూ ఇలా అన్నాడు. "అయితే చెప్పేస్తున్నాను, వినండి. మీరు ఇంతగా ప్రేమిస్తూన్న ఆ కాంపేల్ టారోగాడు మనిషి కాడు. అంబోతు రాక్షసుడు. ఇక్క డికి వచ్చేటప్పుడు మాత్రం అందమైన మనిషి రూపంలో, సూటూ, బూటూ వేసుకుని వస్తాడు. ఇక్కణ్ణించి వెళ్ళగానే మళ్ళీ అంబోతు అయిపోయి ఆ మైదానంతో గడ్డిమేస్తూ ఉంటాడు."

ఆమెకు అమితమైన కోపం వచ్చింది. వాణ్ణి చితగొట్ట బోయింది. కాని జీన్ జాలిగా ఇలాగా అన్నాడు : "అమ్మగారూ!, ఇంకొక్క మాట వినండి! మళ్ళీ వాడు ఈ తడవ ఇక్కడికి వచ్చి నప్పుడు నేను చెప్పేద దంతా నిజమని నేను ఋజువు చెయ్య లేక పోతే అప్పుడు నన్ను మీరు పంపించి వేయ్యండి. లేక పోతే, మీ యిష్టం వచ్చినట్టు చెయ్యండి."

"సరే,! కాని నువ్వు చెప్పే ప్రతి అబద్ధానికీ గట్టి శాస్తి జరుగుతుందని మాత్రం జ్ఞాపకం పెట్టుకో!.

ఆ తరవాత కొన్నాళ్ళకి మళ్ళీ తన ప్రియురాలిని కలుసుకొన డానికి కాంపేర్ టారో వచ్చాడు, ఈ సారి అతడు మరీ షోకైన దుస్తులతో, అందంగా అలంకరించుకుని మరీ వచ్చాడు. వాడు మళ్ళీ అంబోతుగా మారిపోవడానికి చదవవలసిన మంత్రాన్ని జీన్ బాగా జ్ఞాపకం పెట్టుకున్నాడు. "ఇవాళ వీడి భరతం పట్టిస్తాను," అను కున్నాడు.

ప్రేయసీ ప్రియు లిద్దరూ టేబులుకి ఇటూ, అటూ కూచుని సలాసాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేస్తూన్న సమయంలో యజమానురాలు మధ్య మధ్య జీన్ ఏం చేస్తున్నదీ కనిపెట్టి చూస్తూంది. ఆమె కాబోయే భర్త లేత బెండకాయల లాంటి ఆమె చేతి వేళ్ళని పట్టుకుని ముద్దు పెట్టుకో బోతూన్న సమయంలో ఆమె గ్లాసులో ద్రాక్ష సారాయి పోస్తూన్న జీన్, "బొహోర్ - మజాం - మద మజాం - జాం - జాం - జారా — జారా" అని అరిచాడు.

వెంటనే కాంపేర్ టారోకి ఆంబోతు రూపం వచ్చేసింది. హఠాత్తుగా



...వెంటనే కాంపేర్ టారోకి ఆంబోతు రూపం వచ్చేసింది.....

కొమ్ములు పొడుచుకు వచ్చేసరికి వాడి తల మీద ఉన్న టోపీ ఒక్కసారిగా ఎగిరి అంత దూరాన పడింది. వాడి చొక్కా, కోటూ ఫట్ మని విచ్చిపోయి పెంద పడ్డయి. అంత పెద్ద ధ్వని ఆ యింట్లో ఎవ్వరూ ఎన్నడూ వినలేదు. ఆ భోజనాల బల్లంతా తల్ల క్రిందు లయింది. దాని మీది ప్లేట్లూ గాజు గిన్నెలూ, గ్లాసులూ, సీసాలూ పగిలి ఎగిరి అంత దూతాన పడ్డయి, ఆ ఆంబోతు ఆ హాలు అద్దాల తలుపుల్ని కొమ్ముల్తో కుమ్మి పగలగొట్టి ఎలాగో ఆ భోజన శాల లోంచి తప్పించుకుని మైదానం వేపు పరిగెత్తింది."

"అమ్మగారూ! ఇప్పుడేమంటారు? ఇప్పటికైనా నా మాట నమ్ముతారా?" అన్నాడు జీన్.

"ఔను జీన్! నువ్వు నాకు ఎంతో ఉపకారం చేశావు. నిన్ను విడిచిపెట్టను. నా కొడుకు లాగ పెంచుకుంటాను." అన్నది ఆమె.

ఇక్కడితో కథ అయిపోయిం దనుకుంటున్నారా? లేదు తరువాత తన రహస్యం బయట పెట్టి తనకు అవమానం కలిగించిన జీన్ మాలిన్‌ని చంపుతానని ఆంబోతు రాక్షసుడు ప్రతిజ్ఞ చేశాడు, జీన్ ఆ ప్రతిజ్ఞను ఎల్లా ఎదురుకున్నదీ,... ఆ కథంతా ముందే ఉంది.

మొదట్లో పసివాడు జీన్ చాలా భయపడి పోయాడు. గుమ్మం దాటి బయటికి వెళ్ళవలసి వచ్చినప్పు డల్లా నాల్గు దిక్కులూ తేరిపార చూసి, చూపుమేర దూరంలో ఎక్కడా ఆ ఆంబోతు రాక్షసుడు లేడని నిశ్చయం చేసుకుంటే గాని ముందుకి అడుగు పెట్టేవాడు కాదు. ఈ బాధ తప్పించుకునేందుకు కాంపేర్ లాపిన్ (కుందే లన్న) దగ్గిరికి వెళ్ళి తన భయంకర పరిస్థితి అంతా చెప్పాడు. కుందేలన్న ఇలా అన్నాడు: "అయితే అబ్బాయీ! నేను చెప్పేదంతా శ్రద్ధగా విను. అడవిలోకి వెళ్ళి గుడ్లగూబల గూళ్ళకోసం వెతుకు. ఒక శుక్రవారం రోజు సాయంకాలం ఏదో ఒక గుడ్లగూబ గూట్లోంచి మూడు గుడ్లని తీసుకుని మళ్ళీ నా దగ్గిరికి రా! నేను వాటిని మంత్రించి ఇస్తాను. ఆ పైన ఆ కాంపేర్ టూరో గాణ్ణి నువ్వు ఏమి చెయ్యా లంటే అది చెయ్యొచ్చు.

జీన్ కష్టపడి పక్షిదారం నాటు గుడ్లగూబ గుడ్లు మూడూ సంపాదించి కుందేలన్న దగ్గిరికి తీసుకెళ్లాడు. తెల్ల మచ్చ లేని నల్ల మేక పాలతో ఆ గుడ్లమీద ఏవో మంత్రాక్షరాలు రాసి, వాటిని ఏమి చెయ్యావలసిందీ జీన్‌కి వివరంగా చెప్పాడు. జీన్ మార్టిన్ తన యజమానురాలి ఇంటికి తిరిగి వెళుతూ దారిలో ఆ ఆంబోతు ఎక్కడ వచ్చి పడుతుందో అని మాటి మాటికీ ఇటూ అటూ చూసుకుంటూ పారిపోయాడు. కుందేలన్న ఎంత ధైర్యం చెప్పినా, ఆంబోతు రాక్షసు డంటే జీన్‌కి భయంగానే ఉంది. కొంత దూరం వెళ్ళే సరికి ఆ ఆంబోతు భయంకరంగా రంకెలు వేసుకుంటూ తన వేపే వస్తూ ఉండడం జీన్ కనిపెట్టాడు.

"రారా! రా! పొడిచి పొడిచి చిత్రవధ చేసేస్తా రా!" అంటూ అరుస్తూ ఆ రాక్షసుడు పొడుతీస్తూ తన వంకకే వస్తూండడం చూసి, ఈ పరిస్థితిలో ఏం చెయ్యడానికీ తోచక పక్కనున్న చెట్టు ఎక్కేశాడు. ఉడతలాగ జీన్ నిముషంలో ఆ ఎత్తైన చెట్టు పైకి పాకుతూ ఉండగానే, ఆంబోతు రాక్షసుడు వచ్చి, ఆ చెట్టుకింద నిలబడి, "చివరి దాకి పోయావులే! దిగి రా!" అని రంకెలేస్తూ, కొమ్ములతో ఆ చెట్టు మ్రానుని గుద్దడం మొదలు పెట్టాడు. ఎత్తుగా చెట్టు మీద గట్టిగా పట్టుకుని కూచున్న జీన్ పక పకా నవ్వాడు.

దాంతో ఆంబోతు రాక్షసుడు రాంపేర్ ఠారోక్కి అమితమైన కోపం వచ్చింది. ముందరి కాళ్ల మీద మోకరిల్లి కూచుని, "హాహూర్ - మహా - మదమహాం - హాం - హాం - హాలా - హారా,"

అని అరిచాడు. వెంటనే ఆంబోతు రాక్షసుడు బుజాన పెద్ద గండ్ర గొడ్డలి గల వడ్రంగిగా మారిపోయాడు.

"దిగిరా! కుర్ర కుంకా! నే నీ చెట్టుని నరికివేస్తే ఎలాగూ వెలక్కాయ రాలినట్టు రాలి పోతావ్!" అన్నాడు.

జీన్ మళ్లీ బెరుకు బెరుకుగా నవ్వుతూ, ధైర్యం తెచ్చుకొని, "చెట్టు కొట్టెయ్యండి కాంపేర్ టారో గారూ! మీ రేంచెయ్యా దలచు కున్నారో అన్నీ చేసెయ్యండి! ఇక్కడ కూచుని సరదాగా చూస్తూ ఉంటాను," అన్నాడు.

రాక్షసుడు ఆ గొడ్డలితో ఫెళ్ల ఫెళ్ల మని చెట్టు కొట్టడం ప్రారంభించాడు. దెబ్బ దెబ్బకీ చెట్టంతా అదిరి పోతూంది. జీన్ మాలిన్ జేబులోని గుడ్ల గూబ గుడ్లలో ఒకటి తీసి విసిరి కాంపేర్ టారోగాడి కుడిభుజానికి వేసి కొట్టాడు. వెంటనే గొడ్డలితో సహా ఆ భుజం మొదట్లోకే తెగిపోయి అంతదూరాన పడింది. రాక్షసుడు పట్టరాని కోపంతో పోయి మిగిలిన ఎడం చేత్తో ఆ గొడ్డలి తీసుకొచ్చి మళ్లీ చెట్టు కొట్టడం మొదలు పెట్టాడు.

జీన్ మాలిన్ జేబులోంచి రెండో గుడ్డు తీసి, ఈ సారి వాడి ఎడమబుజంమీద విసిరికొట్టాడు. దాంతో ఆ చెయ్యి కూడా అలాగే తెగి దూరంగా పోయి పడింది.

కాంపేర్ టారో నిప్పులు క్రక్కుతూపోయి గొడ్డలిని పళ్లతో కరుచుకు వచ్చి, అలాగే మళ్లీ చెట్టు కొట్టడం మొదలు పెట్టాడు.

"ఇక దీంతో నీ పని ఫైసలా అయిపోతుందిలే పాపాత్ముడా!" అంటూ జీన్ మాలిన్ మూడో గుడ్డు తీసి వాడి తలమీద విసిరి కొట్టాడు. దాంతో వాడి తల ఊడి ఎగిరి అంత దూరాన పడింది. ఆ విధంగా తెగి పడిన వాడి చేతులూ, కాళ్లూ, తల, మొండెం అన్నీ నిప్పుల్లో పడ్డ పాములాగ మెలికలు తిరుగుతూ, పొల్లిగింతలు పెడుతూ, గిలగిల కొట్టుకుంటున్నయి. ఇదంతా చూసి, జీన్ మాలిన్‌కి జాలివేసి, "మళ్లీ మామూలుగా ఆంబోతువైపో!" అంటూ మళ్లా మంత్రం చదివాడు. వెంటనే ఆ రాక్షసుడి తల, చేతులూ, కాళ్ళూ ఎగిరి వచ్చి ఆ మొండానికి అతుక్కున్నయి. వెంటనే ఆ రాక్షసుడికి మళ్లీ ఆంబోతు ఆకారం వచ్చేసింది. వెంటనే వాడు "బ్రతుకు జీవుడా!" అంటూ కాలికి బుద్ధి చెప్పి, శరవేగంతో పారిపోయాడు. కుందేలన్న కాంపేర్ లాపిన్ మంత్రశక్తి ముందు మన మంత్రశక్తి ఎందుకూ పనికి రాలేదని కాంపేర్ టూరోకి అర్థమై పోయింది. అప్పటినుంచీ ఎన్నడూ మళ్ళీ, ఆంబోతు రాక్షసుడు జీన్ మాలిన్ జోలికి పోలేదు.





# మహా శిలా ముఖం

★

నెథేనియల్ హాథార్న్

★

సాయంకాలం అవుతూంది. సూర్యుడు మెలమెల్లగా క్రిందికి జారిపోతున్న సమయం. ఒక చిన్న బాలుడూ, అతని తల్లీ వీథి గుమ్మం ముందుఅరుగు మీద కూచుని పర్వతుని మహాశిలా ముఖాన్ని గురించి ఏదో చెప్పుకుంటున్నారు. వాళ్ల కనురెప్పలు కొంచెం పైకెత్తి చూస్తేచాలు ఎదురుగుండా కనిపిస్తూంది : గంభీర మైన మహా శిలా ముఖం. అక్కడికి అది కొన్ని మైళ్ళ దూరాన ఉన్నప్పటికీ, అస్తమయ సూర్యరశ్మి సోకడం వలన ఆ ముఖ కవళిక లన్నీ విస్పష్టంగా కనిపిస్తున్నయి.

ఆ పర్వతుని మహా శిలాముఖ మనేది అసలు ఏమిటి?

ఎత్తైన ఆ పర్వత శ్రేణుల మధ్య అది ఒక విశాలమైన లోయ. వేల కొలదీ ప్రజలా లోయలో బ్రతుకుతున్నారు. ఈ అమాయక ప్రజలలో కొందరు కలప దుంగలు పేర్చిన గోడలతో కట్టిన కుటీ

రాలలో జీవిస్తున్నారు. చుట్టూ నిటారుగా లేచిన కొండ చరియల నిండా పగలు కూడా చీకటి జీబురుమంటూ ఉండే చక్కని అడవులు ఉన్నాయి. మిగిలినవారు తమ తమ వ్యవసాయ క్షేత్రాలలో అన్ని హంగులతోను కట్టుకున్న ఇళ్లలో కాపురం ఉంటూ, ఆ లోయలోని చదునైన ప్రదేశాలలోను, కొంచెంగా వాలుగా ఉన్న కొండ చరియల మీద ఉన్న సారవంతమైన భూములలోను పుష్కలంగా పంటలు పండించుకుంటున్నారు. ఆ పర్వతాల మీంచి దిగి వచ్చే సెలయేరో, కొండవాగో ఉన్నచోట జన సమ్మర్దం గల పల్లెటూళ్ల వెలిసినయి. వీళ్ల తెలివిగా ఆ సెలయేళ్లను మచ్చిక చేసుకుని వాటి సహాయంతో బట్టల మిల్లులను కూడా నడుపుకుంటున్నారు. ఈ విధంగా ఆ లోయలో రకరకాల వృత్తులు చేసుకుంటూన్న ప్రజలు చాలా మంది వచ్చి చేరారు. అచటి ఆబాల గోపాలానికీ ఆ మహా శిలా ముఖం సుపరిచితమే! అందులో కొందరు ఆ మహా శిలా ముఖ మాహాత్మ్యాన్ని గురించి సంపూర్ణ విశ్వాసంతో రకరకాలుగా అభివర్ణించి చెప్పగలరు.

ఈ శిలాముఖం స్వయంగా ప్రకృతే దిద్ది తీర్చిన అద్భుత శిల్పం. నిటారుగా కత్తితో నరికినట్టు ఉన్న ఒక పెద్ద పర్వతం చివర ఈ మహా శిలాముఖం ఉంది. ఆ పర్వతాలలోని అనేక మహాశిలలు చిత్రంగా ఒక దాని కొకటి అతుక్కుని, ఆ పర్వతానికి అచ్చంగా మానవుని ముఖం లాగే కను ముక్కు తీరుతో పెద్ద ముఖ మొకటి ఏర్పడినట్టు కనిపిస్తుంది. లేక దేవతాశక్తి గల మహాశిల్పి యొవడో,

ఏనాడో ఇక్కడికి వచ్చి, తన ముఖానికి ప్రతిరూపంగా, ఈ మహా శిలా ముఖాన్ని సృష్టించి పోయి ఉండాలి. అర్ధ చంద్రాకారంలో ఉన్న ఆ నుదుటి ఎత్తే నూరడుగులకు పైగా ఉంటుంది. పొడుగైన ఆ ముక్కు ఏ నాడైనా విప్పడమే జరిగితే అ లోయను యావత్తూ ఈ మూలనించి ఆ మూలదాకా దద్దరిల్లి పోయేటట్టు చేయగల ఆ పెద్ద పెదవులూ ఆ దివ్య శిల్పి పని తనానికి బిరుదులు. అయితే, ఆ పర్వతానికి దగ్గరగా వెళితే మాత్రం ఆ ముఖ కవళికలన్నీ ఒకే సారి చూడడానికి సాధ్యం కాదు. అక్కడ కొన్ని మహా శిలలు చాలూ మూలా లేకుండా పేర్చి ఉన్నట్టు మాత్రమే కనిపించ, వచ్చు. తిరిగి వెనక్కి కొంతదూరం వెళ్ళి అక్కడి నించి చూస్తే మళ్ళీ మానవుని ముఖాకారం కనిపిస్తుంది. క్రమంగా ఇంకా దూరంగా వెళ్లిన కొద్దీ దివ్యత్వం ఉట్టిపడే ఆ శిలాముఖం కవళికలన్నీ విపులంగా పోల్చుకొనడానికి వీలవుతుంది. ఇంకా కొంచెం దూరంనించి చూస్తే, పొగ మంచులో కప్పబడి ఉన్నట్టు కనిపించే ఆ పర్వత పంక్తులకు మధ్యగా అది సజీవ ముఖంగానే కనిపిస్తుంది.

ఆ మహా శిలాముఖాన్ని చూస్తూ, క్రమంగా పెరిగి పెద్దవాళ్లవుతున్న పిల్లలు నిజంగా అదృష్ట వంతులు; ఆ దివ్యముఖంలోని ఉదాత్త గంభీరత, మాధుర్యం, విశాలమైన ఆర్ద్రమైన హృదయాన్ని వ్యక్తీకరించే ఆ దివ్యత్వం అలాంటివి. మానవ లోకానికి మాననీయమైన సర్వ సుగుణాలవాలంగా కనిపిస్తుంది, ఆ దివ్య వదనం. ఆ మహాశిలాముఖ సందర్శనమే, అనుభవం.విజ్ఞానంప్రదమైన

ఆ వ్యముఖ కరుణా కటాక్షాల ప్రాభవమే ఆ లోయ అంత సారవంతంగా, సస్య శ్యామలంగా శోభిల్లడానికి హేతువనీ, ఆ ఆర్ద్ర కటాక్షమే అచటి మేఘాలపైనా, సూర్యరశ్మి పైనా చల్లగా ప్రసరించి, వాటిని అచటి ప్రజలకు సుముఖం చేస్తూందనీ చాలామంది విశ్వాసం.

ఈ శిలాముఖాన్ని గురించే తమ వీధి గుమ్మంలో కూచుని మాట్లాడుకుంటున్నారు. ఆ తల్లీ, బిడ్డా-మధ్య మధ్య తల యెత్తి ఆ దివ్య శిలాముఖం వంక చూస్తున్నారు. ఆ బాలుడి పేరు సుకృతి.

చిరునవ్వు వెలుగులు కురిపిస్తూ తన వంకచూస్తూన్న ఆ మహా శిలాముఖాన్ని చూసి, అమ్మా! ఆ పర్వతముఖం మాట్లాడితే వినాలని ఉందే నాకు! అంత చక్కగా చల్లగా ప్రేమతో చూసే ఆ పర్వతుడు మాట్లాడితే - అబ్బ! ఎంత బాగుంటుందో! అచ్చంగా అలాంటి ముఖం గల వాడు నాకు కనిపిస్తే, నే నెప్పుడూ అతని జతే ఉంటానమ్మా!" అన్నాడు.

"పూర్వులు చెప్పిన జోస్యమే నిజమయితే, అలాంటి ముఖం గల మనిషిని ఎప్పుడో ఒకప్పుడు మనం చూస్తాం" అని జవాబు చెప్పింది తల్లి, ఎక్కడో భవిష్యత్తులోకి చూస్తూన్నట్టు మెరిసే కళ్ళతో.

"ఏమిటమ్మా! ఆ పూర్వులు చెప్పిన జోస్యం? నాకు చెప్పవూ?" అన్నాడు బాలుడు.

ఆ ప్రశ్నకు జవాబుగా తల్లి తన చిన్నతనంలో తన తల్లి తనకు చెప్పిన ఒక కథ చెప్పడం ప్రారంభించింది. ఆ కథ

జరిగిపోయిన విషయాలను తెలిపే కథల లాంటిది కాదు. జరగ బోయే విషయం తెలుపుతుంది. ఆ లోయలో పూర్వ మెప్పుడో నివసిస్తూండిన ఎఱ్ఱ ఇండియన్ల పిల్లలు కూడా ఈ కథను వాళ్ళ పెద్దవాళ్లు చెపుతూండగా ఇలాగే వినే వాళ్లట. అంతటి ప్రాచీన మైన కథ అది. మొదట ఈ కథను వాళ్ల పూర్వుల పూర్వులకు, ఆ పర్వతాలమీదుగా త్రుళ్ళింతలు పెడుతూ వచ్చే వాగులూ, అడవు లలో ఈలపాటలు పాడే గాలి దేముడూ చెప్పారంటారు. మొత్తం మీద, ఆ కథ సారాంశం ఇది: భవిష్యత్తులో ఎప్పుడో ఆ పరి సరాల్లోనే ఒక గొప్ప బిడ్డ పుడతాడు. అతడు తన కాలపు మానవు లందరిలో మహాపురుష డవుతాడు. ఆ మహాపురుషుని ముఖం అన్ని విధాలా ఈ మహా శిలా ముఖాన్ని పోలి ఉంటుంది.

పాత కాలపు మనుష్యుల్లోనే కాదు; ఆధునిక యువకుల్లో కూడా చాలామంది ఈ సనాతన జోస్యం పట్ల అచంచలమైన విశ్వాసంతో ఆ మహాపురుషుని పుట్టుక కోసం ఆసక్తితో ఎదురు చూస్తున్నారు. విశేష ప్రపంచానుభవం గల మరి కొందరు అలాంటి మహాపురుషుడు పుడతాడని ఎదురు చూసి చూసి వేసారినా, వారి కలాంటి ముఖం గల మనిషి గాని, పోనీ తమ చుట్టుపట్ల ప్రజలందరి కన్న మహాత్ముడూ, ఉదారుడూ అయిన వ్యక్తిగాని ఎక్కడా కనిపించ లేదు. దాంతో, అదంతా పట్టి కట్టు కథ అనే వారు కూడా కొంత మంది తయారయారు. ఏమైనా, ఆ పురాతన జోస్యంలో చెప్పిన మహా పురుషుడు మాత్రం ఇంకా అవతరించలేదు.

సుకృతి ఒక్కసారిగా, చిన్న చేతులతో చప్పట్లు కొడుతూ "అమ్మా! ఏమైనా సరే! ఆయన్ని చూసే దాకా నేను బ్రతికి ఉండాలే!" అన్నాడు.

ఆ బిడ్డమీదే ప్రాణాలు పెట్టుకుని బ్రతుకుతున్న అ తల్లి ఆ పసిబిడ్డను తాను నిరుత్సాహ పరచరాదు అనుకుంది. "బహుశః ఆ అదృష్టం నీకు తప్పకుండా పడుతుందిలే నాయనా!" అంటూ అమృత ప్రేమతో ఆశీర్వదించింది.

తల్లి చెప్పిన కథను సుకృతి ఎన్నడూ మరిచిపోలేదు. నిరంతరం, మహాశిలా ముఖాన్ని చూసినప్పుడల్లా, ఆ కథంతా అతని మనస్సులో మళ్లీ ఒక ఆవృత్తి తిరుగుతూంది. అతని బాల్యమంతా ఆ కట్టెల గుడిసెలోనే గడిచింది. తల్లి యెడల అతనికి అమితమైన గౌరవం, భక్తి. ఆమె పని చేసుకునేటప్పుడు ఆ చిట్టి చేతులతోనే, ప్రేమమధురమైన ఆ మృదు హృదయంతోనే అనేక విధాల సాయపడే వాడు. ఈ విధంగా, దీర్ఘాలోచనతో బాల్యం గడిచిపోయింది. క్రమంగా ఎదిగి, అల్లరి చిల్లరి పనులు గాని, ఆటగోడి తనం గాని యెరుగని బుద్ధిమంతుడైన, కుదురైన కుర్రవాడు అయాడు. పొలాల్లో, ఎర్రని యెండల్లో పనిచేయడం వల్ల అతని శరీరచ్ఛాయ కొంచెం ఎర్రగోధుమ రంగుకి మారింది. అయినా, గొప్ప గొప్ప స్కూళ్ళకు పోయి చదువుకుంటూన్న ఇరుగు పొరుగు పిల్లల కన్న ఎక్కువ తెలివితేటలు గలవాడని కొందరు అనుకునే వాళ్లు. పాపం! సుకృతికి చదువు చెప్పే పంతులు లేడు, చదువు లేదు.



"అమ్మా! ఏమైనా సరే ఆయన్ని చూసేదాకా నేను బ్రతికి ఉండాలే!" అన్నాడు సుకృతి.

(చూడు: పుట. 104)

ఎదురుగా కనిపించే ఆ మహా శిలాముఖమే అతని గురువు. రోజూ తానుచేయవలసిన పని పాట్లన్నీ పూర్తి అయిన తరువాత వచ్చి ఆ మహాశిలాముఖం వంకే చూస్తూ, ఒక్కొక్కప్పుడు గంటల తరబడి అలాగే కూచుని పోయేవాడు. ఆ మహా ముఖుని యెడల తనకు గల భక్తి ప్రపత్తులను గ్రహించినట్టు ఆ శిలాముఖంలో దయామయమైన, ప్రోత్సాహకరమైన దివ్య మందహాస మేదో కని పించే వరకూ అలాగే ఉండిపోయేవాడు. నిజానికి ఆ మహాశిలా ముఖం ప్రపంచంలో మిగిలిన అందరికన్న సుకృతికి అధికంగా ప్రసాదిస్తూన్న దేమీ లేకపోయినా ఆ కుర్రవాడు చేస్తూన్న పని అను చితమైన దని తొందరపడి అనడం న్యాయం కాదు. అసలు రహస్య మేమిటంటే, ఆ బాలుడు తన లాలిత్యానికీ, నిరాడంబరతకూ ఫలి తంగా ఇతరు లెవరూ చూడలేని వింతలు చూడగలుగుతున్నాడు. ఆ విధంగా అందరికీ సమంగా లభించవలసిన మహా శిలా ముఖుని కరుణ అతనికి అధికంగా లభిస్తూంది.

ఇలా ఉండగా, ఆ లోయలోని వారంతా తరతరాలుగా చెప్పు కుంటూన్న, ఆ మహా శిలాముఖాన్ని పోలిన ముఖ కవళికలు గల మహాపురుషుడు చివరికి ఎక్కడో కనిపించాడనే పుకారొకటి బయలు దేరి, ఆ లోయ అంతటా ప్రాకిపోయింది. ఆ వదంతి ఏమంటే: చాలాకాలం క్రిందట ఈ లోయలో జన్మించిన ఒక కుర్రవాడు ఇక్కడినించి వెళ్ళిపోయి ఎక్కడో దూరంగా ఉన్న ఒక రేవు పట్ట

ణంలో పెరిగి పెద్దవాడై కొంత ధనం సంపాదించుకుని ఒక దుకాణం పెట్టాడట. అతని పేరు బంగారు తండ్రిట. అది అతని అసలు పేరో, అతని ప్రవర్తనకూ జీవితంలో గడించిన విజయ పరం పరకూ చిహ్నంగా ఏర్పడిన ముద్దు పేరో మాత్రం తెలియదు. మంచి చురుకుతనం, ఊహా పోహలు గల వాడవటం వల్లను, ప్రపం చంలో అదృష్టం అని చెప్పుకునే శక్తి దైవ దత్తంగా అలవడినవాడు అవటం వల్లను బంగారు తండ్రి క్రమంగా మహా సంపన్నుడైన వ్యాపారస్థుడూ, బ్రహ్మాండమైన వాణిజ్య నౌకాదళానికి యజమానీ అయాడు. పర్వతాలలాగ పెరిగిపోతూన్న ఈ మహా సంపన్నుని ఐశ్వర్యాన్ని ఇంకా వృద్ధి చేయడమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్నా యేమో అన్నట్టు ప్రపంచంలోని దేశాలన్నీ అతని ఐశ్వర్యాభివృద్ధికే దోహదం చేస్తున్నాయి. ఉత్తరాదిన ఉత్తర ధ్రువం చుట్టూ ఉన్న ముసిముసిచీకటి దేశాలు విలువైన ఉన్ని రూపంలో అతనికి కప్పం చెల్లించుకుంటున్నాయి. అత్యుష్ణ మండలంలోని ఆఫ్రికా ఖండ దేశాలు తమ నదీ గర్భాలంలోని బంగారు ఇసుకను, అచటి కీకారణ్యాల లోని మహా గజాల దంతాలనూ పుష్కలంగా పంపుతున్నాయి. ప్రాచ్య దేశాలు అద్భుతమైన శాలువలు, సుగంధ ద్రవ్యాలు, టీ, ధగ ధగలాడే వజ్రాలు, తళతళ మెరిసే ముత్యాలూ పంపుతున్నాయి. ఈ భూ భాగ దేశాలతో పోటీలో తీసిపోరాదనే పట్టుదలతో సముద్రుడు పెద్ద పెద్ద తిమింగిలాలను సరఫరా చేస్తున్నాడు. బంగారు తండ్రి వాటి నూనెను తీయించి అమ్మించి పెద్ద లాభాలు పొందుతున్నాడు. ఏ

దిక్కునించి ఏ సరుకు వచ్చినా బంగారుతండ్రి చెయ్యి పడేసరికి సర్వం బంగారం అయి పోతూంది. "స్పర్శవేది మిడాస్" కథలో లాగ అతడు ముట్టిన వస్తువల్లా తళతళలాడే పచ్చని పదహారు వన్నెల పసిడిగానో, అంత కంటె కూడా ఉపయోగకరమైన మరో సొమ్ముగానో మారిపోతూంది. చివరికి బంగారు తండ్రి ఐశ్వ ర్యాని కంతటికీ ఖరీదు కట్టి లెక్క తేల్చాలంటే కనీసం పంద సంవత్స రాలు పట్టే స్థితి వచ్చింది. అప్పు డతనికి తన జన్మస్థానమైన చల్లని లోయ జ్ఞాపకం వచ్చింది. తన చివరి రోజులన్నీ తన జన్మ స్థానంలో ప్రశాంతంగా గడపాలనుకున్నాడు. అందుకోసం ఆ లోయలో తనంతటి మహా సంపన్నుడు ఉండడానికి తగిన అద్భుత మైన మహా సౌధం నిర్మించడానికి ఒక గొప్ప శిల్పిని ముందుగా అక్కడికి పంపాడు.

ఇంతకు ముందు చెప్పినట్టు బంగారు తండ్రే తరతరాలుగా ఆ లోయలోని వారంతా ఎదురుచూస్తూన్న మహాపురుషుడనీ, చిట్ట చివరికి ఆ ప్రాచీన జోస్యం నిజమయినదనీ ఆ లోయలోని వారంతా చెప్పకుంటున్నారు. అతని ముఖం ముమ్మూర్తులా ఆ మహా శిలా ముఖాన్ని పోలి ఉందన్నారు. బంగారుతండ్రి చిన్నతనంలో బీడు పెట్టి పోయిన పూర్వార్జిత భూమిలో ఇప్పు డొక దేవేంద్ర భవనం లేవడమే అతని దివ్యత్వానికి దివిటీ అన్నారు. ఇంతకన్న ఇంకేం కావాలి నిదర్శనం! - అన్నారు. ఆ భవన నిర్మాణం కన్న ఇంద్రజాల మహేంద్రజాలం ఇంకేముంది!- అన్నారు. పూర్వం బంగారు తండ్రి

తలి దండ్రులు చింకి తడికల జీర్ణ కుటీరంలో కాపురం చేస్తూ వచ్చిన చోట, చూస్తూ చూస్తూ ఉండగానే భూలోకంలో ఎక్కడా లేని పుణ్య భవంతి లేచింది. ఆ మహాసౌధానికి బయటి ఆవరణ మంతా పాలరాతితో నిర్మించబడింది. బంగారు తండ్రి చిన్నతనంలో, పట్టినదంతా బంగార మయే యోగం అతని హస్తాలకు సిద్ధించక పూర్వం, ఇరుగు పొరుగు బొట్టెకాయలతో కలిసి శీతకాలం వీథుల్లో పడిన మంచుతో కట్టిన బొమ్మరిళ్లలాగ, సూర్యరశ్మి సోకితే కరిగి పోయేటట్టు ఉంది ఆ పాల రాయి. భవనం ముందు బాగా ఎత్తైన చక్కని నగిషీ పని చేసిన స్తంభాలు గల పోర్టికో ఉంది. దాని క్రింద ఎత్తుగా వెండి బొడిపెలు గల పెద్ద ద్వారబంధం ఉంది. దాని తలుపులు ఎక్కడో సముద్రాల కవతల ఉన్న దూరదేశాలనించి తెచ్చిన రకరకాల కలపతో, వింత వింత చెక్కడపు పనులతో, కన్ను చెదిరేటట్టు ఉన్నాయి. భవనం క్రిందినించి పైవరకూ ప్రతి గదిలో ఉన్న పెద్ద పెద్ద కిటికీ లన్నిటికీ ఏక ఫలకంతో చేసిన గాజు తలుపులు అమర్చారు. ఆ గాజు పలకలు ఎంత స్వచ్ఛంగా ఉన్నాయో చెప్పలేం! ఊరికే చూసే కంటె ఆ గాజు పలకలలోంచి చూస్తే బయటి ప్రకృతి అంతా ఎంతో సుందరంగా కనిపిస్తుం దంటారు. ఇంక ఆ భవంతి లోపలికి వెళ్లి అచటి వింతలన్నీ చూసే అదృష్టం నూటికీ కోటికీ ఎవరికో! బయటి కంటె లోపల మరీ బాగుంటుందని ప్రతీతి. ఇతర గృహాలలో అయితే, ఇనుము, ఇత్తడి ఉండే స్థానంలో ఈ మహా భవనంలో అంతటా వెండీ బంగారాలున్నాయి అంటారు.

ఇందులో అబద్ధం గాని, అతిశయోక్తి గాని అణు మాత్రం లేదనే చూచి వచ్చిన పెద్దలంతా చెపుతారు. బంగారు తండ్రి పడక గది చూడ వేయి కళ్లు చాలవుట! ఆ తళతళ లాట చూస్తున్నంత సేపూ సామాన్య నరు లెవరికీ కంటిమీద రెప్ప వాలదుట. బంగారు తండ్రికి మాత్రం ఈ మహైశ్వర్యం, భోగం అప్పుడే చాలాకాలం నించీ అనుభవ మయిపోయింది. అందుచేత ఆ ఐశ్వర్య కాంతి కళ్లు మూసుకున్నా ఆయన కను రెప్పలను దూసుకుని లోపలికి ప్రవేశించే అవకాశం ఉన్న స్థలంలో తప్ప అసలాయన కన్ను మూత పడ దంటారు!

కొంత కాలానికి ఆ మహామందిరానికి కడపటి మెరుగులూ, అంద చందాలూ తీర్చడం కూడా పూర్తి అయిపోయింది. ఆ తరువాత, కుర్చీలూ, మేజాలూ, బీరువాలూ, అద్దాలూ మొదలైన సామగ్రితో వడ్రంగులు, మేస్త్రీలు వచ్చారు. ఆ పైన గంపెడు మంది నల్ల వాళ్ళు, గుంపెడు మంది తెల్లవాళ్ళూ వచ్చారు. వాళ్లంతా బంగారు తండ్రి ఇంట్లో పనిచేసే వాళ్లుట! చివరికి ఆ రోజు సాయంకాలం ముసి ముసి చీకటి పడుతూం దనగా, బంగారుతండ్రి కూడా వచ్చే స్తున్నా డన్నారు. ఈ లోగా మన మిత్రుడు సుకృతి పరమానంద పడిపోతున్నాడు. చివరికి, ఆ మహానుభావుడు, ఆ దివ్యమూర్తి, తాతల కాలపు పురాతన జోస్యంలో చెప్పిన మహాపురుషుడు తర తరాలు గడిచి పోయిన తరువాత ఈ నాటికి ఆ లోయలోకి దయ చేస్తున్నాడు. "ఆ దివ్య ముఖుణ్ణి ఎప్పుడు చూస్తానా" అని ఆరాట

పడి పోతున్నాడు సుకృతి. బంగారు తండ్రి తన అపారమైన ఐశ్వర్యంతో తానొక దేవత అయి, ఆ మహా శిలాముఖుని మధుర మందహాసం వలెనే ఆ లోయలోని వారి జీవితాలపైన అపార మైన ప్రభావం కనపరచగలడని సుకృతి దృఢ విశ్వాసం. లోకు లంతా చెప్పుకుంటూన్న మాటలలో ఏదీ సుకృతికి సందేహాస్పదంగా కనిపించలేదు. ఆ మహా శిలాముఖంలోని అద్భుతమైన లక్షణాలన్నీ బంగారు తండ్రి ముఖంలో ఎలా ఉన్నాయో తాను స్వయంగా చూడా లని సుకృతి కుతూహలం. అతడా శిలాముఖం కేసి చూస్తూ ఆ మహా పురుషుడు కూడా ఎప్పటిలాగే మళ్ళీ తన వేపు దయాదృష్టి ప్రస రించడం చూసి భక్తితో నమస్కరిస్తూ ఉండగా, చక్రాల చప్పుడూ, ప్రజల కోలాహలం వీధి మలుపు తిరిగి వేగంగా వచ్చేస్తూన్నట్టు కనిపెట్టాడు.

"ఇదుగో! ఆ మహాపురుషుడు వచ్చేసినట్టున్నాడు!" అను కున్నాడు.

"అమ్మయ్య! చిట్ట చివరికి వచ్చేశా డమ్మా!" అన్నారు, చిరకాలంగా ఆ శుభ ముహూర్తం కోసం ఎదురు చూస్తూన్నట్టు కనిపిస్తూన్న పెద్దలంతా.

ఆ మహనీయుణ్ణి చూడడం కోసం వీధికి రెండు వైపులా బారులు తీరి నిలబడిన వారిలో కొందరు, "రానే వచ్చాడు. మహాను భావుడు. బంగారు తండ్రి రానే వచ్చా" రన్నారు.

ఎఱ్ఱని నాలుగు గుఱ్ఱాలు లాగే అందమైన గుర్రపు బగ్గీ నాట్యం చేస్తూన్నట్టు వయ్యారంగా వస్తూ సందు మలుపు తిరగగానే కనిపించింది. దాని గవాక్షంలోంచి బయటికి తొంగి చూస్తూన్న ఒక వృద్ధుని ముఖం కూడా కనిపిస్తూంది. అతని హస్త స్పర్శవల్ల బంగారంగా మారిపోయిన వస్తువుల్లో అది కూడా ఒకటేమో మరి!- అతని ముఖం మేలిమి బంగారం లాగ మెరిసిపోతూంది. చిన్ని నుదురు, చిన్న చురుకైన కళ్లూ, ముఖం నిండా లెక్కలేనన్ని ముడతలు, పలచగా—గట్టిగా బిగబట్టడం వల్ల మరీ పలచగా - కని పించే పెదిమెలూ విలక్షణంగా కనిపిస్తున్నాయి.

"అచ్చంగా ఆ శిలాముఖమే!........చూశారా?....ఇన్నాళ్ళకి మన తాతల నాటి జ్యోతిషం నిజమయింది. ఏ నాటి నించో ఎదురు చూస్తూన్న దివ్య పురుషుడు దిగివచ్చాడు చివరికి!" అనుకున్నారు, అచట గుమికూడిన వారిలో కొందరు.

సుకృతికి మాత్రం ఇదంతా ఏదో గందర గోళంగా ఉంది. ఆ దివ్య శిలా ముఖం పోలికలన్నీ ఈ నూతన వ్యక్తి ముఖంలో ఉన్నాయని వాళ్లంతా నమ్ముతున్నట్టే కనిపిస్తున్నారు. ఎక్కడో దూరంనించి వచ్చిన ఒక ముసలి బిచ్చకత్తె, ఇద్దరు పసి బిచ్చ గాళ్లూ రోడ్డు పక్కన ఒకచోట నిలబడి బంగారు తండ్రి గుర్రపు బగ్గీ వాళ్ల దగ్గిరికి రాగానే, చేతులు సాచి కరుణామయ కంఠాలెత్తి దీనంగా, "దిక్కులేని పచ్చులం మారాజా! దానం చెయ్యి దర్మ

ప్రెబో!"అని ఆక్రందనం చేశారు. పచ్చని చేయి, ఆ అపారైశ్వర్యా న్నంతా ఆర్జించిన అమృత హస్తం గుర్రపు బగ్గీ కుడి గవాక్షం లోంచి బయటికి వచ్చింది. దానిలోంచి గుప్పెడు రాగి నాణాలు "ట్లింగ్" అని చప్పిడి చేస్తూ నేలమీద రాలినయి. పట్టింది బంగా రం చేయగల ఆ బంగారు తండ్రి దాన హస్తం "రాగి డబ్బులు చిమ్మగల రమణీయ హస్తం" అనే బిరుదుకి అర్హమయినదే అని తేలిపోయింది. అయినప్పటికీ, నింస్సశయంగా వెనుకటిలాగే సంపూర్ణ విశ్వాసంతో నమ్మకంగా, "నిజంగా ఆ దివ్య శిలాముఖమే అచ్చంగా అచ్చు గుద్దినట్టు ఎలా ఉందో చూశావా, ఆ మహానుభావుడి ముఖం!" అంటూ జనం గుసగుస లాడుకుంటున్నారు.

సుకృతికి మాత్రం బంగారు తండ్రి ముఖంలో మహాశిలా ముఖుని పోలిక లే కోశానా కనిపించలేదు. మోసం, కుంటిలతా, కుట్రా మూర్తీభవించినట్టున్న బంగారు తండ్రి ముఖం చూడగానే, సుకృతి తన ముఖం ప్రక్కకు తిప్పేసుకున్నాడు. క్రమంగా తల యెత్తి, అప్పు డప్పుడే మంచు తెరలు దిగుతున్నా లీలగా కని పిస్తూన్న మహా శిలా ముఖం వంక చూశాడు. అస్తమయ సూర్యుని కడపటి కిరణాలతో జలతారు జిలుగుపని చేసినట్టు కని పిస్తూన్న ఆ మంచు తెరల మధ్య నించి కూడా ఆ దివ్య సుందర ముఖంలోని తీరు తియ్యాలన్నీ, తన ఆత్మను ఆకర్షించి కైవసం చేసుకున్న దివ్యలక్షణాలన్నీ అతనికి యథాతథంగా కనిపించినయి. సుకృతి మనస్సులో మళ్ళీ కాస్త ఉత్సాహం అంకురించింది.

అమృత మందహాసా లొలుకుతూన్న ఆ పెదవులు తన కేదో చెపుతున్నయి.

"ఆ దివ్యపురుషుడు మరికొంత కాలానికి వస్తాడు నాయనా! కలవరపడకు. కొంత కాలం వేచి ఉండు," అన్న దివ్య వాణి అతనికి వినిపించింది.

సంవత్సరాలు గడిచి పోతున్నయి. సుకృతి బాల్యావస్థ గడిచి, యౌవన దశలో ప్రవేశించాడు. కాని, ఆ లోయలోని ఇతరులెవరికీ సుకృతి గొడవే పట్టలేదు. అతనిని గమనించిన వారే లేరు. నిజానికి అతని జీవన విధానాల్లో వారిని ఆకర్షించదగిన దేమీ వాళ్లకు కనిపించలేదు. అయితే ప్రతి దినం తన పని అంతా ముగించుకున్న తరువాత, ఏకాంతంగా కూచుని మహాశిలాముఖం వంకే చూస్తూ ధ్యాననిమగ్నుడై పోవడం మాత్రం కొంత మంది అప్పు డప్పుడు చూడకపోలేదు. కాని, అది అతని తెలివి తక్కువ తనానికీ మూఢ విశ్వాసానికీ చిహ్నం అని మాత్రమే వాళ్ల అభిప్రాయం.

అయితే, సుకృతి పని పాటలలో తోటివారి కంటె మిన్నగా ఉండటం, జాలిగుండె గలవాడవటం, ఇరుగు పొరుగు వాళ్ళతో కలిసి మెలసి ఉంటూ ఉండటం, ఆ దివ్య శిలా ముఖుని ధ్యానం కోసం ఎన్నడూ పని మాత్రం ఎగకొట్టక పోవటం వల్ల, ఆ ఒక్క బాదస్తాన్ని క్షమించి ఊరుకునే వాళ్లు. ఆ మహాశిలాముఖుడే అతనికి గురువయాడనీ, ఆ ముఖంలోని ఉదాత్త దివ్య భావాలన్నీ

ఈ బాలుని హృదయాన్ని సువిశాలంచేసి, తక్కిన మానవుల హృదయాల కన్న గాఢమయిన ఉదాత్త దాక్షిణ్యాది లలిత భావాలతో నింపుతున్నవనీ వాళ్ళకేం తెలుసు! పుస్తకాలు చదివి సంపాదించే జ్ఞానం కన్న ఉదాత్తమైన జ్ఞానం ఈ విధంగా సంపాదించవచ్చని వాళ్ళకేం తెలుసు! అనేక వక్రతలు గల అన్య మానవ మాత్రులను ఆదర్శంగా పెట్టుకుని అలవరుచుకున్న సౌజన్యం కన్న ఈ విధంగా జీవితాన్ని ఎక్కువ పరిశుద్ధంగా, పవిత్రంగా తీర్చి దిద్దుకో వచ్చని వారికేం తెలుసు?

చేలో పని చేస్తున్నప్పుడైనా ఆ దివ్య శిలాముఖుని ధ్యానంలో నిమగ్నుడైనప్పుడల్లా సుకృతిలో సహజంగా ఉబికివచ్చే ఉదాత్త భావాలూ, అలవరచుకున్న సుస్వభావాలూ ఇతర మానవులలోని సుస్వభావాల కన్న ఉదాత్తమైన వని నిజానికి సుకృతికి మాత్రం ఏం తెలుసు! అత డొక కల్ల కపట మెరుగని అమాయక బాలుడు. పసితనంలో తల్లి ఒడిలో కూచుని దివ్య ముఖుని గూర్చిన జోస్యాన్ని విన్ననా డత డెంత అకళంక చిత్తుడో నేటికీ అంతే! ఆ మహా శిలాముఖంలో ఉద్భవించి లోయనంతా ముంచెత్తుతూన్న ఆ శిలా మూర్తి సౌశీల్యాన్నే అతడు నిరంతరం ధ్యానం చేస్తున్నాడు. అట్టి దివ్యముఖ లక్షణాలు గల మహామానవుడు ఇంకా అవతరించవనందుకు అంత ఆందోళన చెందుతూన్న ఆత్మ మరొకటి లేదు.

ఈలోగా పాపం బంగారు తండ్రి కాలం చేయడం, అందరితో పాటు అతణ్ణీ ఆ గ్రామ శ్మశానంలోనే సమాధి చెయ్యడం

కూడా జరిగిపోయింది. చివరికి, తీరా చనిపోయే నాటికి, అతని ఐశ్వర్యంలో పచ్చని తోలు తొడుగులోని అతని అస్థిపంజరం తప్ప చిల్లి గవ్వ కూడా మిగలలేదు. అతని బంగార మంతా హరించు కుని పోయిన మీదట, ఆ పిసినారి వర్తకుని పీల ముఖానికీ, ఔదార్య గాంభీర్యాది గుణాలకు ఆలవాలమైన ఆ మహా శిలా ముఖానికీ ఎక్కడా పోలికే లేదని క్రమంగా అచటి వారంతా చెప్పుకునే వారు. ఆ విధంగా బంగారు తండ్రి బ్రతికి ఉండగానే ప్రజ లతణ్ణి అనుమా నించడం, అగౌరవించడం కూడా జరిగింది. చనిపోయిన తరువాత క్రమంగా అతని మాటే మరిచిపోయారు. అతడు నిర్మించిన మహా భవనం ప్రసక్తి వచ్చినప్పుడు మాత్రం అతడు జ్ఞాపకానికి వచ్చే వాడు. ఇప్పుడా భవనంలో పెద్ద భోజన వసతి గృహ మొకటి పెట్టారు. ఏటేట వేసవి కాలంలో మహా శిలాముఖం సందర్శనం చేసుకు పోవడానికి తండోపతండాలుగా వస్తూన్న యాత్రికులూ, పరదేశస్థులూ సర్వసౌకర్యాలూ గల ఆ హోటలులోనే బసచేస్తు న్నారు. బంగారు తండ్రి అప్రతిష్ఠ పాలై పోవడం, క్రమంగా అతని కథ కూడా కాల గర్భంలో లీనమైపోవడంతో తాతలకాలం నించీ వస్తూన్న పురాతన జోస్యంలో చెప్పిన మహా పురుషుడు ముందు ముందు అవతరించ బోతున్నా డనే ఆ లోయలో అంతా మళ్ళీ చెప్పుకుంటున్నారు.

ఇలా ఉండగా కొంతకాలానికి ఇంకో కొత్త పుకారు బయలు దేరింది. ఆ లోయలో జన్మించి, కొన్నేళ్ళ క్రిందట సైన్యంలో

చేరిన ఒక యువకుడు అత్యంత శౌర్య సాహసాలు ప్రదర్శించి, అనేక యుద్ధాలలో పేరు తెచ్చుకుని, క్రమంగా తానే ఒక సుప్రసిద్ధ సేనాపతి అయాడు. చరిత్రకారు లతనిని ఏమని పేర్కొంటారో గాని, సైనిక శిబిరాలలో మాత్రం అతణ్ణి "వజ్రకాయుడు" అనే బిరుదు నామంతో పిలిచేవారు. అనేక యుద్ధాలలో ఆరితేరిన ఆ వీరాధివీరుడు వయోవృద్ధుడయాడు. గాయాలతో, దెబ్బలతో కత్తి గాట్లతో కాయలు గాసిపోయిన అతని శరీరంలో క్రమంగా పటుత్వం తగ్గిపోతూంది. చిరకాలంగా మునిగి తేలుతూన్న సైనిక జీవితం పైన ఆయనకు విసుగు పుట్టింది. ఆ రణగుణ ధ్వనితో అతని చెవులు హోరెత్తి పోయినవి. అందువల్ల ఇక తన సైనిక జీవితానికి స్వస్తి చెప్పి, తన జన్మస్థానమైన ఆ లోయలోకి వెళ్ళి తన కడపటి జీవిత కాలాన్ని విశ్రాంతిగా వెళ్ళబుచ్చాలనే నిశ్చయానికి వచ్చి, ఆ విషయం అధికారులకు వార్తమూలకంగా కూడా తెలియపరిచాడు. అతని జన్మస్థానంలో చిన్న నాటి స్నేహితులూ, ఇరుగు పొరుగు వారూ ఆ వీరాధివీరుడుకి ఘనమైన స్వాగతం ఇవ్వడానికి విపుల సన్నాహాలు చేస్తున్నారు. ఆ లోయలోని ఆబాల గోపాలానికి గొప్ప వన సంతర్పణ ఏర్పాటు చేస్తున్నారు. సేనాపతి గనుక అతనిని గౌరవించేటప్పుడు తగినన్ని ఫిరంగులు పేల్చడానికి కూడా ఏర్పాట్లు చేశారు. మరీ ఇంత సంరంభం జరగడానికి కారణం ఈ మహావీరుడే దివ్య శిలాముఖాన్ని 'బోలిన మహాపురుషుడనే వదంతి ఒకటి బయలుదేరి వెంటనే ఆఘమేఘాలమీద ఆ లోయ అంతటా

వ్యాపించడం. ఇప్పటికి ఈ లోయ భాగ్యం పండిం దన్నారు. వజ్ర కాయుని అంగ రక్షకోద్యోగి ఒకడు మహావీరుని ఆగమనానికి తగిన సన్నాహాలు జరిపించడం కోసం ముందుగా వచ్చి, ఆ దివ్య శిలా ముఖం అచ్చంగా తన యజమాని యైన ఆ మహావీరుని ముఖాన్ని పోలి ఉండడం చూసి, నిశ్చేష్టుడయి పోయాడట! ఆ పైన వజ్ర కాయుని చిన్ననాటి చెలికాళ్ళూ, చిన్ననాటి పాఠశాలలో సహా ధ్యాయులూ అంతా, సదరు వీరాధి వీరుడు చిన్నతనంలో తమతో చెడుగుడూ, చెట్టా పట్టాలాటలూ ఆడే రోజుల్లో అతని ముఖం ఎలా ఉండేదీ ఇప్పటికీ తమకు కళ్ళకు కట్టినట్టు గుర్తు ఉందనీ, మున్ముందులా ఆ మహాశిలాముఖంలోని పోలిక లన్నీ తమ బాల్య స్నేహితుని ముఖంలో అచ్చు గుద్దినట్టు ఉన్నాయనీ, ఆ మహా శిలా ముఖం ఎదుట నిలబడి సప్రమాణంగా ఆ విషయాన్ని ధ్రువ పరి చారు. పసితనపు అజ్ఞానం వల్ల అప్పు డీ విషయాన్ని తాము గ్రహించ లేక పోయా మన్నారు. అందువల్ల ఆ లోయ అంతటా ప్రజల ఆనందానికి మేర లేకపోయింది. ఈ సంరంభ మంతటికీ ఫలితంగా అంతకు పూర్వం సంవత్సరాల కొద్దీ ఎన్నడూ ఆ మహాశిలాముఖం శ్రద్ధగా చూసి యెరుగని వారు కూడా ఇప్పుడు వజ్రకాయుడు సరీగా ఎలా ఉంటాడో తెలుసుకొనడం కోసం మహా శిలాముఖాన్ని తదేక దీక్షతో పరిశీలిస్తున్నారు.

చివరికి ఆ మహోత్సవ దినం రానే వచ్చింది. ఆ లోయ లోని ప్రజ లందరితో పాటు మన సుకృతి కూడా ఆ రోజున తన

పని పాటలకు స్వస్తి చెప్పి ఆ మహోత్సవం జరిగే వనానికి బయలు దేరి వెళ్లాడు. దగ్గిరికి వెళ్ళిన కొద్దీ మతాధికారి రివరెండ్ బాటిల్ గౌళగాత్రం స్పష్టంగా వినిపిస్తూంది. ఆ లోయ అంతటికీ త్వరలో మంచి రోజులు ప్రసాదింప బోవుచున్నందుకూ, ఆ లోయలో జన్మిం చిన ఆ మహాపురుషుణ్ణి తిరిగి తన జన్మభూమికి కొనివస్తున్నందుకూ ఆ మతా చార్యుడు భగవంతుని దయాపరతను వేనోళ్ళ ప్రశంసిస్తూ మహోపన్యాసం చేసేస్తున్నాడు. ఆ అడవిలో చెట్ల మధ్య కొంత నేలను పరిశుభ్రం చేసి బల్లలు వేశారు. ఆ ప్రదేశానికి చుట్టూ చెట్లు దట్టంగా పెరిగి ఉన్నాయి. తూర్పు దిక్కున మాత్రం చెట్లు కొంచెం ఎడం ఎడంగా ఉండడం వలన వాటి మధ్యనించి దూరాన ఉన్న మహా శిలాముఖం లీలగా కనిపిస్తూంది. సభా వేదిక మీద వాషింగ్టన్ మహాశయుని సౌధం నించి తెచ్చిన చారిత్రక గౌరవం గల ఒక నగిషీ కుర్చీని వజ్రకాయుడికి ఆసనంగా అమర్చారు. దాని పైన గౌరవ సూచకమైన లారెల్ రెమ్మలతో కలిపి రకరకాల ఆకులు గల పసందైన తీగలతో అందమైన ఆర్చీ ఏర్పాటు చేశారు. దానిమీద జాతీయ పతాకను కట్టారు. ఆ జాతీయ పతాక ప్రతిష్ఠను కాపాడడానికీ, ఇనుమడింప జేయడానికీ వజ్రకాయుడు అనేక భయంకర సమరాల్లో పాల్గొన్నాడు. సభావేదిక మీద ఉన్న అతిథి సత్తముణ్ణి చూడాలనే ఆసక్తితో సుకృతి బొటనవ్రేళ్ల మీద నిలబడి చూస్తున్నాడు. కాని, ఆ ప్రశంసోపన్యాసాలలోను, స్వాగత సమ్మాన పత్ర పఠనాలలోను, బ్రహ్మాండ మైన హర్షధ్వానా

లకు కారణ మవుతూన్న ఆ సూక్తులలోను, ఛలోక్తులలోను, వజ్రకాయుని నోట వెలువడే మధుర వాక్కులలోనూ ఒక్కటైనా తమ చెవిని పడుతుందేమో అనే ఆశతో వేదిక చుట్టూ తేనె టీగల్లాగ మూగిన జనం పాప మా కుర్రవాడికి ఎంత మాత్రం ఎడ మీయడం లేదు. జనాన్ని సర్దుబాటు చేయడానికి వచ్చిన భటులు జనంలో అమాయకంగా కనిపించిన వారిని వెనక్కి నెట్టివేయడానికీ, అడపా దడపా లాటీలతో పొడవడానికీ ఎంత మాత్రం వెనుదీయడం లేదు. అందువల్ల, సహజంగా తోసుకుని ముందుకు పోయే స్వభావం లేని సుకృతిని అంత కంతకు వెనక్కి నెట్టి వేస్తున్నారు. అందువల్ల ఆ మహావీరుడు ఎక్కడో యుద్ధ రంగాల్లో పోరాడే టప్పుడు అతి భయంకరమైన ఆయన ముఖమును చూడడం ఎంత దుర్లభమో, ఇప్పుడూ అంత కష్టంగానూ ఉంది, సుకృతి లాంటి వాళ్ళకు. పాపం! ఆ కుర్రవాడికి అమితమైన నిరుత్సాహం కలిగింది. ఖిన్నుడై, మన శ్శాంతి కోసం ప్రక్కకు తిరిగి దీనంగా ఆ మహా శిలాముఖం వంకకు చూశాడు. విశ్వాస పాత్రుడైన చిరకాల మిత్రుడు లాగ ఆ మహాశిలాముఖం ప్రశాంత మందహాసంతో అతనిని ఊరడిస్తూ న్నట్టు ఆ చెట్ల సందులనుంచి కనిపించింది. ఇంతలో వజ్రకాయుని ముఖానికీ, మహా శిలాముఖానికీ గల పోలికలను రకరకాలుగా వివ రిస్తూన్న వాళ్ళ మాటలు కొన్ని సుకృతి చెవుల పడ్డయి.

"ఎంత చిత్రం! ఎక్కడా రవ్వంతైనా తేడా లేదే!" అన్నాడు ఒక పెద్ద మనిషి. ఆ ఆనందంలో తన చేతిలో ఉన్న పూలగుత్తిని నలిపివేస్తూ.

"ఔను అద్భుతంగా ఉంది! అంతా అదే నమూనా," అని వంత పాడాడు, పక్కనున్న ప్రేక్షకుడు.

"నమూనా అంటూ నసుగుతా వేమిటయ్యా! వజ్రకాయుడి ముఖం భూతద్దాలలోంచి చూడు తెలుస్తుంది! ఆ మహా శిలాముఖుడే ఈ వజ్రకాయుడు. నీ కేమన్నా సందేహమా? ఇదుగో చెపుతున్నా విను. వజ్రకాయు డంతటి మహావీరుడూ, మహాపురుషుడూ, ఇంత వరకూ పుట్టలేదు, పుట్టబోడు! తెలిసిందా?" అన్నాడు ఆవేశంతో ఒక వృద్ధుడు.

తరువాత వాళ్ళంతా ఒకేసారిగా "దివ్య శిలాముఖ మూర్తికీ జై! వజ్రకాయ మహావీరుడికీ జై!" అని కేకలు వేశారు. వెంటనే ఆ నినాదం ఆ సమావేశంలో మహాజన సముద్ర మంతటికీ వ్యాపించింది. వేలాది కంఠాలు మహోచ్చస్థాయిలో ఆ నినాదాన్ని అనుకరించాయి. ఆ మహాధ్వని ఆ లోయ నంతటినీ దద్దరిల్లజేసి చుట్టూ ఉన్న పర్వతాలను కంపింపజేసి, దానికి జవాబుగా మహా శిలా ముఖుని నోట వెలువడిన మహానంద గర్జనలాగ ప్రతి ధ్వనించింది. ఈ ప్రశంసలు, ఈ జయ జయ ధ్వానాలు సుకృతి ఆసక్తిని మరింత ప్రజ్వలింప జేసినయి. చిరకాలంగా ఇతరు లందరికన్న అధికాసక్తితో తాను ఎదురు చూస్తూన్న మహా శిలాముఖ విగ్రహుండు సకల సుగుణాభిరాము డైన శాంతమూర్తిగా, మహా జ్ఞానిగా, ధర్మ పరుడుగా, ప్రజల పాలిటి కల్ప తరువుగా అవతరిస్తాడనే ఇప్పటికీ

అతని గాఢ విశ్వాసం. కాని, సహజంగా నిరాడంబరమైన ఉదార భావాలు గల వాడవటం వల్ల మానవ జాతిని ఉద్ధరించడానికి భగవంతుడు చిత్ర చిత్ర మార్గాలు అవలంబిస్తూ ఉంటాడనీ, సర్వ జ్ఞుడు, సర్వ శక్తి మంతుడూ అయిన భగవంతుడు తలచుకునే యెడల రక్తసిక్త మయిన ఖడ్గాన్ని ధరించిన యుద్ధ వీరుని ద్వారా కూడా మానవజాతి కళ్యాణాన్ని సాధించవచ్చు ననీ సమాధానం చెప్పుకున్నాడు.

"అడుగో సేనాపతి! సేనాపతి!"

"హుష్! నిశ్శబ్దం! సేనాపతి వజ్రకాయుడేదో మాట్లాడు తున్నారు."

సభంతా సద్దుమణిగింది. మహావీరుడు వజ్రకాయ సేనాపతి ఆయురారోగ్యాభివృద్ధి కోసం సభలోని పెద్దలంతా లాంఛనంగా మధురసం సేవించారు. మిన్ను ముట్టే హర్షధ్వానాల మధ్య సభాసదు లకు తన కృతజ్ఞత ప్రకటించడానికి వజ్రకాయుడు లేచి నిలబడ్డాడు. ఆ మహావీరుడు ఇప్పుడు సుకృతికి కూడా స్పష్టంగా కనిపిస్తున్నాడు. ముందు నిలబడి ఉన్న సభాసదుల తలల మధ్యనించి సుకృతికి వజ్రకాయుని దర్శన మయింది. ఆయన భుజాలపైన సువర్ణ భుజ ఫలకాలు తళతళ లాడుతున్నాయి. జరీతో నగిషీ పని చేసిన మిలటరీ కోటు కాలరు కొంచెంగా పైకి లేచి ఉంది. గౌరవ లాంఛన మైన లారెల్ చెట్టు మండలతో కట్టిన అందమైన ఆర్చి కింద నిలబడి

ఉన్నాడు. ఆ ఆర్చీ పైన మెల్లగా ఊగాడుతూన్న జాతీయ పతాక నీడ ఆయన నుదుటి మీద పడుతూంది. కొంచెం ప్రక్కకు తిరిగి చూస్తే, చెట్ల సందునించి మహా శిలాముఖం కనిపిస్తూంది. ఆ జనం అంతా అంటూన్నట్లు ఆ రెండు ముఖాలకూ నిజంగా పోలిక లేమైనా ఉన్నాయా? చిత్రం! సుకృతికి అలాంటి పోలికలున్న జాడ ఎక్కడా కనిపించలేదు. యుద్ధాలతో, వార్ధక్యంతో వడిలిపోయినా బలంగా వజ్రసంకల్ప స్ఫోరకంగా మాత్రం ఉంది ఈయన ముఖం అనుకున్నాడు సుకృతి. అంతేగాని, మహా శిలాముఖంలో తాను అనుదినం చూస్తూన్న నిరాడంబరమైన వివేకం గాని, గంభీర సువిశాల దాక్షిణ్య భావం గాని ఈ సేనాపతి ముఖంలో మచ్చుకైనా కనిపించలేదు. ఒక వేళ మహా శిలాముఖం కూడా నిర్దయాత్మకమైన శాసనాధికారి వలె నటించబోయినా, ఆ దివ్యాననం లోని లాలిత్యమూ, ప్రశాంతతా ఆ ముఖాన్ని అప్పటికీ ఆకర్షణీయం గానే ఉంచగలవు.

"పురాతన జోస్యంలో చెప్పిన మహా పురుషుడు ఈయన మాత్రం కాడు," అనుకున్నాడు సుకృతి తనలో తాను. వెంటనే ఆ సమూహంలోంచి మెల్లగా జారి బయటపడి "ఇంకా ఎన్నాళ్లు ఎదురు చూడాలో!" అనుకున్నాడు. దూరంగా కనిపిస్తూన్న పర్వతాలలో మంచు కురుస్తున్నట్టు ఉంది. మహా శిలాముఖం భయంకరంగా, గంభీరంగా కనిపిస్తూంది. అయినప్పటికీ ఆ సంజ మబ్బులు కాంచన కాషాయాంబర ధారియై వచ్చి వెలసిన మహా దేవతా

మూర్తి వలె అపార కారుణ్యా మృతాన్ని వర్షిస్తున్నట్టుకూడా అని పిస్తూంది. సుకృతి అలా చూస్తూనే ఉన్నాడు. క్రమంగా ఆ మహా శిలాముఖ మంతా విశాల మందహాసంతో వికసించినట్టు కనిపిం చింది. ఆ పెదిమెలు కదలక పోయినా, ఆ ముఖంలోని మంద హాసం వేయి భావాలను వెల్లడించగల వెలుగుతో తళతళ లాడింది. బహుశః అదంతా అప్పు డప్పుడే ఆ పర్వతాలపైకి దిగుతూన్న పొగ మంచు తెరలలోంచి దోబూచు లాడుతూన్న సాయం సంధ్యా కాం తుల ప్రభావ మయినా కావచ్చు. ఆ అద్భుత మిత్రుని ముఖంలో కనిపించిన సాంత్వనభావం, - ఎప్పటి లాగే సుకృతిలో మళ్లీ ఆశా భావాన్ని రగుల్కొల్పింది. తన నిరీక్షణ వ్యర్థం కాదనే ధైర్యా మళ్ళీ అతనికి కలిగింది.

"భయ పడకు, సుకృతీ! భయపడకు, నువ్వు ఎదురుచూస్తూన్న మహా పురుషుడు తప్పకుండా వస్తాడు," అంటూ అతని అంతర్వాణో, మహా శిలాముఖుని వాణో అతనికి స్పష్టంగా వినిపించింది.

మరికొన్ని సంవత్సరాల కాలం ప్రశాంతంగా గడిచింది. సుకృతి తన జన్మస్థానాన్ని విడిచి పెట్టకుండా ఇంటి పట్టునే ఉంటు న్నాడు. అయితే కాల ధర్మానుసారం ఎదిగి మధ్య వయస్కు డయాడు. అయాచితంగా ఎలాగో చుట్టు పట్ల అందరికీ సుపరిచితు డయాడు, ఇప్పటికీ, వెనకటి లాగే జీవనాధారం కోసం కష్టపడి పనిచేస్తూనే ఉన్నాడు. అతని అమాయిక సౌమ్య ప్రకృతిలో

కూడా ఏమీ మార్పు లేదు. మానవు లందరికీ కలగ బోతూన్న మం గళమయ మహావకాశాన్ని గురించిన చింతలో అతడు తన జీవితంలో మిక్కిలి విలువైన కాలం గడిపివేస్తున్నాడు. ఆ విషయాన్ని గురించి దేవతలతో దీర్ఘంగా చర్చిస్తూన్నట్లూ, ఆవిధంగా అప్రయత్న సిద్ధంగా వారి విజ్ఞానంలో కొంత భాగం ఇతనికి అలవడినట్టు కూడా కనిపిస్తుంది. నిత్య జీవితంలో అతని ప్రశాంత ప్రవర్తన, పరోపకార పారీణతలే ఇందుకు సాక్ష్యాలు. ఆ జీవితం అడుగడుగునా పచ్చగా కల కల లాడే సువిశాలమైన వెన్నెల బాట అయింది. ఎంత నిరాడంబర జీవి అయినా, అతని జీవితం వలన ప్రపంచానికి ఎంతో కొంత మేలు కలుగని రోజు లేదు. ఎన్నడూ నిత్య దిన చర్యను పెద్దగా అతిక్ర మించే వాడు కాడు. అయినా, ఇరుగు పొరుగు వారికి ఏదో ఒక విధంగా ఉపయోగ పడని రోజు ఉండేది కాదు. అనుకోకుండానే, క్రమంగా కొంత మందికి అతడొక గురువుగా తయారవుతున్నాడు. పవిత్రమైన, సహజ నిరాడంబరము లైన అతని ఆలోచనలే, శారీర కంగా అతడు చేసే సత్కార్మలుగా రూపొంది, క్రమంగా అతని ముఖతః ఉదాత్త సూక్తులుగా కూడా వెలువడుతున్నాయి. వినే వారి జీవితాలలో గొప్ప మార్పులను తీసుకొని రాగల సత్యా లెన్నో వారికి తెలుపుతున్నాడు. అయితే, తమ సహచరుడు, స్నేహితుడు అయిన సుకృతి ఎవడో అసాధారణ పురుషు డేమో అన్న అను మానం మాత్రం వాళ్ల కెన్నడూ కలగలేదు. అసలు సుకృతికే అలాంటి అభిప్రాయం ఏ కోశానా లేదు. కాని, ఇతర మానవ

మాత్రులెవరూ ఎన్నడూ ఉచ్చరించని ఉదాత్త సత్యాలు జలజల ప్రవహించే కొండ వాగులాగ అతని ముఖతః ప్రవహిస్తున్నయి.

ఆ లోయలో, ప్రజల మనస్సులు తిరిగి కొంత శాంతస్థితికె వచ్చిన వెంటనే, దివ్యత్వం ఉట్టిపడే ఆ పర్వతుని ముఖానికీ, క్రోధం-దురహంకారం - కుట్రలు కొట్టి వచ్చినట్లు కనిపించే వజ్రకాయుడిక్కీ పోలికలున్నా యను కొనడం తప్పేనని ఒప్పుకొనడం మొదలు పెట్టారు. కాని, ఇంతలోనే మరొక వార్త పత్రికలలో తరచు కనిపించడం మొదలు పెట్టింది. మహా శిలాముఖుని పోలిక లన్నీ యథాతథంగా ఆ దేశంలోని ఒక గొప్ప రాజకీయవేత్త ముఖంలో కనిపిస్తున్నాయని ఒకరి వెంట ఒకరుగా నమ్మకంగా వ్రాస్తున్నారు. బంగారు తండ్రి లాగే, వజ్రకాయుడు లాగే ఆయన కూడా ఆ లోయలోనే పుట్టి, చిన్న తనంలోనే వెళ్ళిపోయి గొప్ప న్యాయవాదిగా రాజకీయవేత్తగా అఖండ ఖ్యాతి ఆర్జించాడు. బంగారు తండ్రి భాగ్యాని కంటె వజ్రకాయుని భుజబలానికి కంటె శక్తిమంతమైన వాగ్ధోరణి ఇతని దగ్గర ఉంది. ఆయన ఏ విషయాన్ని గురించి ప్రసంగిస్తున్నా ప్రేక్షకులంతా తన్మయులై, చిత్ర ప్రతిమల లాగ కూచుని పోయేటట్టు చేయగల అసమాన వాక్చాతుర్యం ఆయనకు సిద్ధించింది. ఆయన ఏమి చెప్పినా ప్రేక్షకులు చెవులు అప్పగించి విని విశ్వసించడం తప్ప మరో విధంగా ఎన్నడూ జరగదట. తప్పులనైనా ఒప్పులుగా, ఒప్పులను తప్పులుగా నిరూపించి

ఒప్పించగల మహావక్త ఆయన. తాను విడిచే నిశ్వాసాలతోనే పెద్ద పొగమంచు మబ్బులను సృష్టించి వాటివల్ల పట్టపగలు చీకటి పడేటట్టు చేయగలడు. ఆయన నాలుక మహా మాంత్రికుని మంత్ర దండం లాంటిది! ఒకప్పుడు ఉరుములతో పిడుగులు కురిపిస్తుంది. మరొకప్పుడు మధురాతి మధురమైన గానం లాంటి వాక్యరచన చేస్తుంది; ఒకప్పుడది రణభేరి; మరొకప్పుడది శాంతి గీతం; అలాంటి విషయాలేమీ లేనప్పుడు ఆ నాలుకకు ఒక హృదయం ఉందేమో అన్నట్టు కూడా కనిపిస్తుంది. ఆయన అద్భుతుడనే మాట మాత్రం నిస్సంశయంగా నిజం. ఆయన వక్తృత్వ శక్తికి సంభావ్యములైన ఇతర విజయాలన్నీ - రాజ్య సభలలోను, వైజ్ఞానిక పరిషత్తులలోను, పాలకుల గోష్ఠులలోను కలగ దగిన గౌరవాలన్నీ - లభించిన తరువాత, స్వదేశంలో ఒక తీరాన నిలబడి రెండవతీరం వరకు వినిపించేటట్టు మాట్లాడగల దిట్టూ ఆయన ప్రజ్ఞకు ప్రపంచ ప్రఖ్యాతి కూడా సిద్ధించిన మీదట, ఆయన అను చరులంతా తమ దేశపు ప్రెసిడెంట్ పదవితో ఆయనను సత్కరించా లని శపథం చేయడానికి కూడా అదే కారణమయింది. ఆయనకు ఈ విధంగా గౌరవాన్ని మించిన గౌరవం లభిస్తున్న సమయం లోనే ఆయన భక్తులలో కొందరు ఆయన ముఖంలో మహా శిలా ముఖపు పోలికలు ఉన్నవని కని పెట్టారు ఈ వార్త రివ్వున రెక్కలు కట్టుకుని దేశమంతా చుట్టబెట్టడంతో ఆ మహావక్తకు అసలు పేరు మరుగుపడి "సనాతన శిలామూర్తి" అనే పేరు

క్రమంగా రూఢమై పోయింది. ఆయన రాజకీయ ఆశయాల సాఫల్యానికి కూడా ఈ నూతన నామధేయం అమోఘమైన సాధనంగా ఉపకరిస్తోంది. ఎందుకంటే: యూరోపాలో క్రైస్తవ మతాధిపతి పోప్‌కి లాగే, అమెరికాలో ప్రెసిడెంట్ కాబోయే మహాపురుషుడికి కూడా ఏదో ఒక ఉపనామం ఏర్పడడం రివాజై పోయింది.

"సనాతన శిలామూర్తి" స్నేహితు లంతా ప్రెసిడెంట్ పదవికి జరగబోయే ఎన్నికలలో ఆయన విజయం కోసం తీవ్ర కృషి చేస్తూ ఉండగా, ఆయన అదేమీ పట్టించు కోకుండా తన జన్మస్థానమైన ఆ లోయను ఒకసారి చూచి రావడానికి బయలు దేరాడు. ఈ యాత్రలో ఆయన ఆశయం తన తోటి పౌరు లందరినీ కుశల ప్రశ్న చేసి కరచాలనం చేసి రావడమే. ఈ యాత్ర వల్ల ఎన్నికల ప్రచారంలో కలిగే పరిణామాలను గురించి నిజానికి ఆయన ఆలోచించనే లేదు. ఆ మహా రాజకీయ వేత్తకు ఘన మైన స్వాగత మీయడానికి బ్రహ్మాండమైన సన్నాహాలు చేస్తు న్నారు. ఆ రాష్ట్రపు సరిహద్దుల వద్దనే ఆయనను ఆహ్వానించి సగౌరవంగా ఊరేగిస్తూ తీసుకొని రావడానికి గాను ఒక అశ్విక భట దళాన్ని పంపించారు. పౌరు లంతా పని పాటలు వదిలి వేసి, ఆ మహామహుని చూడడం కోసం వచ్చి రోడ్డుకి రెండు ప్రక్కలా పెద్ద దడి కట్టినట్టు నిలబడ్డారు. వారిలో సుకృతి కూడా ఒకడు. ఇలాగే లోగడ ఆశపడి వచ్చినప్పుడు ఒకటి రెండు సార్లు

ఆశాభంగం కలిగినా, సహజంగా అతడు ఆశావాది. మనోహరమైన, అందమైన సర్వ విషయాలను ఆయన సులభంగా నమ్ముతాడు. ఆయన హృదయ కవాటం సదా విప్పారి ఉండి, భగవత్ప్రసాదంగా లభించిన సర్వాన్నీ స్వీకరించడానికి సర్వసంసిద్ధంగా ఉంటుంది. అందువల్ల, మహా శిలాముఖాన్ని బోలిన మహాపురుషుణ్ణి చూద్దామన్న సంపూర్ణ ఆశాభావంతోనే సుకృతి వచ్చాడు.

వరుసలు వరుసలుగా, లయానుగుణంగా కదం తొక్కుతూ నడుస్తూన్న జాతి గుర్రాల మీద అశ్విక దళం ముందుగా వచ్చింది. రాజహంస లాగ నృత్యం చేస్తున్నట్టు నడుస్తూన్న అశ్వాల పద సంఘట్టన దట్టమైన ధూళి మేఘాలను రేగ గొడుతూంది. ఆ ఎర్ర మబ్బులు బాగా దట్టంగా లేవడంతో సుకృతి ఒకసారి మహా శిలాముఖం వంక చూసేసరికి ఆ ధూళి మబ్బు తప్ప అతనికి మరేమీ కనిపించలేదు. ఆ చుట్టు పక్కల పేరుగల పెద్ద మనుష్యులంతా అశ్వారూఢులై ఆ ఊరేగింపు వెంట వస్తున్నారు. సైనికోద్యోగులు సరే సరి! తమ తమ ఉద్యోగ లాంఛనాలంకారాలతో సహా హాజరయారు. అచటి కాంగ్రెసు (అమెరికా పార్లమెంటు) సభ్యుడూ, ఆ జిల్లా అధికారీ, స్థానిక వార్తాపత్రికల సంపాదకులూ, మోతుబరి ఆసాములూ చాలామంది కూడా, ఆట్టే హరాం చెయ్యని గుర్రాలను ఏరుకుని ఎక్కారు. ఇక ఆ ఉత్సవం పొడుగునా ఎత్తుగా ఎగురుతూన్న రంగు రంగుల జెండాలు అసంఖ్యాకంగా

ఉన్నాయి. ఆ దృశ్యం చూడ రెండు కళ్లు చాలడం లేదు. అందులో కొన్ని జెండాల మీద ఆ మహా రాజకీయవేత్త చిత్రం, మహా శిలాముఖ చిత్రం కూడా అచ్చొత్తించారు. ప్రక్క ప్రక్కన ముద్రించిన ఆ రెండు చిత్రాలూ, ఒకరి వంక ఒకరు చూచి నవ్వు కుంటూన్న ఇద్దరు సోదరుల చిత్రాల లాగ ఉన్నాయి. ఆ చిత్ర కారుడు యథాతథంగానే చిత్రించి ఉంటే ఆ రెండు ముఖాలలో పోలికలు పుష్కలంగా, అద్భుతంగా ఉన్నాయని ఒప్పుకోక తప్పదు.

చక్కని సంగీతం పాడే బాండు మేళం కూడా ఈ ఊరేగింపు మధ్య ఉన్న సంగతి మనం మరిచిపోకూడదు. ఆ మంగళ వాయిద్యంతో ఆ లోయంతా ప్రతిధ్వనించి, ఆ పర్వత శ్రేణులను కూడా తన్మయత్వంతో తలలూపేట్టు చేస్తూంది. ఆ మధుర గానం ఆ ప్రాంత మంతటినీ ఉప్పెనలాగ ముంచెత్తి, ఎత్తు పల్లా లన్నిటినీ ఏకం చేసి మొత్తం ఆ లోయంతా ఏక కంఠంతో ఆ మహా పురుషుడికి స్వాగతగీతం ఆలపిస్తూందా అన్నట్టు ఉంది. వీటన్నింటి లోకీ చిత్రమైన దేమిటంటే: ఆ గానం మహా శిలాముఖ పర్వ తాన్ని తాకి ఆ దివ్య ముఖుని గంభీర కంఠ స్వరాన్ని కూడా మేళ వించుకున్నట్టు, మహా బృందగానం లాగ ప్రతిధ్వనిస్తూంది. చిట్ట చివరికి, అచటికి సనాతన జోస్యంలోని మహా పురుషుడు వచ్చి నందుకు మహా శిలాముఖుని విజయోత్సాహ ప్రకటన కాబోలు అది!

ఉత్సవంలో పాల్గొంటున్న యువకులంతా, అమితానందంతో తమ టోపీలను తీసి ఎగురవేస్తూ, జయ జయ నినాదాలు చేస్తున్నారు. అత్యంత ప్రసరణ శీలంగల ఆ ఉత్సాహం చివరికి సుకృతికి కూడా సోకింది. అతడు కూడా టోపీ తీసి ఎగురవేస్తూ "మహా శిలా ముఖ మూర్తికీ జై! సనాతన శిలా మూర్తికీ జై!" అంటూ కంఠమెత్తి ఎన్నడెరుగని స్థాయిలో గట్టిగా అరిచాడు. నిజానికి అప్పటి కింకా సుకృతికి ఆయన దర్శన భాగ్యం కలగనే లేదు.

ఇంతలో, "అడుగో! అటు సూటిగా చూడండి! కనిపిస్తు న్నాడు. అడుగో - ఆ మహా శిలా ముఖానికీ ఈ మహా పురుషుడి ముఖానికీ రవ్వంతైనా తేడా ఉందేమో చూడండి ఎంత విచిత్రం! నిజంగా కవల పిల్లల ముఖాల లాగ లేవూ? "అంటున్నారు సుకృతి ప్రక్కన నిలబడిన వారు.

ఇంతలోనే ఆ జన సమూహం మధ్యకు తెల్లని నాలుగు గుర్రాలను కట్టిన అందమైన (పైకప్పు ముడిచివేసిన) బగ్గీ వచ్చింది. ఆ గుర్రపు బగ్గీలో తన పెద్ద తలపైన టోపీ తీసివేసి ఆ మహా రాజకీయ నాయకుడు - సనాతన శిలామూర్తి - ఆసీనుడై ఉన్నాడు.

"ఇప్పుడు చెప్పు! ఈయనకీ ఆ మహా శిలా ముఖానికీ ఎక్కడైనా రవ్వంతైనా తేడా ఉందా?" అని సుకృతిని నిగ్గదీశాడు. ప్రక్కనున్న పెద్ద మనిషి.

నిజానికి, సుకృతికి కూడా చూడగానే ఆ మహా రాజకీయ వేత్త నవ్వు ముఖానికీ, ఎదురుగుండా పర్వతంమీద కనిపించే మహా శిలాముఖానికీ పోలిక ఉన్నట్టే కనిపించింది. పుష్టి గల కండ రాలతో, ఎత్తు పల్లాలతో, ధైర్యం - శక్తి ఉట్టిపడే కవళికలతో, కేవల శౌర్య సాహసాలను మించిన అతి మానుషాకృతిలో పోలికలు ఉన్నాయనే అనుకున్నాడు సుకృతి కూడా. అయితే, ఆ పర్వతుని దివ్యవదనంలో వెలుగొందే నైర్మల్యం, ఉదాత్తత, అమర కారుణ్య భావం ఆ అచేతనమైన గండశిలను మహిమోపేత మయిన చిన్మయ మూర్తిని చేసినయి. ఈ లక్షణాలు మాత్రం ఈ రాజకీయవేత్త ముఖంలో కంచు కాగడాలు వేసి వెతికినా కనిపించేటట్టు లేదు. సహజమైనదో, లేక మధ్యలో వచ్చిందో గాని ఆ రెండు ముఖాలకీ పెద్ద వ్యత్యాసమే ఉంది. అందువల్లనే ఆ కాకలు దేరిన రాజనీతి వేత్త గుంటలు పట్టిన కళ్లలో అగాథమైన అలసత్వ మేదో గోచ రిస్తూంది. బొమ్మలతో ఆడుకొనే దశను అధిగమించిన శిశువు లాగ అధిక శక్తులూ, అల్పాశయాలూ గల మానవుని లాగ, ఎన్ని విజయాలు సాధించినా ఉదాత్తలక్ష్య ప్రేరితమైన వాస్తవికతను సాధించ లేక పోయిన వ్యక్తి లాగ అతడు కనిపిస్తున్నాడు:

సుకృతి ప్రక్కన నిలబడిన బుద్ధిమంతుడు అతని ప్రశ్నకు జవాబుకోసం ఉండుండి మోచేత్తో పొడుస్తూనే అన్నాడు.

"చెప్పవేమయ్యా? ఆ పర్వతం మీది ముఖమే చిన్న సైజులో మనుష్యాకృతి దాల్చివస్తూన్నట్టు ఉందంటావా లేదా?"

"లేదు," అన్నాడు సుకృతి నిర్మొగమాటంగా. "నాకు అలాంటి పోలిక లేమీ కనిపించడం లేదు," అన్నాడు.

"అయితే, అది ఆ పర్వత ముఖానికే లోటు" అని మళ్ళీ ఒకసారి ఆ సనాతన శిలాముఖ మూర్తికి జేజేలు కొట్టాడు, సుకృతి పక్కన నిలబడిన వ్యక్తి.

నిస్పృహతో, నిరుత్సాహంతో ఇంటికి మళ్లాడు సుకృతి. ఈ సారి అతనికి కలిగిన ఆశాభంగం మరీ గాఢంగా మనసును కలత పరిచింది. సనాతన జోస్యంలోని సర్వ లక్షణాలూ గల మహా పురుషుడు తనకు సాక్షాత్కరిస్తా డనే ఆశతో వచ్చాడు. నిరాశ ఎదురయింది. ఇంతలో క్రమంగా ఆ ఆశ్విక భట దళం, బాండు వాద్యబృందం, గుర్రపు బగ్గీ, అమితంగా హంగామా చేస్తున్న జనం సుకృతిని దాటి పోయారు. ఆ ప్రజోత్సాహం రేపిన ధూళి మేఘాలు క్రిందికి దిగి పోవడంతో దూరాన మహా శిలాముఖం అసంఖ్యాక శతాబ్దులుగా ప్రదర్శిస్తూన్న అద్భుత గాంభీర్యంతో సాక్షాత్కరిస్తూంది.

"నాయనా! సుకృతీ! నే నిక్కడే ఉన్నానయ్యా! ఆ మహా పురుషుని కోసం నీ కంటె ఎన్ని తరాల పూర్వం నించో నేనూ ఎదురు చూస్తున్నాను తెలుసా? నీలాగ నేను ఎన్నడూ నిస్పృహ చెందలే దయ్యా! నిరుత్సాహ పడడం అనవసరం. ఆ మహా పురు

షుడు త్వరలోనే బయట పడతాడు," అన్న మాటలు ఆ మహా శిలా ముఖం నించి వెలువడినట్టు అనిపించింది, సుకృతికి.

కాలచక్రం తిరిగిపోతూంది. ఏడాది వెంట ఏడాది కానరాని వేగంతో పరుగులు పెడుతూంది. ఏటేటా సుకృతి తలపై మరి కొన్ని తెల్ల వెంట్రుకలు తొంగి చూస్తున్నయి. అతని విశాల ఫాలం మీద మరొక ముడత, అతని చెక్కిలి మీద మరొక చార ఏర్పడుతున్నయి. సుకృతి క్రమంగా పెద్ద వాళ్లలో, వృద్ధులలో జమ అవుతున్నాడు. ఆయనది కేవలం శరీర ధర్మమయిన వార్ధక్యమే కాదు. ఆయన పలిత కేశాలతో పాటు ఆ శిరస్సులోని భావాలు కూడా పరిపక్వ మవుతున్నయి. ఆయన నుదుటిమీద ఏర్పడిన ముడతలు కాల పురుషుడు రచించిన అమర శాసనాలు; ఒక ఉదాత్త జీవిత కాలంలో జరిగిన వివేకమయ గాథ లనేకం ఆ శాసనాలలో లిఖింపబడి ఉన్నయి. పూర్వం వలె నేడు సుకృతి అనామకుడు కాడు. అతడు ఏనాడూ ఆశించక పోయినా, అనుకోనైనా అనుకోక పోయినా, ఇతరులు నానా అవస్థలూ పడి కూడా సాధించజాలని ప్రఖ్యాతి ఆయనకు పుష్కలంగా వచ్చి పడుతూంది. ఆయన కీర్తి నేడాలోయలోనే కాదు; ఆ దేశంలోనే కాదు; ప్రపంచంలో ఇతర ప్రాంతాలు కొన్నింటిలో కూడా వ్యాపించింది. దూర ప్రాంతాలనించి కూడా కళాశాలాచార్యులూ, నగరాలలోని ప్రముఖులూ, ఆ లోయకి వచ్చి సుకృతిని సందర్శించి, ఆయన ప్రసంగాలు

విని పోతున్నారు. నిరాడంబరుడైన ఈ సామాన్య గ్రామీణ గృహస్థు ఏ పుస్తకాలలోను చదువుకోని అద్భుతమైన అపూర్వమైన సూక్తులూ, సిద్ధాంతాలూ బోధిస్తూ, దేవ లోకాన్నించి దిగిన దివ్య పురుషుడు లాగ, దేవభాష వంటి మధుర గంభీర భాషలో మాట్లాడు తున్నాడని దేశ దేశాలకు తెలివిడి అయింది. విరాగి గాని, రాజ కీయవేత్త గాని, దాత గాని, తత్త్వవేత్త గాని ఎవరు వచ్చినా, చిన్నతనం నించీ సహజంగా అలవడిన సౌమ్య సాదర భావాలతో సుకృతి వారిని ఆదరించి, నిర్మలమైన తన బుద్ధికి తోచిన భావాలను యథాతథంగా వారికి తెలుపుతాడు. వారితో మాట్లాడుతూన్నప్పుడు, ప్రసంగం మధ్య ఎప్పుడో ఆయన వదనం వినూతన దివ్య తేజస్సుతో వెలుగొందుతూ, ప్రశాంత సాయం సంధ్యా శోభ లాగ వారి మనస్సులో ఏవో దివ్యానుభూతులను కలిగిస్తుంది. వా రాయన సుభాషితాలను, ఆయన సన్నిధిలో తమకు కలిగిన విచిత్ర ఆనం దానుభూతులనూ నెమరు వేసుకుంటూ వెనుదిరిగి పోతూ అప్ర యత్నంగా ఎదురుగా కనిపించే ఆ మహా శిలాముఖాన్ని చూసి, ఒక్క నిమిషం నిశ్చేష్టులయి నిలబడి, "సరిగా ఇలాంటి ముఖాన్నే ఎక్కడో చూసినట్టున్నామే!" అనుకుంటూ పోతూండడం మామూలు.

సుకృతి క్రమంగా వృద్ధుడవుతూన్న సమయంలో, భగవం తుని కృప వలన, ఒక మహాకవి ఈ భూమిమీద అవతరించాడు. ఆయన కూడా ఈ లోయలోనే పుట్టాడు గాని, జీవితంలో చాలా

భాగం ఈ విచిత్ర ప్రదేశానికి దూరంగా ఎక్కడో నవ నాగరి కతా కోలాహలంతో దద్దరిల్లి పోతూన్న మహా పట్టణాలలో ఉంటూ, మధురాతి మధురమైన గీతాలల్లి ఆలపిస్తున్నాడు. బాల్యంలో ఆయనకు పరిచితమైన ఈ లోయ చుట్టూ ఉన్న పర్వతాల హిమ కిరీటాలు కూడా స్వచ్ఛమైన ఆయన కవితా వాతావరణంలో అప్పు డప్పుడు మిల మిలలాడుతున్నాయి. మహా శిలాముఖాన్ని కూడా ఆయన మరచి పోలేదు. ఆ మహాకవి ఆ దివ్య శిలాముఖాన్ని గురించి ఒక గొప్ప గేయం వ్రాశాడు. ఆ పాట నిజంగా ఆ మహా శిలాముఖుని నోటనే వెలువడిన దన్నా నమ్మేటంత అద్భు తంగా ఉంది. అలాంటి మహా ప్రతిభావంతుడు అనేక అద్భుత శక్తులతో దేవలోకం నించి అవతరించా డన్నా అతిశయోక్తి కాదు. ఆయన ఒక పర్వతాన్ని గురించి ఒక గీతం వ్రాస్తే, ఆ పర్వత వక్షస్థలం లోను, శిఖరంమీదనూ అపూర్వమైన గాంభీర్యాది ఉదాత్త లక్షణా లెన్నో మానవజాతి అంతటికీ విశదంగా కనిపించ వలసిందే! లేక, ఏదైనా సరస్సును గురించి వ్రాస్తే, దివ్య మంద హాస మేదో ఆ సరస్సుపైన వర్షించి, శాశ్వతంగా దాని మీదే తేలుతూ, మిలమిల మెరుస్తూ ఉండి పోవలసిందే! అదే, ఏ ప్రాచీన మహా సముద్రాన్ని గురించో వ్రాశాడంటే, ఆ కావ్య రసానం దంతో అపార గంభీరమైన ఆ మహాసముద్రుని హృదయం ఉవ్వెత్తుగా ఉప్పొంగిపోక తప్పదు. ఈ విధంగా ఆ మహాకవి అమర నేత్రాలు ఈ లోకంలో విప్పారిన క్షణం మొదలు ఈ లోకాని

కొక నవాలోకం, నూతన వికాసం లభించినయి. సృష్టికర్త తన సృష్టికి కడపటి అంద చందాలు దిద్దడం కోసమే ఈ మహాకవిని సృష్టించాడు. ఈయన తన దివ్య వ్యాఖ్యానాలతో సృష్టికి పరిపూర్ణ తను సిద్ధింప జేశాడు.

ఇక, సోదర మానవులను గురించి ఆయన రచించిన కవితా మంజరి కూడా సౌందర్యంలో గాని, మహిమలో గాని దీనికి ఏ మాత్రం తీసిపోదు. మట్టిలో పుట్టి మట్టిలో పెరిగే సామాన్య స్త్రీ గాని, పురుషుడు గాని, పసిబిడ్డ గాని దైనందిన జీవితంలో ఆయన కవితా దృష్టిలో పడ్డారా, వారికి అద్భుతత్వం, అమరత్వం లభించిన వన్నమాటే! వారికి దేవతలతో నిత్యాను బంధం కూర్చే సూక్ష్మాతి సూక్ష్మమైన సువర్ణ శృంఖలాలను ఆయన తన పాఠకులకు చూప గలడు. దివ్యపురుషుల అవతార రహస్యాలను వివరించి, వాటి ద్వారా ఆ సంబంధాలను మనోహరంగా వివరిస్తాడు. ఈ ప్రాకృత జగత్తు యొక్క సౌందర్య గాంభీర్యాలు కేవలం కవి భావనలోనే వాస్తవికతను పొందుతున్నా యని నిరూపించి, తద్ద్వారా తమ మాయావాదాన్ని సమర్థించుకునే వారు కూడా కొందరున్నారు. ప్రకృతి మాత దుస్సహమైన నిరసన భావంతో పంది పిల్లలూ వగైరాలను సృష్టించిన పిదప, మిగిలి పోయిన చెత్తా చెదారాలతో సృష్టి చేసిన అట్టివారు చేసే పిడివాదాలతో మనకు నిమిత్తం లేదు. సర్వ విషయాలలో, సర్వదా సత్యతమమైన పరమ సత్యం దర్శించడమే మన మహాకవి లక్ష్యం.

మహాకవి గీతాల మాధుర్యం సుకృతిని బాగా ఆకర్షించింది. చిరకాలంగా, రోజూ తన పని ముగించుకున్న తరువాత, తన కుటీరం ముందు వాకిట్లో బల్లమీద, మహా శిలాముఖుని కెదురుగా కూచుని అట్టే చూస్తూ, ఏవేవో దివ్య భావాలలో మునిగి తేలు తూండే సుకృతి ఇప్పుడు మరికొంత సేపు అక్కడే కూచుని మహా కవి గీతాలను చదువుకుంటూండడం కూడా మామూలయింది. ఆత్మకు ఆహ్లాదమూ, రస పారవశ్యమూ కలిగించే గీతాలు చదివినప్పు డల్లా, తల యెత్తి, ప్రేమతో తనవంక చూసే మహోన్నతమైన ఆ మహా శిలాముఖ ఫాలాన్ని తేరిపార చూసేవాడు. చూసి చూసి, ఆ మహా శిలాముఖుని ఉద్దేశించి ఇలా అనేవాడు: "ఓ మహామహుండా! మిత్రుడా! ఈ మహా కవి నిన్ను బోలిన వాడనేందుకు అన్ని విధాలా అర్హుడుగా కనిపిస్తున్నాడు."

ఈ మాట అనేసరికి, ఆ మహాశిలా ముఖంలో మందహాస రేఖ కనిపించింది. కాని నోట మాట మాత్రం లేదు.

ఇక మహాకవి కూడా ఈ లోయకు చాలా దూరాన ఉన్నా, సుకృతి ప్రశస్తి చాలా విన్నాడు. వినడమే కాదు. ఆయన స్వరూప స్వభావాదులను గురించి బాగా యోచించిన మీదట, విద్యా గంధం లేక పోయినా, మహోదాత్త సత్యాలను బోధిస్తూన్న ఆ నిరాడంబర జీవిని పోయి సందర్శించడం కన్న వివేకవంతమైన పని లేదని తీర్మానించుకున్నాడు. ఆ వసంత ఋతువులో ఒకనాటి

సాయంకాలం బయలుదేరి, రైలు ప్రయాణంచేసి, ఆ సాయం కాలానికి కారుమీద సుకృతి కుటీరానికి కొంచెం దూరంలో దిగాడు. పూర్వం బంగారు తండ్రి నిర్మించిన మహా భవనంలో పెట్టిన పెద్ద హోటలు అక్కడికి చాలా దగ్గిర. కాని, మహాకవి తన అల్లిక సంచీ బుజానికి తగిలించుకుని ముందుగా సుకృతి కుటీరాన్ని గురించే వాకబు చేశాడు. తన నాతడు అతిథిగా ఆదరిస్తాడనే విశ్వాసం ఎలాగో మహాకవికి ఏర్పడింది.

ఆ కుటీరం దగ్గరకు వచ్చే సరికి, ఆ జ్ఞాన వయో వృద్ధుడైన సుకృతి వాకిట్లో ఒక బల్ల మీద కూచుని, ఒక లావు పుస్తకం విప్పి చదువుతూ, మధ్యలో ఆపిన పేజీ దగ్గర వేలు పెట్టి మూసి, కొంత సేపు తదేక ధ్యానంతో ఎదురుగా ఉన్న మహా శిలాముఖం వంక చూస్తూ ఉండడం మహాకవి చూశాడు.

"మహాశయా! నే నొక యాత్రికుణ్ణి. ఈ రాత్రికి నాకు ఆశ్రయ మీయగలరా?" అని సవినయంగా కోరాడు.

"తప్పకుండా! దయచేయండి బాబూ! ఓహో! మహాశిలా ముఖ స్వామి ఒక నూతన వ్యక్తి వంక ఇంత సాదరంగా చూడడం ఇంతవరకూ నేను ఎన్నడూ ఎరుగను" అంటూ ఆయనను ఆహ్వానించాడు సుకృతి.

మహాకవి ఆ బల్లమీదే సుకృతి ప్రక్కగా కూచున్నాడు. ఆపైన వారిద్దరికీ దీర్ఘమైన సంభాషణ జరిగింది. మహాకవి చమ

త్కారంగా, ఉదాత్తంగా ప్రసంగించ గల ప్రతిభావంతు లెందరినో చూశాడు. కాని, సుకృతి వంటి మధుర వాక్కు మాత్రం అతనికి ఎక్కడా కనిపించలేదు. సహజంగా, అప్రయత్నంగా సుకృతి నోట వెలువడే ఉదాత్త భావాలు, సూక్తులు మహాకవిని ఆశ్చర్య నిమగ్నుణ్ణి చేసినయి. తేట మాటలలో సూటిగా చెప్పడం వల్ల మహా సత్యాలు సైతం అతి సులభంగా బోధపరచ గలుగుతున్నాడు, సుకృతి. అతడు పని పాటులు చేసుకునే టప్పుడు దేవతలు వచ్చి ఆ పనిలో అతనికి సహాయ పడుతూ ఉంటారనీ, శీతకాలంలో అతడు ఇంట్లో కూచుని చలికాగే టప్పుడు దేవతలు వచ్చి అతనితో పాటుగా కుంపటిచుట్టూ కూచుంటారనీ కూడా, ఆ చుట్టుపక్కల అంతా చెప్పుకుంటూ ఉంటారు. ఈ విధంగా దేవతల మధ్య, వారికి ప్రియతముడుగా మెలగుతూ ఉండడం వలన, వారి భావాలలోని సౌకుమార్యం, దివ్యత్వం ఇతనికి కూడా అలవడినవి. ఆ అమర సత్యాలను అతడు సామాన్యులకు సులభంగా బోధపడే సరళభాషలో వివరిస్తున్నాడు; సుకృతి నిర్మల మనస్సులో నుండి వెలువడే సజీవ శబ్ద చిత్రాలను చూచి మహాకవి పరవశుడయి పోతున్నాడు. ఆ పద చిత్రాలలోని సుందర సూక్తులు ఆ కుటీర ప్రాంగణాన్ని తత్పరిసర ప్రాంత వాతావరణాన్ని నింపివేసి, అతని అమితాహ్లాదానికీ, మనోహర భావనా పరంపరకూ హేతు వయింది. ఈ ఉభయుల పరస్పర సౌహార్ద సహానుభూతులూ విడివిడిగా ఎవరికి వారు సాధింప జాలని ప్రగాఢ భావనాశక్తిని వారికి ప్రసాదించి

నయి. ఉభయుల హృదయాలూ ఏక శ్రుతిలో లీనమై, ఇద్దరిలో ఎవరూ కేవలం తనది అనుకొనడానికి గాని, అందులో ఫలానా భాగం తనది అనుకొనడానికి గాని వీలులేని అద్భుత అపూర్వ సంగీతాన్ని సృష్టించినయి. వారు ఒకరిని ఒకరు తమ తమ ఉన్నత భావనా మహా సౌధాలలోనికి గొనిపోయి చూపు కొన్నారు. అంత వరకూ తాము కూడా ఎన్నడూ చూచి ఎరుగనివీ, — చూచిన మీదట సర్వదా అక్కడే గడపాలనే మమకారం వారికి కల్పించ గలిగినవీ అయిన అందమైన అవ్యక్త గుప్త కోణాలను కూడా వారు ఒండొరులకు వ్యక్తం చేసుకున్నారు. సుకృతి ఆసక్తితో మహాకవి ప్రసంగాన్ని వింటూన్న సమయంలో మహా శిలాముఖం కూడా శ్రద్ధగా వింటూన్నట్టు ఆయన గ్రహించాడు. కనులెత్తి సగౌరవంగా, మిలమిల మెరిసే మహాకవి నేత్రాలలోకి చూశాడు, సుకృతి.

"మహానుభావా! తమ రెవరు? నా ఆతిథ్యం స్వీకరించి నన్ను ఉద్ధరిండానికి వచ్చిన తమ రెవరో దయచేసి నాకు చెపుతారా?" అంటూ ఆవేశంతో ప్రశ్నించాడు,

మహాకవి తన వ్రేలితో సుకృతి చేతిలో ఉన్న పుస్తకాన్ని చూపిస్తూ, తమ రా గీతాలు చదివే ఉంటారు. అందువల్ల మీరు నన్ను ఇదివరకే ఎరుగుదురు. ఆ గ్రంథం రచించిన కవిని నేను," అన్నాడు.

మరోసారి, ఇదివరకు కన్న ఇంకా శ్రద్ధగా మహాకవి ముఖాన్ని పరిశీలించాడు సుకృతి. వెంటనే మహా శిలాముఖం వంకకు

తిరిగాడు; మళ్ళీ అనిశ్చిత దృక్కులతో తన అతిథి వేపు తిరిగాడు. ఈ పర్యాయం ఆయన ముఖం వాలిపోయింది. నిస్పృహతో నిట్టూర్చాడు.

"ఏమిటి అంత విచారం?" అన్నాడు మహాకవి.

మా సనాతన జోస్యంలో వివరించిన మహాపురుషుని కోసం నేను నా జీవిత మంతా నిరీక్షిస్తూ వస్తున్నాను. ఈ పద్యాలు చదివినప్పుడల్లా, మీ దర్శనం చేస్తే నా నిరీక్షణ పూర్తి అవుతుంది, అనే ఆశ కలుగుతూ ఉండేది," అని జవాబు చెప్పాడు సుకృతి.

మహాకవి వెంటనే అందుకుని, లీలగా చిరునవ్వుతూ, "ఆ మహా శిలాముఖం లోని పోలికలు నా ముఖంలో ఉంటాయని మీ రాశించారన్న మాట! వెనుక, బంగారుతండ్రి, వజ్రహృదయుడు, సనాతన శిలాముఖుల వలెనే నేనూ మీకు తీవ్రాశాభంగం కలిగించాను; నా దురదృష్టం. నన్ను కూడా మీ రా "మహా పురుషుల" పట్టికలో చేర్చడం, నావలన కూడా మరొక సారి మీకు ఆశాభంగం కలగడం వాస్తవంగా నా దురదృష్టం. మహాశయా! సుకృతీ! సిగ్గుతో, సంతాపంతో నే నీ విషయం మీకు మనవి చేసుకుంటున్నాను. కరుణాళువైన ఆ దివ్య శిలాముఖునితో పోల్చదగిన అర్హత లేశం కూడా నాకు లేదు."

"ఎందుచేత?" అన్నాడు సుకృతి, తన చేతిలోని పుస్తకాన్ని ఎత్తి చూపిస్తూ, "ఈ భావాలు అమర భావాలు కావంటారా?"

"వాటికి దివ్య భావాల పోలికలు మాత్రం ఉన్నాయి. దూరం నించి వినిపించే ఏదో అమరగీతానికి ప్రతిధ్వనులు మాత్రమే వాటిలో మీకు వినిపిస్తాయి. కాని, మహాశయా! ఏం చెప్పను? నా జీవితానికీ నా భావాలకూ శృతి కలవలేదు. వెనక ఒకప్పుడు నేను దివ్యమైన కలలేవో కన్నాను. అవన్నీ అప్పటికీ, ఇప్పటికీ కలలుగానే మిగిలిపోయినయి. దానికి కారణం: నేను స్వచ్ఛందంగానే అనుకోండి,-నీచమైన స్థూల సత్యాల నడుమ బ్రతుకుతూ ఉండడమే అనుకుంటాను. ఇంకొక విషయం కూడా మీకు మనసు విప్పి చెప్పేస్తున్నాను. ప్రకృతిలోను మానవ జీవితంలోను అపూర్వమైన ఉదాత్తతను, సౌందర్యాన్ని, సౌకుమార్యాన్ని నా రచనలు ఆవిష్కరిస్తున్నవని అంతా అంటూ ఉంటారు. కాని, ఒక్కొక్కప్పుడు నాకే వాటిలో విశ్వాసం లేకుండా పోతూంది. అలాంటి నాలో ఆ దివ్యమూర్తి పోలికలు చూడడానికి, స్వచ్ఛమైన ఉదాత్త సత్యాన్వేషకులయిన మీ రెందుకు ప్రయత్నిస్తారు?"

మహాకవి విషణ్ణ వదనంతో, అశ్రు పూర్ణ లోచనములతో, గద్గద స్వరంతో ఈ మాటలు చెప్పాడు. అదే స్థితిలో ఉన్నాడు సుకృతి.

ప్రతిదినం సూర్యాస్తమయ వేళ సుకృతి ఆ చుట్టు ప్రక్కల ప్రజలంతా చేరిన బహిరంగ సమావేశంలో ఏదో ఒక మంచి విషయాన్ని గురించి ప్రసంగిస్తూ ఉండడం మామూలు. ఆనాడు అయనా,

మహాకవి లేచి, ఒకరి చేయి ఒకరు పట్టుకుని, అలా మాట్లాడు కుంటూనే ఆ సభాస్థలం దగ్గరకు వచ్చారు. ఆ ప్రదేశం కొండల మధ్య ఒక మూలగా ఉన్న ప్రశాంత స్థలం. దానికి ఒక వైపున ఒక కొండ నిలువునా నరికినట్టు నిటారుగా ఉంది. దాని ముందు నానా విధాల అడవి లతలు అల్లి బిల్లిగ అల్లుకుని రంగు రంగుల పూలతో ఆ సమావేశ స్థలాన్ని ప్రకృతి స్వయంగా తుంచని పూల రెమ్మల తోరణాలతో మనోహరంగా అలంకరించినట్టు ఉంది. ఆ కొండ దరిని కొంచెం ఎత్తైన చోట చుట్టూ ఆ లత లల్లుకొని ఉన్న చిన్న గుహ ఒకటి ఉంది. ఆ గుహా ముఖద్వారంలో ఒక మనిషి నిలబడి, ఆంతరంగిక సహజ ప్రేరణలకు అనుగుణమైన అభిన యంతో ఉపన్యసించడానికి తగినంత స్థలం మాత్రం ఉంది. ప్రకృతే స్వయంగా నిర్మించిన ఈ వేదిక ఎక్కి నిలబడి సుకృతి తన స్వభావ సిద్ధమైన సుపరిచిత కారుణ్య దృష్టితో ప్రేక్షకు లందరినీ ఒక్కసారి మౌన కుశలప్రశ్న చేశాడు. వారంతా వరసగా సభక్తికాభివంద నాలతో ఆయనకు జవాబు చెప్పి, పచ్చని తివాసిలాగ ఉన్న పచ్చ గడ్డి మీద వారి వారికి అనుకూలమైన విధంగా ఆసీను లయారు. కొందరు వారికి వెనుకగా నిలబడే ఉన్నారు. అస్తమయ సూర్యుని చరమ కిరణాలు వాలుగా వారి ముఖాలమీద పడి ఆ సనాతన వృక్షాల ఆకుల సందుల గుండా బంగారు శలాకలలాగ దూసుకొని వచ్చి, ఆ వృక్షచ్ఛాయల ప్రశాంత గాంభీర్యాన్ని రాగ రంజితం చేస్తున్నాయి. కొంచెం పక్కకి చూస్తే ఎదురుగా మహా శిలా

ముఖం అదే మందహాస రేఖతో, గాంభీర్య కారుణ్యా రాశిగా కనిపిస్తూంది.

సుకృతి ఉపన్యాసం ప్రారంభించారు. అనగా ఆ సమయంలో తన హృదయంతో, మనస్సులో ఉన్న దానిని ఉన్నట్లు వారికి తెలుపుతున్నాడు. ఆయన మాటలన్నీ ఆయన భావాలతో సామరస్యం గలవి అవడంవలన జీవశక్తితో స్పందిస్తున్నాయి. ఆయన భావాలన్నీ ఆయన అనుదిన జీవితంతో సామరస్యం గలవి అవడం వలన, సత్య సంశోభితము లయి పరమార్థ బోధకా లవుతున్నాయి. నోట వెలువడేవి మామూలు మాటలూ, వాక్యాలూ కావు. వేడిగా, వాడిగా చైతన్యంతో వెలుగొందే ప్రాణులు. ఆ అద్భుత శబ్దచిత్రాలలో అమూల్యమయిన ముక్తా ఫలాలు పొదగబడి ఉన్నాయి. మహాకవి ఆ ఉపన్యాసాన్ని శ్రద్ధగా వింటున్నాడు. సుకృతి జీవితము, అయన సౌశీల్యము తానెన్నడూ భావించి యెరుగనంతగా ఉదాత్తమైన కవితా సంపన్నమైన వనుకున్నాడు. ఆయన నయనాల్లో రెండానంద బాష్ప బిందువులు తళతళ మెరుస్తున్నాయి. భక్తి భావ పూర్ణమైన నేత్రాలతో ఆ సాధు పుంగవుని వంకే చూస్తున్నాడు. దివ్య పురుషుల యశః పరివేషంలాగ ఉన్న నెరిసిన జుట్టులో, మధుర భావ బంధురమైన సాధువదనంలో మహా యోగులకు, ప్రవక్తలకు సహజమైన దివ్యతేజస్సు ఉన్నది అనుకున్నాడు. దూరాన సాయం సంధ్యా కాంతులలో మిలమిల లాడుతూ ఎదురుగా

కనిపిస్తూన్న మహా శిలాముఖం చుట్టూ అలముకొన్న పొగమంచు మబ్బులు సుకృతి పలిత కేశాలను తలపుకి తెస్తున్నాయి. ఆ దివ్య వదనంలోని గంభీర కారుణ్యభావం జగత్తునంతా ప్రేమతో ఆలింగనం చేసుకుంటున్నట్టుంది.

మహాకవి తనలో పొడసూపిన ఈ భావాన్ని వాచా ప్రకటించ బోతూన్న ఆ క్షణంలోనే సుకృతి ముఖం అద్భుత దివ్య తేజస్సుతో, గాంభీర్య కారుణ్య భావాలతో మెరిసిపోతూంది. అది చూసి మహాకవి పరవశుడై, ఆనందంతో చేతులు పైకెత్తి, "అడుగో! అడుగో చూడండి! చూడండి! ఆయనే మహా శిలాముఖుడు!" అని అరిచాడు.

అంతా ఆశ్చర్యంతో సుకృతి వంక చూసి, నిశితదృష్టి కలిగిన మహాకవి చెప్పినమాట యథార్థ మన్న సంగతి గ్రహించారు. ప్రాచీన జోస్యం ఫలించింది. సుకృతి ఆ సాయంకాలపు ప్రసంగం పూర్తి చేసిన తరువాత వేదిక మీదనించి దిగి వచ్చి మహాకవి చెయ్యి పట్టుకుని మెల్లగా తన కుటీరం వంకకు నడిచి పోతున్నాడు. మహా శిలాముఖాన్ని బోలిన మహామహుం డెవడో భవిష్యత్తులో ఉదయించ గలడనే అప్పటికీ ఆ పుణ్య పురుషుని విశ్వాసం.



# బొండాం మిరి

★

జేమ్స్ స్టీవెన్స్

★

పాల్ బనియన్ ఆదిమ వలస గ్రామం నవ్వుల నది ప్రాంతంలో ఉంది. విశాలమైన గొప్ప మైదానంలో ఎండలో మిల మిల మెరిసే ఈ నదికీ, పూలగుత్తులతో నిండిన తేనెవాగు గట్టుకీ మధ్యగా ఉంది ఆ గ్రామం. సూర్యుడు పడమటి దిశకు దిగిపోయి నప్పుడు ఆ చేరువనే ఉన్న కలకండ కొండ నీడ ఆ గ్రామం మీద పడుతుంది. వెచ్చని గాలుల వేసవి రోజులలో ఆ పొగమంచు రంగు కొండ చూడ ముచ్చటగా కనిపిస్తూంటుంది. రాత్రివేళ ఆ పర్వతం తెల్లని ఐస్‌క్రీంతో నిండిన ఒక పెద్ద గిన్నెలాగ కనిపి

స్తుంది. దిగువ వరసను ఆ కొండ చరియల నిండా సీమరేగి చెట్లు దట్టంగా పెరిగినయి. జూన్ నెల ప్రాంతంలో ఆ చెట్ల నిండా ఆపిల్ పండ్లంతేసి పళ్లు గుత్తులు గుత్తులుగా వ్రేలాడు తూంటయి. ఆ చెట్ల మధ్య కొబ్బరి పాలలాంటి జలం నిరంతరా ప్రవహిస్తూండే నీటి బుగ్గ లనేకం ఉన్నాయి. వాటి నీరు అప్పు డప్పుడే పూత పడుతూన్న కొండమల్లె పొదల సందునించి జలజల చప్పుడు చేస్తూ దిగువ నున్న నవ్వేల నది దిక్కుగా వాకలు వాకలుగా ప్రవహించి పోతుంది. పళ్లు పండే ఋతువులో ఉభయ సంధ్యా సమయాలలో ఆ సీమరేగి చెట్లలో గూళ్లు కట్టుకున్న చిల కలూ, గోరువంకలూ ఆలపించే మనోహర సంగీతం మృదువైన, రసవంతమైన బృందగానంగా పరిణమిస్తుంది. కొండ మల్లె పొద లలో కాపురం ఉన్న కీచురాళ్ళ సన్నని ఈలలతో శృతి కలిసి, ఆ శకుంత సంగీతం, సాయం సంధ్యా శోభకు పూర్తిగా అనుగుణ మైన శబ్ద సౌందర్యాన్ని సంతరిస్తుంది.

ఆ ప్రాచీన గ్రామం ఒక గంగిరేణి చెట్ల తోపు మధ్య ఉంది. వెనక ఒకసారి ఏడు సంవత్సరాల పాటు ఆ గ్రామాన్ని పాడు పెట్టారు. అందువల్ల తుంగ దుబ్బులు మొలిచిన ఏవో కొన్ని ఇళ్లు మాత్రమే మిగిలి ఉన్నయి. బాగా ఎత్తు పల్లాలుగా ఉన్న ఒక స్థలం వెనుకటి భోజన శాలా భవనం ఉన్న స్థానానికి గుర్తు. పూర్వం వేలకొద్దీ నాడాల బూడ్సుల తొక్కిడికి లోనయిన అక్కడి పుంతలలో ఇప్పుడు ఎత్తుగా తుంగ గడ్డి మొలిచింది.

పాల్ బనియన్‌కి పొలాల్లో సర్వం పండేది. పంట చేల మీద అజమాయిషీ అంతా జాన్ షీర్స్‌ది. తేనెవాగు క్రింద సాగయ్యే సారవంతమైన పల్లపు భూములు మొదలు పక్కనున్న కొండల మీదికి మైళ్ళ కొలది విస్తరించిన భూములన్నీ ఆయన వ్యవసాయ క్షేత్రంలో చేరినవే! ఆ కొండ శిఖరాల మీద, చరియల మీద ఎర్రని పెద్ద జనపపూల గుత్తులు జూన్‌నెలలో చల్లగాలికి మెల్లగా తలలూస్తూ, వొయ్యారా లొలక బోస్తూ ఉంటయి. ఏ టేట శీతకాలంలో బూమ్, బిల్ అనే రెండు హుషారైన తేనెటీగలు ఆ పువ్వులలోంచి తేనె తీసుకుపోయి కలప పారిశ్రామికుల వేడి రొట్టెల మీదికి సరిపోయేటట్టుగా తమ ముప్ఫయ్యైదు వందల గదుల నిండా నింపిన తరువాత, జాన్ షీర్స్ ఆయన పాలేళ్లూ ఆ జనుము అంతా కోసి మోపులు కట్టి జాగ్రత్త చేసేవారు. ఆ పైన మళ్ళీ శీత కాలం వచ్చేవరకు పాడి పశువుల్ని ఆ చేలలోకి తోలి,అక్కడ కోయగా మిగిలిఉన్న దంట్లు మేపుతారు. ఇప్పటిలాగ ఆ రోజుల్లో ఆవులకు పెద్ద పెద్ద పేర్లు పెట్టే వాళ్ళు కారు. బాగా పాలిచ్చే ఆవులకి సూక్, బాస్, బాల్డీ, సుమస్తి అంటూ చిన్న చిన్న పేర్లు మాత్రం పెట్టు కున్నారు. బాస్ మంచి తరిగల గొడ్డు .దాని పాలలో వెన్న బాగా అవుతుంది. జాన్ షీర్స్ దాని పాలలో చిటికెడు ఉప్పు వేసి కలిపి, కొంత సేపు ఆ పాలను కదలకుండా ఉంచే సరికి, ఒకటో రకమైన వెన్న పీసెలకొద్దీ దిగుబడి అయే గట్టి విరుగుడు తయా రవుతుంది. సూక్ పాలు కోవా బిళ్లలు తయారు చెయ్యడానికి

పెట్టింది పేరు. బాల్డీ పాలు ఎన్నడూ పులిసి పోవడం అంటూ జరగనే జరగదు, సరికదా దాని మీగడ అద్భుతమైన రుచి. సుమంతీ పాలు ఈ ప్రత్యేకతలు ఏవీ లేని నాసిరకం. అయితే దానికి "బాల్ శామ్" చెట్ల ఆకులంటే అమితమైన ఇష్టం. శీతకాలం ఆ ఆకులన్నీ తెగ మేసేది. అందువల్ల దాని పాలు దగ్గులకు అమోఘమైన ఔషధం అని పేరు వచ్చింది. పాల్ బనియన్ కలప కోత పని వాళ్లెందరో నెమోనియా జ్వరాలనించి బ్రతికి వయట పడడానికి ఆ పాలే సంజీవిలాగ పని చేసినయి. "పాట్, మైక్" జాతులకు చెందిన టర్కీ పందెపు కోళ్లు మొదలుకొని రకరకాల కోళ్ల మందలు అక్కడ దినదినాభివృద్ధి చెందుతూ, గ్రుడ్లు పెట్టడంలోనూ, పొదగ డంలోనూ, అద్భుతావహమైన అపూర్వ ఫలితాలను సాధిస్తున్నాయి. ఉదాహరణకు: అక్కడి మంచు కోళ్లు శీతకాలంలోనే మంచులో గూళ్లు కట్టుకొని ఉడకబెట్టినట్లుగా బహు గట్టిగా ఉండే పసందైన గ్రుడ్లు పెడుతున్నాయి.

ఇక దిగువ పల్లపు భూములలో పెద్ద పెద్ద కాయగూరల తోటలు ఉన్నాయి. వాటిలో పార్స్నిప్ దుంపలు, కారట్ దుంపలు అద్భుతంగా పండుతాయి. అవిభూమిలో బాగా బొద్దుగా లోతుగా ఊరడంవల్ల వాటిని బయటికి తియ్యడానికి పాలేళ్లు పెద్ద పెద్ద గడ్డ పలుగులతో త్రవ్వవలసి వస్తూంది. అక్కడ సామాన్యంగా పండిన ఒక చిన్న కాబేజి మడిలో పువ్వు కొయ్యడానికి ఇద్దరు మనుష్యులు

గంటన్నరకు పైగా పని చేయవలసి వస్తూంది. బంగాళా దుంప బాగా ఏపుగా పెరుగుతూండడం వల్ల వాటిని త్రవ్వి తీయడానికి పాల్ బనియన్ ఆవిరితో పనిచేసే త్రవ్వకపు యంత్ర మొకటి కనిపెట్టి జాన్ షీర్స్‌కి ఇచ్చాడు. నమిలే పొగాకు పండే చేలలో పొగాకు దొంతరలు దొంతరలుగా, దుబ్బులు దుబ్బులుగా పెరుగుతూండడమే కాక, ఆ నేలలో సహజంగా ఉన్న "లికోరిస్" వల్ల ఆ తంబాకుకు అద్భుతమైన ప్రత్యేకపు రుచి ఒకటి ఏర్పడింది.

ఈ విధంగా పాల్ బనియన్ వ్యవసాయ క్షేత్రంలోని అద్భుతమైన విశేషాలను, వింతలను వివరించ దలుచుకుంటే ఎన్ని పేజీలైనా చాలవు.

ఇటీవల ఐదేళ్లుగా పాల్ బనియన్ తన వ్యవసాయ క్షేత్రానికి గాని, స్వగ్రామానికి గాని ఒక్కసారి కూడా రాలేదు. "స్వయంగా ఆయనకు వ్యవసాయాన్ని గురించి ఏమీ తెలియదు. ఆయనకు కలప వ్యాపారంమీద ఉన్న మక్కువ మరి దేనిమీదా లేదు. అందువల్ల తాను స్వగ్రామాన్నించి వెళ్ళేటప్పుడు వ్యవసాయ మంతా పూర్తిగా జాన్ షీర్స్‌కి అప్పగించేశాడు. మత ధర్మాలలో విశేష విశ్వాసం గల ఆ వ్యవసాయ నిపుణుడి మీద ఆయనకు అలాంటి నమ్మకం కుదిరింది. అయితే షీర్స్ మత విశ్వాసాలు మరీ ఛాందసరూపం దాల్చడం వల్ల అడవి కలప వ్యాపారంలో ఏ మాత్రం అతడు రాణించలేక పోయాడు. కలపకోత పనివాళ్ళకు

మత ప్రబోధాలు వినడమంటే చిరాకు. జాన్ షీర్స్ మాత్రం వాళు వచ్చినా సరే ప్రతిదినం భోజన సమయాల్లో మత ప్రబోధోపన్యా సాలు మానేవాడు కాడు. అయితే, వ్యవసాయ క్షేత్రాలలోని పాలేళ్లను మాత్రం ఆయన అతి చాకచక్యంతో సముదాయించుకు రాగలడు. వాళ్లు కూడా కలప కోతకు పనికిరాక వ్యయసాయ వృత్తి చేపట్టిన వారు. సేద్యపు పాలేళ్ళు సహజమయిన అమాయి కత ముందు పుట్టి వాళ్ళు తరువాత పుట్టినట్టు ఉంటారు. తనను మహా ప్రవక్తను లాగ గౌరవించడం ఆయన వారికి సులభంగా నేర్పగలిగాడు. ఆయన కోసం వాళ్లు సంతోషంగా రోజుకి పదహారు గంటల కాలం కష్టించి పని చేస్తారు. కలప పనివాళ్ళు పన్నెండు గంటలకు మించి అరిచి గీపెట్టినా పనిచెయ్యరు.

పాల్ బనియన్ వెళ్ళిపోయిన తరువాత జాన్ షీర్స్ అత్యంత విశ్వాస పాత్రుడై ఆతని వ్యవసాయ క్షేత్రాన్ని ఎంతో అభివృద్ధి చేశాడు. పంట అపరిమితంగా పెరిగిపోయింది. "షాగ్రైన్ బిల్" తాలూకు కూలీల జట్లన్నీ ఎడతెగకుండా పని చేసినా ఆ వ్యవ సాయ క్షేత్రంలోని పంటనూ, గడ్డినీ అక్కడికి దూరాన ఉన్న కలపకోత కర్మాగారానికి చేరవేయలేక పోతున్నాయి. అవి పూర్తి అయితే కాని, మళ్లీ మామూలు వ్యవసాయపు పనులు సాగవు. ఇందువల్ల తన పాలేళ్ళకు పంటల రోజుల్లో కూడా రోజుకి పద్నా లుగు గంటలకంటె పని ఉండడం లేదు. అమితమైన పని పిచ్చి

గల జాన్ షీర్స్‌కి ఇది ఎంత మాత్రం నచ్చలేదు. వ్యవసా యాభివృద్ధిని సాధించడానికి ఉపకరించగల పెద్ద పెద్ద నీటి పారు దల ప్రణాళికలను గురించి, అడవులను చదును చేసే కార్యక్రమాలను గురించి ఆయన ఊహా మనోహర స్వప్నాలు కంటూ ఉంటాడు. పాల్ బనియన్ కలపకోత పనివాళ్ళంతా వచ్చి పంట కాలువలు త్రవ్వుతూ, అడివి చెట్ల మోళ్ళను పెకలించి వేస్తూ, మిట్ట పల్లాలు గల భూములను చదునుచేసి పంట మడులు తయారుచేస్తూ ఉండే శుభ దినాన్నిగూర్చి ఆయన కలలు కనేవాడు. క్రమంగా ఈ కలలు విస్పష్ట భావాలుగా, ఆశయాలుగా మారినయి. ఒకవేళ కలపకోత పనిని నిషేధిస్తే, రద్దుచేస్తే, అసలు పూర్తిగా తుడిచిపెడితే, ఏం జరుగు తుంది? కలపకోత పని వాళ్ళంతా, గత్యంతరం లేక పాలికాపులుగా, పాలేళ్లుగా పని చేయవలసి వస్తుంది. కావాలన్నా వారికి మరో పని దొరకదు. అప్పుడు . తాను, అంటే జాన్ షీర్స్ సాటిలేని పెద్ద మోతుబరి రైతు అయిపోతాడు. పాల్ బనియన్ పేరు ప్రతిష్ఠలు, గౌరవం అంతా అప్పుడు తనకు వచ్చేస్తుంది. పాల్ బనియన్ తనకన్న తక్కువవాడై పోతాడు. జాగ్రదవస్థలోనూ నిద్రావస్థ లోనూ కూడా ఈభావాలు ఆయనను క్షణం కూడా వదిలి పెట్టడం లేదు. అనేక ప్రణాళికలకు ఇదేమూలం! ఫలితం మాత్రం మహా రాక్షసంగా పరిణమించింది.

జాన్ షీర్స్ పెద్ద ఎత్తే ఎత్తాడు. పాల్ బనియన్ కలప దుంగ లన్నిటినీ రేవు దగ్గరికి లాక్కువచ్చే బేట్ అనే కర్రెద్దు ఒకటి

ఉంది. అదే పాల్ బనియన్ కలప వ్యాపార మంతటికీ జీవగర్ర. అది లేకపోతే క్షణం అతనికి సాగదు. దానిని కడతేర్చేస్తే? పేట్ లేని కలప వ్యాపారం మబ్బులేని వాన. ఈ ఉపాయం బాగానే ఉందను కున్నాడు. ఇదే అతి ప్రతిభావంతమైన "విషపు కేరట్ పన్నాగానికి" దారి తీసింది.

కేరట్ కసవంటే బేబ్‌కి అమితమైన ఇష్టం. ఏటేట కేరట్ కసవు దండిగా పండించి కలపకోత ప్రాంతానికి పంపుతున్నాడు జాన్ షీర్స్. ఈ పన్నాగం అమలు జరిపే సంవత్సరం మాత్రం కేరట్ చేలో దుంపలు త్రవ్వి తీయక, భూమిలోనే వదిలివేసి, వాటిలోంచే విషపూరితమైన రెండవ పంట పండించాడు. ఇంకొక్క నెల రోజులలో వాటిని త్రవ్వి కలప కర్మాగారానికి పంపాలను కుంటున్నాడు షీర్స్. పంపితే, ఆ కర్రెద్దు వాటిని తింటుంది. వెంటనే చస్తుంది. అప్పు డిక తన ఆశయాన్ని సఫలం చేసుకొన డానికి ఆటంక మేమీ ఉండదు. తాను సాటిచేని మోతుబరి రైతయి పోతాడు.

బోండాం మీరీ అనే నౌకరు కుర్రవాడికి ఒక్కడికే జాన్ షీర్స్ తన ఈ పన్నాగాన్ని గురించి ఏమీ చెప్పలేదు. వాడు ప్రమాద కరుడనీ కాదు. విశ్వాసపాత్రుడు కాడనీ కాదు. కాని బొత్తుగా ఏ విధంగాను రాణింపుకి రాని అనామకుడూ? అప్రయోజ కుడూ వాడు: ఆ వ్యవసాయ క్షేత్ర ప్రాంతపు ప్రాణికోటిలో ఒక

మంచుకోడికి గల ప్రాధాన్యం కూడా వాడికి లేదు. వంటయింటి సరంబీ క్రింద కటికి రాళ్ళమీద పడి నిద్రపోతాడు. పాలేళ్ళతో కులాసాగా గడిపే అవకాశం వాడికి లేదు. వాణ్ణి గుద్ది, తన్ని, పరాచికా లాడేటప్పుడు తప్ప అసలు వాళ్లు వాణ్ణి గమనించే వారే కాదు. ఒకప్పుడు వాడి పేరు థామస్ ఓ మీరీ; వాడు ఐర్లండు దేశపు ఒక అనాథ బాలుడు; మంచి సరదా అయిన కలపకూలీ. పాల్ బనియన్ సువారంలో దొరుకుతూన్న పుష్టికరమైన భోజనమే వాణ్ణి చెడగొట్టి వేసింది. వాడు గుమ్మటం లాగ గుండ్రంగా ఏపుగా పెరిగి, బాగా కొవ్వెక్కి ఒక గొడ్డలి కూడా ఎత్తలేని స్థితికి వచ్చాడు. వాడికే వాడు ఒక గడ్డు సమస్యగా ఏర్పడేటంతగా వాడి బరువూ, వాడి చుట్టుకొలతా పెరిగిపోయినయి. వాడెప్పుడైనా క్రింద పడ్డాడా, వాణ్ణి మళ్ళీ పైకి లేవదీసేందుకు ఒక కలప కూలీ కనపడేదాకా అలాపొర్లు దండాలు పెట్టుకుంటూ పోవలసిందే! ఒక్కొక్కప్పుడు వాడు ప్రమాదకరంగా కూడా తయారయే వాడు. ఒకసారి ఒక కొండమీద నుంచి దొర్లుకుంటూ వచ్చి కొండ ఎక్కుతున్న కలప కూలీల గుంపుమీద తల్లక్రిందులుగా వచ్చి విరుచుకు పడ్డాడు. వాళ్ళలో ప్రతివాడూ పప్పు పప్పు అయిపోయాడు. ఆ గ్రామంలో గడియారపు గుమాస్తా పనీ, వైద్య వృత్తీ నిర్వహిస్తూన్న జానీ ఇంక్ స్లింగర్ ఆ రాత్రంతా వాళ్ళ విరిగిన ఎముకలను సరిచేసి కట్లు కట్టడంతో సదమదం అయాడు. ఈ దుస్సంఘటన జరిగిన తరువాత పాల్ బనియన్ వాణ్ణి జాన్ షీర్స్ దగ్గ

రికి తరిమేశాడు. కొత్త యజమాని అయిన ఆ రైతు ఆ క్షేత్రంలో అత్యంత నికృష్టమైన ఒక పనికి వాణ్ణి పురమాయించాడు; ఎంగిలి కంచాలు కడగడానికీ, పందులికి నీళ్ల పొయ్యడానికీ వాణ్ణి పెట్టాడు. బోండాం మీరీ చివరికి ఆ దుర్భరమైన దీనస్థితికి తల ఒగ్గి. యజమాని ఎంత క్రూరంగా తనను చూసినా, గాంభీర్యంతో కూడిన శాంత స్వభావంతో సర్వం సహించడానికి అలవాటు పడ్డాడు.

ఈ దురదృష్టదేవత గారాబు బిడ్డ పైకి ఒట్టి బోండాం లాగే ఉన్నా, వాడి ఆత్మ మాత్రం అపురూప మైనది. ఆ బ్రహ్మాండ మైన వ్యవసాయక్షేత్రం మీద పనిచేసే పనివాళ్ళందరిలోకీ వాడొక్కడే ఆ పరిసరాల్లోని గ్రామీణ సౌందర్యాన్ని ఆస్వాదించగల వాడు. రోజూ తన చాకిరీ పూర్తి కాగానే తల చక్కగా దువ్వుకుని, జనప పూల గుత్తి ఒకటి చేత పుచ్చుకుని, తన పెంపుడు అవిటి పందిపిల్ల "పోర్క్‌మ్స్"ను చంకను బెట్టుకొని తేనె వాగు మీది కాలివంతెన మీదా, ఆ వలస గ్రామం వీధుల్లోనూ పచార్లు చేస్తూ తన జీవితంలోని ఒకే ఒక చిన్న సుఖాన్ని అనుభవించే వాడు. ఒక పాత గంగిరేణి దుంగ మీద కూచుని - తాను బక్క-పల్చగా ఉన్నట్టూ, ఆ గ్రామం అంతటిలోను కండలు మెలితిరిగి ఉన్న తానే కలప కూలీలలో మొనగాడైనట్టూ, కలపవ్యాపారికి చాలా అభిమాన పాత్రులైన వారిలో తాను ఒకడైనట్టూ ఊహించుకునే వాడు. పశువుల కాపరులలోనూ తానే మొనగాడై ఆ

కర్రెద్దు నీడలో నడుస్తున్నట్టూ, అద్భుతంగా స్వేచ్ఛగా జీవితం గడుపుతున్నట్టూ భావించుకునేవాడు. అటువంటి భావనలవల్ల బోండాం మీరీకి ఎంత ఆనందం కలిగేదో చెప్పలేము! ఆ భావనలు చివరికి కరిగి పోవడం మాత్రం చాలా దురదృష్టకరం!! ఆ పగటి కల ముగియగానే, బోండాం మీరీ సాధారణంగా చాలా ధైర్యంగాను, సంతోషంగాను ఉండాలనే సర్వదా ప్రయత్నించేవాడు. కళ్ళలో తిరుగుతున్న నీళ్ళని ఆపుచేసుకునేవాడు. అప్పుడు అతన్ని ఉల్లాస పరచడానికి పోర్కుమ్ము కీచు కీచు మంటే, దానికేసి చూసి వణకు తున్న పెదిమెలతో మందహాసం చేసేవాడు. తరువాత ప్రేమగా అతని పాదాల చుట్టూ మూగే పాలపిట్టల వంక మెల్లగా తన దృష్టి మళ్ళించే వాడు. చివరికి మళ్ళీ వాస్తవమైన, అత్యంత క్రూరమైన తన నౌకరు జీవితంలోకి అతను దిగివచ్చే వాడు. అప్పుడు కూడా అతనికి జాన్ షీర్స్‌ని గూర్చి గాని, అతనిపాలేళ్ళను గూర్చి గాని, దయలోను, ఔదార్యంతోను కూడిన ఆలోచనలే వచ్చేవి.

ఒక సాయంత్రం - ఆ ప్రాచీనగ్రామంతో బోండాం మీరీ పగటి కలలు మామూలు కంటె కొంచెం జోరుగా సాగినయి. తాను చెట్లు కొట్టే పోటీలో మొదటివాడుగా గెలుపొందినట్టూ, పాల్ బనియన్ వాణ్ణి ప్రశంసించినట్టూ ఊహించుకున్నాడు.... పేళ్లు తుపాకీ గుళ్ళలాగా బలంగా పైకి లేచేట్టు వాడు గొడ్డలి పెట్టి కొడు తున్నాడు: కలప కూలీ లందరూ చుట్టూ గుమిగూడి హర్షధ్వా

నాలు చేస్తున్నారు. దెబ్బదెబ్బకీ బలంగా తాను గొడ్డలి విసురుతున్నాడు.... ఆ గంగిరేణి దుంగ మీదనుంచి తాను జారిపోతున్నట్టు వాడు చాలా ఆలస్యంగా గుర్తించాడు. నిస్సహాయంగా నేలమీదికి దొర్లిపోయాడు. ఎప్పటిలాగే వాడు తనంతట తాను మళ్లీ లేచి నిలబడలేక పోయాడు. కాలివంతెన దాకా అలా దొర్లుకుంటూ వెళ్ళాడు. కాని, అక్కడ ఆ వంతెన బద్దీల మధ్యనుంచి దొర్లుకుంటూ పోలేక పోయాడు. తెల్లవారే దాకా అలాగే పడి ఉన్నాడు; ఎటునుంచీ సహాయం రాలేదు. ఉదయం గడిచిపోయింది. అయినా, నిస్సహాయంగా అక్కడే పడి ఉన్నాడు. జాన్ షీర్స్ మధ్యాహ్న భోజనానికి ఇంటికి వచ్చి పొద్దుటి భోజనం తాలూకు ఎంగిలి కంచాలు కడగకుండా అలాగే పడి ఉండడం చూసినదాకా వాడి దగ్గరికి ఎవరూ రాలేదు.

"ఇది నువ్వు కావాలనే చేశావు. ఆఁ! నేను పందెం వేసి చెప్పగలను" కోపంగా అన్నాడు రైతు యజమాని. "ఆ కంచాలు కడగడం కోసమని గాని, లేకపోతేనా! ఇక్కడ ఇలాగే పడి ఉండి నువ్వు కుళ్ళిపోయేటట్టు చేసేవాణ్ణి! నీ గుడ్డెల్లాగూ పీకించి వేస్తాలే! చూస్తూ ఉండు. కిందినుంచి పైదాకా ఒకే మాంసపు కొండలాగ ఒళ్ళు నువ్వూను!"

"బాబ్బాబు! నన్ను కొట్టబోకు - షీర్స్ బాబూ!" బతిమిలాడుకున్నాడు బోండాం మీరీ. "నేను ఇంటిదాకా దొర్లుకుంటూ

వచ్చేయ్యాలనే ప్రయత్నించాను. నా సత్య ప్రమాణ పూర్తిగా ప్రయత్నించాను షీర్స్ బాబూ!"

ఆ రైతు యజమాని ఒక ఇనప సుత్తి లాంటిది పట్టుకొచ్చాడు.

"ఓహో!.... నీ ఇల్లు నేల గూల! - షీర్స్ బాబూ!!"

"అయితే తిట్లకు కూడా తెగించావన్న మాట! ఏం?"

"నేను 'నా' అనాలనే అనుకున్నాను షీర్స్ బాబూ! సత్య ప్రమాణ పూర్తిగా!"

"నేను ఒక్కనాటికి నమ్మను. నువ్వు "నీ" అనే మాటే వాడావు. కావాలని, నన్ను తిట్టాలనే నువ్వు ఆ మాట వాడావు."

"బాబోయ్! బాబోయ్! బాబోయ్!" ఒక్కొక్క దెబ్బ మీద పడుతున్నప్పుడల్లా బోండాం మీరీ పాపం! పెద్ద పెట్టున బొబ్బలు పెడుతున్నాడు. మధ్య మధ్య గంటకోసారి అయిదేసి నిమిషాలు విశ్రాంతి తీసుకుంటూ జాన్ షీర్స్ సూర్యాస్తమయం అయేదాకా వాణ్ణి అలా బాదుతూనే ఉన్నాడు....చివరికి బ్రహ్మాండమైన ఆఖరిదెబ్బ కొట్టడానికి ఆ సుత్తి పైకెత్తాడు; బోండాం మీరీ ధైర్యంతో పైకి వస్తున్న తన ఎక్కిలు దిగమింగి, ఆ దెబ్బని స్వీకరించడానికి తయారుగా ఉన్నాడు. అయితే ఆ క్రూరమైన

దెబ్బ ఎప్పటికీ అతని ఒంటిమీద పడనే లేదు. రెండు మాటలు దాన్ని ఆపివేసినయి.

"ఇదుగో! .......జాన్!"

ఆ మాటలు శాంతంగా పలికినట్టే కనిపించినయి. అయినా ఆ కంఠస్వరం ఆ వలస గ్రామపు మైదానాలన్నీ నిండి పోయి, చుట్టుపట్ల ఉన్న అన్ని కొండల్లోను ఉరుము ఉరిమినట్లు ప్రతిధ్వనించింది. చెట్లు వణకి పోయినయి. నవ్వులనది ఉపరితలం పెద్ద పెద్ద కెరటాలుగా చిట్లిపోయింది; ప్రాచీన కాలపు కలకండ కొండ చరియలమీద పెద్ద పెల్ల విరిగి క్రిందికి దొర్లుతున్నట్లు పెద్ద చప్పుడూ, ధూళీ రేగినయి. జాన్ షీర్స్ మాట్లాడకుండా తన ఇనుప గుదియను దించేశాడు. బోండాం మీరీ కళ్లు తెరచి, తన సమీపంలో ఏనుగు చర్మంతో కుట్టి ఉన్న బూట్ ఒకటి చూశాడు. అప్పుడు తలపైకెత్తి, దయతో నిండిన గడ్డంతో సర్వశక్తిమంతుడూ శాంత మూర్తీ అయిన పాల్ బనియన్ ముఖం ఎత్తుగా పైన ప్రకాశిస్తూ ఉండడం చూశాడు. వెంటనే హడావిడిగా జాన్ షీర్స్ వాణ్ణి లేవదీశాడు. వాడు తన రైతుయజమాని పాదాల ప్రక్కనుంచి కాలి వంతెన మీదుగా మెల్లగా జారుకున్నాడు. కొంత దూరం పోయి ఆగి వెనక్కి తిరిగి తన రాజు, తన నాయకుడు, ప్రభువు అయిన పాల్ బనియన్ వంక భక్తి ప్రపత్తులతో చూశాడు. ఆయన ఆ సమయంలో జాన్ షీర్స్‌తో గాఢంగా కరచాలనం చేస్తున్నాడు.

"మా పాలేళ్ళలో ఒకడితో వినోదంగా కాలక్షేపం చేస్తున్న సమయంలో తమరు దయచేస్తా రనుకో లేదండి" అన్నాడు జాక్ షీర్స్, పళ్ళికిలించడానికి ప్రయత్నిస్తూ. "కాని మీ కలప వ్యాపారుల లాగే అడపా దడపా ఎప్పుడైనా ఒకసారి ఇలా వినోదించడం నాకూ సరదాయేనండి!"

"నువ్వు ఖులాసాగా ఉండడం కూడా నేర్చుకున్నందుకు నాకు సంతోషంగా ఉంది జాక్!" అన్నాడు పాల్ బనియన్ మృదువుగా. "ఇలా హుషారుగా ఉండే లక్షణమే మా కలప వ్యాపారులకు చెప్పలేనన్ని కష్టాలూ, కడగండ్లూ ఎదుర్కోడానికి సహాయ పడుతూ వచ్చింది. మా పనివాళ్ల జట్టు బలే మంచి జట్టు. ఈ చుట్టు పట్ల ఏజట్టూ వాళ్ళముందు నిలువలేదు. వాళ్ళకి మళ్ళీ ఈ వలస గ్రామపు వాతావరణంలోని శాంతి సౌభాగ్యాలు అనుభవించే అవకాశం కల్పించాలని నేను అనుకుంటున్నాను. ఇందుకు తగినంత కారణం కూడా ఉందనుకో!......... ఈ నవ్వులనది ప్రాంతంలో మిగిలిన భాగంలోకూడా కలప కొట్టడం కోసమై మేము తిరిగి వస్తున్నాము."

"ఓహ్! ఇంకా చెప్పరేం? తమరు మళ్ళీ మా మధ్యకి వచ్చేస్తున్నారంటే నాకు ఎంత సంతోషంగా ఉందని, బనియన్ గారూ!" అన్నాడు జాన్ షీర్స్, తొందర తొందరగా.

"మంచిది - జాన్! నువ్వు నమ్మకంగా మాకు సేవ చేస్తున్నందుకు నిన్ను మేము చాలా మెచ్చుకుంటున్నాం. నీకు

తగిన బహుమతీ కూడా ఒకటి ఇవ్వాలని చూస్తున్నాం. క్రిందటి ఆకురాలు కాలంలో నువ్వు బేబ్‌కి మేతగా కేరట్ కసవు పడవ కెక్కించి పంపని అపరాధాన్ని మేము పట్టించుకోడం లేదు. ఈ ఒకే ఒక అపరాధానికి నిన్ను దండించ దలుచుకో లేదు. అయితే ఒకటి! బేబ్ కోసం వెంటనే నువ్వు ఎకరాల కొద్దీ కేరట్ గడ్డలు పండించాలి! తెలిసిందా?... సరే? ఇంక మేము వస్తాం!...అదిగో బేబ్!"

గడియారం గుమాస్తా జానీ ఇంక్ స్లింగర్, మేస్త్రి బిగ్ స్వీడ్ చెరో ప్రక్కనా పాల్ బనియన్‌ను అనుసరిస్తున్నారు. ఆ ముగ్గురూ గంగిరేణి బీడు వంకకు నడిచారు. అ కర్రెద్దు అంత వరకూ నదీ గర్భంలో పంగటించుకుంటూ నడిచి నడిచి, వంట ఇంటిని, పశువుల కోష్ఠాలను చక్రాల మీద తన వెనుక లాగు కుంటూ అప్పుడే ఆ బీడులో అడుగు పెడుతూంది. అది బాగా బక్క చిక్కి ఉంది. దట్టమైన బొచ్చుతో ఉన్న దాని నల్లని చర్మం క్రిందనుంచి దాని ప్రక్క ఎముకలు పైకి పొడుచు కొచ్చి కని పిస్తున్నయి. మలుసంజ నీడలలో నుంచి అది అలా నడచి పోతూంటే, పొగమంచు గుండా దూరానికి మెడతలు దేరిన ఒక మాయా మృగం లాగ కనిపిస్తూంది. ఒక అరగంట పాటు అలా వాళ్ళ కళ్ళ ముందు ఆ పశువుల కోష్ఠాలు కదిలి పోయినయి. అవి అమిత వేగంగా సాగి పోవడం వల్ల వాటి కిటికీలలో నుంచి కని పిస్తూన్న దీపాల వెలుగు ఒకే అవిచ్ఛిన్న కాంతి రేఖలాగ దూరానికి

కనిపించింది. ఆ కోష్టాలలో కూచుని ప్రయాణిస్తూన్న కలప కూలీలు "గ్యారీ కొండ" మీద దొరికే పండ్ల తాంద్రను గురించీ, యువ వీరుడు మనోర్రి మరణం గురించీ పదాలు పాడు తున్నారు. తారస్థాయిలో సాగుతున్న ఆ బృంద గానాలు వింటూ, బోండాం మీరీ అలాంటి నిజమైన కలప కూలీ జీవితం ఒక్క రోజు గడప గలిగితే, ఆ తర్వాత నిశ్చింతగా మరణించ వచ్చు అనుకున్నాడు. తాను కూడా ఒక కలప కూలీల జట్టులో దృఢమైన, గౌరవ నీయు డైన సభ్యుడుగాను, ఒక్క పల్చగా, ఉండేలు బద్దలాగ జవ్వున వంగే శరీరంతో ఒక చెట్లు కొట్టే మేస్త్రీ గాను, జీవిస్తూ, ఆ సమ యంతో ఆ కోష్ఠాలలో ఒక దానిలో ప్రయాణిస్తూంటే ఎంత బాగుండును! కాని, వట్టి అడియాస! దురదృష్ట వంతుడైన బోండాం మీరీ ఒక్క నిట్టూర్పుతో ఆ స్వప్నానికి తిలోదకా లిచ్చాడు.

అంతలో తనలో తనే ఏదో గొణుక్కుంటూ, నవ్వుకుంటూ వస్తూన్న జాన్ షీర్స్ బొంగురు గొంతు వాడికి వినిపించింది. బోండాం మీరీకి అప్పుడు కలిగిన ఆశ్చర్యానికి అంతు లేదు. అంతకు ముం దెన్నడూ తన యజమాని నవ్వుతూండగా వాడు చూడ లేదు.

"కేరట్ దుంపలు గదూ!" షీర్స్ తనలో తనే పెద్ద పెట్టున అరుచు కుంటూ వస్తున్నాడు. తమ వృషభ రాజానికి తత్క్షణం కేరట్ దుంపలు కావాలి అంటున్నారు, మా పాల్ గారు. అంతే గదూ?.... తస్సా దియ్యా!.... ఏం గమ్మత్తుగా ఉందిది?.... హ హ్హా హ్హా హ్హా!"

ఒక్క అంగలో తేనెవాగు దాటి వడి వడిగా ఆ రైతు యజమాని తమ ఇంటివేపు వస్తున్నాడు. ప్రతి వంద గజాలకూ ఒకసారి ఆగి, సంధి ప్రేలాపన పుట్టిన వాడిలాగ గొణుక్కుంటున్నాడు: "కేరట్ దుంపలు!.... ఔను!.... తస్సాదియ్యా - తన ఎద్దుని కారట్ దుంపలతో నేను కడుపుబ్బేట్టు మేపుతానని ఎలా నమ్మాడూ అంట!.... ఎవరైనా అడిగితే 'ఇది బనియన్ గారు స్వయంగా ఇచ్చిన తాఖీ దండి!' అంటాను .... హహ్హాహాహ్హా!.... బలే గమ్మత్తుగా ఉందిగదూ?...."

పాల్ బనియనూ, జానీ ఇంక్ స్లింగరూ, బిగ్ స్వీడూ కలిసి నవ్వులనది ప్రాంతంలోని మిగిలిన కలప పడవల మీద ఎక్కించే ఏర్పాట్లు చూస్తూంటే, కలప కూలీ లందరూ ఆ వలస గ్రామంలో వెనుక తా మనుభవించిన వినోద కార్య క్రమాలన్నీ మళ్లీ సాగించడంలో నిమగ్ను లయారు. పొద్దుటి పూట అక్కడి ప్రాచీనమైన కలకండ కొండ చల్లని చరియల మీద ఇష్టం వచ్చినట్లు చక్కర్లు కొట్టడం, కోరింత పళ్లూ, తుప్ప పళ్లూ గొంతు మోయా మెక్కడం, పాదరక్షలు క్రింద విడిచి, గంగిరేణి చెట్లకి ఎగబ్రాకడం, జనుప పూల మొక్కల మధ్య తందనా లాడడం — ఇదీ వారి కార్య క్రమం! ఇక - మధ్యాహ్నపు పూట - వాళ్ళందరూ తండాలు తండాలుగా ఈతలు కొట్ట డానికి దిగే సరికి నవ్వులనది నీళ్ళు మైళ్ళ పర్యంతం కలకలై పోయి, నురుసు తెట్టెలు కట్టేది! ఈతలు కొట్టడం అయిపోయిన తర్వాత ఆ కలప కూలీలు గట్టు మీద వరుసలు తీరి

నిలబడి, ఎడమ చెవుల్లోంచి నీళ్లోడ్చు కోడానికి కుడి కాళ్లా, కుడి చెవుల్లోంచి నీళ్లోడ్చు కోడానికి ఎడం కాళ్లా జాడిస్తారు. అటు తరు వాత నదిలో పువ్వుల చుట్టూ మూగే రంగు రంగుల 'వెన్న దాయి' చేపల కోసం గాలాలు పుచ్చుకు బయలు దేరుతారు. ఇక - వాళ్ల భోజనం ఎంత ఉల్లాస కరంగా ఉండేదో చెప్పలేం! అప్పుడే పొలా ల్లోంచి కొత్తగా పంట చేతికి వచ్చిన రోజులవి: వంట వాడు నవనీతరావు తుప్ప పళ్ల పొట్టి రొట్టె, రెండు పూట్లా కొరింద కాయల బజ్జీలు వాళ్ళ కోసం తయారుగా ఉంచుతారు. పళ్ళ రసం ఓడుతూ ఉండే ఆ పదార్థాలను కమ్మని పరిమళంతో కూడిన ఒకటో రకం మీగడలోను, మంచు పలకల మధ్యను పొదిపి ఉంచు తాడు. వంటింటి పెరడు అంతా నవనవలాడే కూరగాయల బళ్లతో కిట కిట లాడి పోతూంది. క్రొత్తగా పండిన గులాబీ రంగు బం గాళా దుంపలూ, ఎగి రెగిరి పడే పచ్చని బఠానీ గింజలూ కలిపి వండే కూరలోకి అవసరమైన మీగడ రసం అచ్చమైన మీగడ లోంచే తయారై, తియ్యగాను, చిక్కగాను ఉంటున్నది. ఆ కలప కూలీలు మళ్లీ హుషారైన చిలిపి పిల్లలుగా తయారయారు. అదృష్ట వశాత్తు - వ్యవసాయపు పాలేళ్లకు వీళ్ళంటే ఉన్న అసూయా భావం మాత్రం లవలేశం కూడా తమ ఆనందంలో ఈ కలప కూలీలకు స్ఫురణలో లేదు. పాపం! ఆ వ్యవసాయపు పాలేళ్ల రోజుకి 20 గంటల చొప్పున తేనెవాగుకి ఆవలి తట్టున కేరట్ దుంపలు త్రవ్వ వలసి వస్తూంది.

కర్రెద్దు బేబ్ కూడా వెనుక ఎన్నడూ లేనంత ఆనందంగా ఇప్పుడు ఆ వలస గ్రామ జీవితాన్ని ఆస్వాదిస్తూంది. కొబ్బరి పాల నీటి బుగ్గల నుంచి ప్రవహించి వచ్చే కాలవని ఒక తూము గుండా ఆ ఎద్దు నీళ్ళు త్రాగే తొట్టెలోకి మళ్ళించారు. చుట్టూ ఎక్కడ చూసినా అప్పుడే కోసిన జనుము కట్టలు కట్టలుగా పడి ఉంది. జాక్ షీర్స్ ఒక దురుద్దేశం మనసులో పెట్టుకుని పాల్ బనియన్ వచ్చిన మర్నాడే జనుమంతా కోయించేసి, బేబ్‌ని కట్టేసే కోష్ఠంలోను, ఆ పరిసరాలలోను ఆ కట్టలు పడేయించాడు. తన యజమాని కలప పడవల కెక్కించి, తిరిగి రాక మునుపే ఆ లేత కాపు జనుం గొంతు దాకా మేసి, ఆ కర్రెద్దు కాస్తా 'హరీ' అంటుందని పాపం, అతడు ఆశ పడ్డాడు. కాని, పంట పరువానికి రాక మునుపే అలా కోసి వేయడం వల్ల కలిగిన ఫలితం మాత్రం ఒక్కటే! ఆ జనుము పూల మీద విహరించే తేనె టీగలు రెండింటికీ విపరీతమైన కోపం వచ్చింది. ఇప్పుడవి తమ తేనె తెట్టులోనే బంధించ బడి ఉన్నాయి. సగం సగం నిండిన తమ తేనె పట్టు గదులు చూసుకుని అవి ఒళ్ళు తెలియని కోపంతో ఝుమ్మని ఒకటే విధంగా ప్రొద్దస్తమానం రొద చేస్తున్నాయి. బేబ్ మాత్రం ఆ లేత కాపు జనుము తిని తేలికగానే జీర్ణం చేసుకో గలిగింది. పై పెచ్చు - అది బలే రుచిగా కూడా ఉండడం వల్ల ప్రశాంతమైన దాని నల్లని కళ్ళలో ఆ రైతు యజమాని అంటే అనురాగం, కృతజ్ఞతా భావం వెల్లి విరిసినయి.

"ఇది రాళ్ళను కూడా తిని హరించు కునేట్టుంది - దీని తస్సల్ మందు!" అన్నాడు జాన్ షీర్స్ - నిరాశతోను, విసుగు తోను.

ఆ విధంగా ఆ ప్రయత్నం విఫల మవడంతో జాన్ షీర్స్ తన పాలేళ్లను మరీ తొందర చేసి, వాళ్ళ చేత కేరట్ చేలో రోజుకి 20 గంటలు పని చేయించడం మొదలు పెట్టాడు. తను కూడా నడుం కట్టి వాళ్ళతో పాటు పని చేస్తున్నాడు. ఎందుకంటే - పాల్ బనియనూ, ఇంక్ స్లింగరూ తిరిగి వచ్చారా, ఇక ఆ కర్రెద్దుకి విసపు కసవు పెట్టడం తనకు చస్తే అలవికాదు. ఆ సంగతి అతనికి బాగా తెలుసు, ఆస లప్పుడు అలాంటి ప్రయత్నం చేసే సాహసం తనకే ఉండదు. అందుచేత ఇదే సరియైన అదను. దేవుడు చల్లగా చూస్తే - ఈ ప్రయత్నంలో తాను విఫలుడు కాకూడదు మరి!

జాన్ షీర్స్ చేసిన గట్టి బందోబస్తు వల్ల ఈ వారం అంతా జోండాం మీరీని ఆ ఇంటి ఆవరణ దాటి బయటికె కదల నివ్వలేదు. వంటింట్లోనే చాకిరీ చేస్తూ పడి ఉండవలసి రావడంతో వాడి హృద యం నీరు కారి పోతూంది. గిన్నెలూ, పళ్ళాలూ కడిగే పని అంత దౌర్భాగ్యపు పనిగా వాడి కిది వరకెప్పుడూ అనిపించలేదు. ఎంగిలి కంచాలు వేణ్ణీళ్లతో కడుగుతూంటే వచ్చే ఆవిరీ, దుర్వాసనా లోగడ ఎప్పుడూ వాడి కంత రోత పుట్టించ లేదు. సాయంత్రపు

పూట పందుల్ని కడగడానికి బయటికి వెళ్ళినప్పుడు వాడి చెవులకు ఇప్పుడు పాల పిట్టల కలరవం వినపడడం లేదు; ఆ వలస గ్రామమంతా నిండిపోయిన కలప కూలీల నవ్వులూ, కేకలూ, కేరింతాలూ ఇవే సర్వదా వాడికి వినిపిస్తున్నయి. వచ్చే వారమే ఆ గ్రామంలో అద్భుతమైన కలప కొట్టే కార్యక్రమం ఆరంభ మవుతుంది. వేసవి అంతా ఆ దురదృష్ట వంతుడు నిరర్థకమైన పగటి కలలు కంటూ గడపవలసిన దుర్గతి పడుతుంది. అయినా పాపం! ఆ బోండాం మీరీ తన స్వప్నం నిజం అవుతుందేమో అనే ఆశ అలా పెంచుకుంటూనే వస్తున్నాడు.

అవాళ శనివారం; ఇక - కలప కూలీలకు ఆనందంగా గడపడానికి ఒక్కటే సెలవు రోజు మిగిలి ఉంది. పరవశత్వంతో నిండిన వాళ్ళ కంఠాలు వింటూన్న బోండాం మీరీకి పాటలతోనో, ఉల్లాస కరమైన ఊహలతోనో తన నైరాశ్యాన్ని పారద్రోలు కొనడం చేత కావడం లేదు. గంట గంటకీ వాడి ధైర్యం దిగజారిపోతూంది. వాడి ఆశా వాదం సడలిపోతూంది; దారుణ విషాద చ్ఛాయలతో వాడి మనస్సు చీకటి పడ్డట్టయింది. అవాళ వాడు వంటింట్లో సరంబీ క్రింద తన ప్రక్క మీద వెన్ను వాల్చగానే రోజూ లాగ గాఢమైన నిద్ర వాణ్ణి వరించలేదు. వాడి దైన్యం, వాడి నైరాశ్యం వాడికి కంటి మీద కునుకు లేకుండా చేసినయి. రెండు గంటల పాటు వాడలాగే పడుకుని, తన కన్నీటితో దిండంతా తడి

వేశాడు. అంతదాకా ప్రక్క గది నుంచి వినిపిస్తూన్న గుస గుస సంభాషణలన్నీ ఒక్కసారిగా ఆగిపోయినయి. కొంచెంసేపు నిశ్శబ్దంగా ఉన్న తరువాత జాన్ షీర్స్ ఒక చిన్న ఉపన్యాసం మొదలు పెట్టాడు. అతి భయంకరమైన తన పన్నాగం పూర్తిగా 'తన పాలేళ్ళకు ఆయన వివరించాడు. తన ఉద్యమంలో తనను బల పరచ వలసిందని వాళ్లను ఉద్బోధించాడు. ఆ ఉద్యమం తనది మాత్రమే కాదనీ, వాళ్లది కూడా అనీ స్పష్టం చేశాడు. కర్రెద్దుకు విషం పెట్టాలనీ, ఆ విధంగా కలప పరిశ్రమకు శాశ్వతంగా ఉద్వా సన చెప్పాలనీ తన యజమాని సంకల్పించి నట్టు బోండాం మీరీకి అర్థం కావడంతోనే భయ సంభ్రమాలతో ఒక్కసారిగా వాడు ఉలిక్కి పడ్డాడు. అలా ఉలిక్కి పడడంలో వాడి తల వెళ్లి ఆ సరంబీ క్రింది భాగానికి బలంగా ఠక్ మని కొట్టుకుంది. ఆ చప్పుడు వల్ల షీర్స్ ఉపన్యాసానికి అంతరాయం కలిగింది.

"మన బోండాం మీరీయే లెండి!" అన్నాడొక పాలేరు, అతి నిరసన భావంతో.

మళ్లీ షీర్స్ ఉపన్యాసం ఆరంభించిన తర్వాత బోండాం మీరీకి మళ్లీ కదిలి చప్పుడు చేసే సాహసం లేక పోయింది.

"....సరే! ఆ వృషభ రాజానికి ఈ రాత్రి విషం పెట్ట డానికి నిశ్చయించుకున్నా మన్న మాట!" అన్నాడు, జాన్ షీర్స్

తన ఉపన్యాసాన్ని ఉప సంహరిస్తూ. "క్రూరమైన ఈ కలప పరిశ్రమ ఇంతటితో సరి! కలప వర్తకం ఎందుచేత క్రూరమైనదంటే - అది మనుష్యుల్ని క్రూరులుగా తయారు చేస్తుంది. వ్యవసాయం చాలా మంచిది; ఎందు కంటే - అది మనుష్యుల్ని మంచి వాళ్లను చేస్తుంది. మన పాల్ బనియన్ గారూ, ఆయన కలప కూలీలూ వ్యవసాయ వృత్తిలోకి రాగానే వాళ్లూ మంచి వాళ్లయి పోతారు. అయితే ఒకటి! వాళ్ళ కంటె ముందు నుంచీ మనం రైతులము గాను, మంచి వాళ్ళము గాను ఉన్నాం గనుక, అప్పుడు వాళ్లు మనల్ని అనుసరించవలసి వస్తుంది. నిజానికి - ఒక నోరు లేని అమాయికపు జంతువుకి విషం పెట్టడం అంటే నాకు తగని అస హ్యం! కాని, ఇది ఒక విధమైన బలిదానం లాంటిది. ఉత్తమ జీవితాన్ని సాధించడం కోసం సాగుతూన్న బలిదానం ఇది! జై జై జై ఉత్తమ జీవన విధానానికీ జై!"

అతనితో పాటు అతని పాలేళ్లు కూడా పెద్ద పెట్టున జయ జయ ధ్వానాలు చేశారు. తరువాత ఆ గదిలో నుంచి వాళ్ళందరూ బయటికి పోతూన్న చప్పుడు బోండాం మీరీ విన్నాడు. కొద్ది క్షణాల పాటు పక్క మీద నుంచి కదిలేందుకు వాడు సాహసించ లేక పోయాడు. తర్వాత - ఇక ఆ ప్రతీక్షా నరకం అనుభ వించడం వాడికి అసాధ్యం అయింది. తన ప్రక్క మీద నుంచి జాగ్రత్తగా వాడు లేచాడు. తాను తొడుక్కున్న రాత్రి గౌను విప్పే శాడు. తన నౌకరు

కుర్రాడి చిరుగుల గుడ్డలతో బయటికి జారుకున్నాడు. అడుగులో అడుగు పెట్టుకుంటూ, అతిజాగ్రత్తగా ఇటూ అటూ చూసుకుంటూ మెల్లగా వాడు వంటింటి తలుపు దగ్గిరికి చేరుకున్నాడు. తలుపు తీసి, బయటికి తొంగి చూశాడు. శుక్లాష్టమి దోర వెన్నెలలో ఎక్కడ ఏమి ఉన్నదీ బాగా కనిపిస్తూంది. పశువుల దొడ్డి కంచె దగ్గిర పాలేళ్ళు వరుసలు దీరి కొందరూ, గుంపులు గుంపులుగా కొందరూ నిలబడి ఉండడం వాడు స్పష్టంగా చూశాడు. అప్పటికే జాన్ షీర్స్ తేనెవాగు దాటు తున్నాడు. ఆయన సరాసరి వెళ్ళి బేబ్ ఉన్న కోష్ఠం తలుపు తెరిచాడు. వెంటనే మళ్ళీ పశువుల దొడ్డిలోకి పరిగెత్తుకుంటూ వచ్చేశాడు. కొద్ది సేపటిలోనే బేబ్ తల ఆ కోష్ఠం గుమ్మంలో కనిపించింది. నిష్కల్మషము లైన దాని విశాల నేత్రాలు 'ఏమిటి ఇదంతా?' అన్నట్టు ఒక్కసారి చుట్టూ కలయ జూసినయి. అంతలో - తన కిష్టమైన కేరట్ గడ్డలు ఒక పెద్ద తెల్లని మేటికి మేటి ఎదురుగా పడి ఉండడం చూడగానే ఆకలితో దాని కళ్ళు మిల మిల లాడినయి. ఏడు వందల గజాల స్థలంలో అక్కడక్కలు ఇలాగే మరికొన్ని చోట్ల మేట్లుమేట్లుగా ఆ దుంపలు పేర్చబడి ఉన్నయి. బేబ్ వెంటనే ఆ కేరట్ చేలో ప్రవేశించి పెద్ద కొండలాగ పడి ఉన్న మొట్ట మొదటి విషపు కేరట్ దుంపల రాశిని ఆరగించడం మొదలు పెట్టింది. జాన్ షీర్సూ, అతని పాలేళ్లూ దూరంగా నిలబడి విజయానందంతో హర్షధ్వానాలు చేస్తున్నారు.

ఇక్కడ వంటింటి గుమ్మంలో నిలబడ్డ బోండాం మీరీని భయం, నిరాశ, దారుణమైన నిస్సహాయ భావం నిశ్చేష్టుణ్ణి చేసినయి. జాక్ షీర్స్ పన్నాగాన్ని ఎలాగైనా భంగ పరచడానికీ, అప్పటికే ఆ వలస గ్రామం మీద తన నీడను ప్రసరింప జేసిన రానున్న దారుణ విషాద సంఘటనను ఎలాగైనా నివారించడానికీ ఏదో ఒక ఉపాయం ఆలోచించాలని విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు, బోండాం మీరీ. నిమిషాలు యుగాల లాగ గడుస్తున్నయి. కాని, 'తన' వల్ల ఏ మవుతుంది? అందరి చేత అసహ్యించుకోబడుతూ, ఆ పన్నాగాన్ని గూర్చి కూడా ఏమీ తెలుపనంతటి నిర్లక్ష్య భావంతో చూడబడుతూన్న ఒట్టి 'బోండాం మేరీ' ఆయె 'తను'! కాని, అంతలో - కర్రెద్దు కోసం జనుము కోసి వేసిన నాటి నుంచీ వాడి చెవుల్లో నిరంతరం మోగుతూగున్న రొద వాడి మనస్సుని ఒక్క తాపు తాచి, తెగువతో కూడిన ఒక ఊహని వాడి బుర్రలో ప్రవేశ పెట్టింది. అమిత క్రోధంతో ఆ పెద్ద తేనె టీగలు బుమ్, బిల్ నిర్విరామంగా చేస్తూన్న ఝుంకారపు రొద అది! తనకి ఎటువంటి అపద మూడినా సరే, వెళ్ళి ఆ రెండు తేనె టీగల్నీ తేనెపట్టు లోనుంచి విడుదల చెయ్యాలని బోండాం మీరీ నిశ్చయించుకున్నాడు. అవి ఆ కర్రెద్దు మీద నిష్ఠురంగా దాడిచేసి, దాన్ని ఆ వికృతమైన కేరట్ చేలో నుంచి దూరంగా తరిమి వేయగలవని వాడికి తెలుసు. అందు చేత వాడు ఆ వంటింటి గుమ్మం లోనుంచి బలవంతాన ఊడి బయట పడి, తన స్థూల కాయం అనుమతించి నంత వేగంగా ఆ తేనెపట్టు



"....జాన్ షీర్స్ దూరం నుంచే వాటిని చూసి, వెనక్కి తిరిగి పోవలసిందని బొబ్బలు పెట్టాడు....."

(చూడు: పుట. 174)

వంకకు నడిచాడు. ఎవ్వరి కంటా పడకుండా దాన్ని చేరుకున్నాడు. ప్రాణాలకి తెగించేసి గట్టిగా ఆ తేనె గూడు గడియ పైకెత్తాడు. ఆరు, పన్నెండు, పద్ధెనిమిది, ముప్పయ్యారు, అరవై అంగుళాలు పైపైకి ఆ గడియ లేచింది. రొప్పుకుంటూ బోండాం మీరీ తేనె గూడు తలుపు తెరిచాడు. వెంటనే ఆ తేనె టీగలు పెద్ద రొద చెయ్యడం మొదలు పెట్టినయి. చెవులు గడియలు పడేట్టు చప్పుడు చేస్తూ అవి గూడు లోనుంచి బయటికి దూసుకు వచ్చినయి. వాటి వాటి రెక్కలు అమిత వేగంగా, బలంగా కదులు తున్నయి. రెక్కల గాలికి వాడి వీపు మీద చొక్కా ఎగిరి పోయింది. ఒక క్షణం పాటు సందేహంగా ఆ తేనె టీగలు ఇటూ అటూ తారట్లాడి నయి. అంతలో కారట్ చేలో ఉన్న కర్రెద్దును అవి పసిగట్టినయి. ఒకదాని వెనుక ఒకటి సైనికుల్లాగ వరుసదీరి ఆ వంకకు సాగి పోయినయి. జాక్ షీర్స్ దూరంనించే వాటిని చూసి, వెనక్కి తిరిగి పోవలసిందని బొబ్బలు పెట్టాడు. కాని, అవి మామూలుగా ఎంతో విధేయంగా ఉండే తేనెటీగలే అయినా, ఇప్పుడు షీర్స్ పొలికేకలు అవి మరింత క్రోధంగా ఝుంకారం చెయ్యడానికే సహాయ పడ్డయి. ఆ కర్రెద్దు చుట్టూ మూడు సార్లు ఆ తేనె టీగలు ప్రదక్షిణం చేసినయి. తరువాత దాని మీద వాలి, కసిగా ఆపాద మస్తకం కుట్టి వేయడం మొదలు పెట్టినయి. బేబ్ పెద్దగా అంకెలు వేస్తూంది. ఆ అంకెలు వేస్తూన్నప్పుడు దాని నోటి నుంచి వెలువడిన గాలికి పాలేళ్లంతా కంచె గుండా దూసుకు పోయి బయటికి వెళ్ళి పడ్డారు.

జాన్ షీర్స్ మాత్రం కూరల మళ్ళ గుండా ఆ తేనెటీగలను తరుముతూ వస్తున్నాడు. బాధతో అరుస్తూన్న ఆ కర్రెద్దును అతడు సమీపించడం, అద్భుతమైన ఒక తన్ను తన్నడానికి ఆ ఎద్దు తన వెనుక కాళ్ళు రెండూ పైకెత్తడం సరిగ్గా ఒక్కసారి జరిగినయి. 'బేబ్' తాలూకు బ్రహ్మాండమైన కాలి డెక్క అతని కనుబొమ్మలకీ, చీలమండలికీ మధ్య వెళ్ళి బలంగా తగిలింది. అతడు గాలిలోకి బాగా ఎత్తుగా ఎగిరి పోయి, సరాసరి మేఘాలు ముద్దాడే కలకండ కొండ శిఖరం మీదుగా ప్రయాణించి, అవతలి వేపుకి వెళ్లి పడ్డాడు.

బేబ్ తన తోకతో ఆ తేనె టీగలను తోలి వేసుకోవాలని ప్రయత్నించింది. ముందు కాళ్ల డెక్కలతో నేల గోకి ధూళి మేఘాలు పైకి లేచేట్టు చేసింది. తన రెండు కొమ్ముల మీద తల్లక్రిందులుగా లేచి నిలబడింది. అయినా, ఆ తేనె టీగలు దాని మీదనే కూచుని కుడుతున్నయి. చిట్ట చివరికి - ఆ కర్రెద్దు ఆ కేరట్ చేను వదలి దౌడు తీయడం మొదలు పెట్టింది. వెళ్ళి, వెళ్ళి తిన్నగా తన పవిత్రాలయం అయిన కోష్ఠం చేరుకుంది. అంతవరకూ దాన్ని వెంటబడి తరుముకుంటూ వెళ్ళిన ఆ తేనె టీగలకు కోష్ఠం లోకి ప్రవేశించే సాహసం లేక పోయింది.

బేబ్ పెట్టిన అంకె బోండాం మీరీ క్రిందపడి ఆ పాలేళ్ల మధ్య పొర్లు దండాలు పెట్టేట్టుచేసింది. చివరకు ఎలాగో లేచి నిలబడ్డాడు. ఆప సోపాలు పడుతూ ఆ పాలేళ్ళ నుంచి దూరంగా కాలివంతెనదిక్కుగా

పరిగెత్తడం మొదలుపెట్టాడు. కంచెగుండా దూసుకు రావడంలో తమ ఒంటి నిండా గుచ్చు కున్న ముళ్లను తీసి పారేసుకున్న తర్వాత, ఆ పాలేళ్లు బోండాం మీరీ వెంట పరుగెత్తారు. కాలి వంతెన మీద సగానికి వెళ్లిన తర్వాత వాళ్ళు అతన్ని పట్టుకున్నారు. కాని, వాళ్ళు వాణ్ణి బాదడం మొదలు పెట్టేలోగా, 'బేబ్' అంకెకు మెల కువ వచ్చి అడావిడిగా పక్కల మీద నుంచి లేచి వచ్చిన కలప కూలీలు వంతెన రెండో వేపు నుంచి వచ్చి పడ్డారు. అప్పుడు ప్రారంభమైంది — చరిత్ర ప్రసిద్ధమైన 'కాలి వంతెన మహా సంగ్రామం.' ఆ సంగ్రామంలో ఇరుపక్షాలూ బోండాం మీరీ స్థూలమైన శరీరం మీదుగా ఒండొంటిని చేరు కోవాలని వ్యర్థంగా ప్రయత్నం చేసినయి. నిమిషానికి వందల కొద్దీ దెబ్బలు బోండాం మీరీ వంటి మీద పడుతున్నయి. రాత్రంతా అలా ఆ యుద్ధం నిర్విరామంగా సాగుతూనే ఉంది. ఇక్కడ - కోష్ఠంలో బేబ్ బాధగా ఘీంకారం చేస్తూంది; తేనె గూడులో బుమ్, బిల్లూ సంతోషంగా, సంతృప్తిగా ఝుంకారం చేస్తున్నయి.

సూర్యోదయమై, పాల్ బనియన్ ఆ వలస గ్రామానికి తిరిగి వచ్చిన తరువాత గాని, ఆ యుద్ధం అంతం కాలేదు. ఆయన ఆ కలప కూలీలనూ, వ్యవసాయపు పాలేళ్ళనూ గంగిరేణి తోపు ముందరి మైదానంలో హాజరు కావలసిందని ఆదేశించాడు. తర్వాత వాళ్ళను సంజాయిషీ అడిగాడు. అతి భయంకరమైన యుద్ధంలో

ఒళ్లంతా హూనం హూనం అయిపోయి ఉన్నందు వల్ల ఇరు పక్షాల లోను ఎవ్వరూ వెంటనే జవాబు చెప్ప లేక పోయారు. కాని చివరికి బోండాం మీరీ గుంపు మధ్య నుంచి ఎలాగో ఓపిక తెచ్చు కుని దారుణమైన తన గాథంతా యజమానికి వినిపించాడు.

"ఓహోహో! ఎంతటి ధైర్యమూ, సాహసమూ ప్రదర్శిం చావ్ మీరీ!" అని పాల్ బనియన్ వాణ్ణి ప్రశంసించాడు. "నేను ఇందుకు నీకు ఏమి బహుమతీ ఇవ్వాలో నాకు తోచడం లేదు."

"నాకు కలప కూలీల మేస్త్రీ కావాలని చాలా రోజులుగా కోరికగా ఉందండి - బనియన్ గారూ!" అన్నాడు బోండాం మీరీ.

"బాగానే ఉంది గాని, మరి మేస్త్రీకి మేస్త్రీ వేసుకునే యూనిఫారం దుస్తులు సరిపోవాలి గదా! నువ్వు చూడ బోతే.... ఏం చెప్పను!.... వట్టి బోండాం మీరీ వాయె!"

వెంటనే బోండాం మీరీ అలిసిపోయి ఉన్న ఆ జనాన్ని తోసుకుంటూ విజయ గర్వంతో ముందుకు వచ్చి నిలబడ్డాడు. చిత్రంగా వాడి ఒంటి మీద ఒక్క గాయం కూడా లేదు. నఖశిఖ పర్యంతం వాడు పూర్తిగా ఒడిలి పోయి ఉన్నాడు. అయినా, అతి గర్వంగా వాడు ముందుకు వచ్చి నిలబడ్డాడు. ఎందు కంటే - ఇప్పుడు వాడు నిన్నటి ఏడు వందల ఏభై పౌన్ల బోండాం మీరీ కాడు; ఉక్కు కడ్డీలాగ గట్టిగా, బలంగా ఉన్న రెండు వందల

యాభై పౌన్లు మాత్రమే బరువు గల ఒక కలప కూలీ! ఆ సుదీర్ఘ యుద్ధంలో పౌను పౌను చొప్పున ఒక పాతిక టన్నుపై చిలుకు కొవ్వు వాడి శరీరం లోనుంచి నొక్కి, అదిమి, పిండి వేయబడింది. దానితో వాడి స్థూలత్వం కాస్తా కరిగి పోయింది. వింతలలో కల్లా వింత జరిగింది! పాల్ బనియన్ తన కళ్లను తనే నమ్మలేక పోయాడు.

"నిన్ను తప్పకుండా కలప కూలీల మేస్త్రిని చేస్తాను" అన్నా డాయన, బోండాం మీరితో.

'బేబ్' తన్నగా వెళ్లి పడిన చోటు నుంచి ఆ గ్రామానికి తిరిగి రావడానికి జాన్ షీర్స్‌కి మూడు వారాలు పట్టింది. వినయ్రముడు, వినీతుడు, విధేయుడు, విశేష పశ్చాత్తప్తుడుగా అతడు పాల్ బనియన్‌ని సమీపించి, తన కోసం ఎదురు చూస్తూ ఉంటుం దని తానాశించిన దారుణ దండన అనుభవించ డానికి తాను సిద్ధంగా ఉన్నట్లు ప్రకటించాడు. తక్కువలో తక్కువ ఒక్క మాసం పాటు తన చేత గులక రాళ్ళు తినిపించడమైనా జరుగ వచ్చునని అతడు అనుకున్నాడు. కాని, సజ్జనుడూ, సర్వ శక్తిమంతుడూ అయిన పాల్ బనియన్ అతన్ని ఏమీ అనకుండా ఇంటికి వెళ్లి పొమ్మన్నాడు. ఆ విషపు కేరట్ దుంపల మీద నిషేధాజ్ఞ జారీ చేశాడు.

### బోండాం మీరీ

ఇక - బోండాం మీరీ విషయం: జాన్ షీర్స్ తిరిగి వచ్చాడని తెలియగానే వాడు తన తల మీద టోపీ తీసి నలిపి వేశాడు. (ఇప్పుడు వాడు రోజూ పాపిడి తీసి తల దువ్వు కోడం మానేశాదు లెండి) పళ్లు పటపటా కొరికాడు.లాగూ పైకి తీసుకుంటూ,—"రండి! వాడి శరీరం మీదుగా నడిచి పోదాం! వాడిచేత పాత చెప్పులు తిని పిద్దాం! వాడి తలలో గుంజు వాలిచేదాం!" అని గర్జించాడు.

నిజంగానే బోండాం మీరీ కలప మేస్త్రి అయి, అటు తరువాత సుఖంగా, మహా వైభవంగా జీవితం గడిపాడు.

